# ఆత్మబోధ

స్వామి సుందర చైతన్యానంద

జగత్తు యావత్తు మనుగడ
మనస్సుపై ఆధారపడి యున్నది.
మనోప్రతిభ చైతన్యములో
తలదాచుకొని యున్నది.
కనుక సర్వము చైతన్యము
వందే కలదు.
తానెవరో తనకు తెలిస్తే
తెలుసుకోవలసింది ఈ
ప్రపంచంలో ఏమీ మిగలదు.
ఇదియే జ్ఞానము.
జ్ఞాన చక్షువు గలవారికి
సర్వమూ బ్రహ్మస్వరూపమే.
దృష్టిదోషము లేని సృష్టివీక్షణము
బ్రహ్మానుభూతిని ప్రసాదిస్తుంది.
బ్రహ్మమే నీవు.
నీ కన్యమైన దంటూ లేదు.
ఇదియే నిజమైన బోధ.
బాధలను సమూలంగా
సమాధిచేసే జ్ఞానబోధ.
ఆత్మ జ్ఞాన బోధ.
ఆదిశంకరుల ఆత్మబోధ.
అమూల్యమైన ఆదిశంకరుల
ఆత్మబోధ గ్రంథమునకు
శ్రీ స్వామీజీ చేసిన విశిష్ట
వ్యాఖ్యానము వరిష్ఠమైనది.
వేదాంత మార్గాను యాయులకు
ఈ గ్రంథము కరదీపిక వంటిది.



ఆత్మబోధ

స్వామి సుందర చైతన్యానంద

తృతీయ ముద్రణము వరకు 4 వేల ప్రతులు
చతుర్థ కెరటము ... మార్చి 1994 ... 2 వేల ప్రతులు
పంచమ కెరటము ... జనవరి 1995 ... 2 వేల ప్రతులు



ప్రతులకు :

సుందర చైతన్య ఆశ్రమం
ధవళేశ్వరం - 533 125
ఫోన్ : 378

వెల: రు 20-00

ముఖచిత్ర రచన: బాబూరావు

ముద్రణ :
శ్రీ లక్ష్మీగణపతి బైండింగ్ వర్క్స్
కొవ్వూరు - 534 350
ఫోన్: 575



జ్ఞానబ్రహ్మ
పూజ్యశ్రీ స్వామి సుందర చైతన్యానంద

ఆది శంకరుల

# ఆత్మబోధ



జ్ఞానబ్రహ్మ

స్వామి సుందర చైతన్యానంద




## ఉపోద్ఘాతము

సూర్యునికి దూరమైన ప్రపంచం అంధకార బంధురం. ప్రపంచము దూరమైనను సూర్యుడు దివ్యతేజోమయం. చైతన్యమైన ఆత్మ లేనిచో జగద్రూపం శూన్యం. జగత్తు అదృశ్యమైనను ఆత్మస్వరూపం శాశ్వతం.

చూసేవాడు లేనిదే జగత్తునకు అస్థిత్వములేదు. చూసే వ్యక్తి చైతన్యము. చైతన్యము వలననే జగత్తు ఉనికి తెలియుచున్నది. చైతన్యము నిత్యమైనది. సత్యమైనది. ముక్తమైనది. జగద్విలక్షణమైనది.

ఆత్మను దర్శించిన వానికి జగత్తు ఆత్మకన్నా అన్యము కాదు. దర్శించు తనకన్నా అన్యమైన దేమియులేదు. తాను ఉన్నట్లు ప్రపంచము ప్రకటించగలదా? లేదు. నేను పరిశీలిస్తున్నాను. ప్రకటిస్తున్నాను. నా పరిశీలనలు, ప్రకటనలు కేవలం నా మానసిక భావాలు మాత్రమే. ఆ మానసిక భావాలు కూడా స్థిరంగా ఉండవు. స్థిమితముగ నిలువవు. నిద్రించువానికి జగత్తు లేదు. చూచేవాడున్నంత వరకే చూడబడు జగత్తు ఉన్నది.

కనుక జగత్తుయొక్క అస్తిత్వము మనస్సుపై ఆధారపడి యున్నది. మనోప్రతిభ చైతన్యములో తలదాచుకొనియున్నది. కనుక సర్వము తనలోనే యున్నది. తానెవరో తనకు తెలిసివస్తే తెలుసుకోవలసిన దంటూ ఏమీ మిగలదు. ఇదియే జ్ఞానము. జ్ఞాన చక్షువు గలవానికి సర్వమూ బ్రహ్మస్వరూపమే. సృష్టి బ్రహ్మము కన్నా అన్యము కాదు. బ్రహ్మము సృష్టి చేయనూలేదు. బ్రహ్మము సృష్టికి ఆధారమూ కాదు. సృష్టిలో అంతర్లీనమూ కాదు. బ్రహ్మమే సృష్టి. వీక్షణములో దోషము లేనిచో అంతయూ ఆత్మయే. అదియే నీవు. నీ కన్యమైనదంటూ లేదు. ఇదియే నిజమైనబోధ. బాధలను సమూలంగా సమాధిచేసే జ్ఞానబోధ. ఆత్మ జ్ఞానబోధ. ఆదిశంకరుల ఆత్మబోధ.

శ్రీ శంకరుల ప్రస్థానత్రయ భాష్యములలో ఆత్మబోధయే ప్రధానాంశమై, కేంద్ర విషయమై ఉండును. ప్రస్థానమనగా ప్రమాణమని భావము. సనాతన ధర్మము త్రివిధ ప్రమాణములపై ఆధారపడి యున్నది. ఈ త్రివిధ ప్రమాణములను ప్రస్థానత్రయమని పిలుతురు. అవియే ఉపనిషత్తులు, భగవద్గీత మరియు బ్రహ్మసూత్రములు. ఉపనిషత్తులు శ్రుతిప్రస్థానము. భగవద్గీత స్మృతి ప్రస్థానము. బ్రహ్మసూత్రములు న్యాయ ప్రస్థానము. ప్రస్థానత్రయముపై శ్రీ శంకరులు చేసిన వ్యాఖ్యానము అద్భుతము. అనిర్వచనీయము.

శ్రీ శంకరుల రచనలను మూడు విధములుగ విభజింప వచ్చును. అవి (1) భాష్యములు-అనగా ప్రస్థానత్రయముపై వారు చేసిన వ్యాఖ్యానములు. (2) స్తోత్రములు-సర్వదేవతా మూర్తులపై శ్రీవారు రచించిన ప్రార్థనలు. (3) ప్రకరణ గ్రంథములు-ప్రస్థానత్రయ వివరణమును అవగతము చేసుకొనుటకు అనువుగ-సర్వవేదాంత సిద్ధాంతములను తెలియజేయు ప్రారంభ సోపానములు. అట్టివానిలో



తత్త్వబోధ, వివేకచూడామ :, వాక్యవృత్తి, అద్వైతానుభూతి, దృగ్దృశ్యవివేకము, ఆత్మబోధ లనునవి ముఖ్యములు. మనము ప్రస్తుతము అధ్యయనము చేయు గ్రంథము ఆత్మబోధ, ఆత్మానందము నందించు అద్వైతబోధ.

ప్రస్థానత్రయ భాష్యములను చదివి అర్థం చేసుకోలేని వారలకు ఈ ప్రకరణ గ్రంథములు ఎంతగానో ఉపకరించును. న్యాయ ప్రస్థానములో సునిశిత విజ్ఞాన జనిత విమర్శనాత్మక దృష్టితో సిద్ధాంతీకరించిన వేదాంత విషయములను ఈ ఆత్మబోధ గ్రంథములో సులభ శైలిలో ఉదాహరణలతో మేళవించి బోధించుట జరిగినది.

' ఆత్మబోధ ' యనగా 'ఆత్మనః బోధ' అనగా ఆత్మజ్ఞానము అని ఒక అర్థము. 'ఆత్మైవబోధః' ఆత్మజ్ఞాన స్వరూపము అని మరి యొక భావము. ఆత్మ చైతన్యస్వరూపము. ఆత్మజ్ఞానము లేకపోవుటయే అజ్ఞానము. అజ్ఞానమే సంసార దుఃఖములకు హేతువై యున్నది. ఆత్మ జ్ఞానముతో అజ్ఞానము అంతరించిపోవును. ఆనందము అనుభూతిగ మిగులును. ఆత్మ అనంతము. అనంతమైన ఆత్మానందము అంతము గల కర్మలద్వారా పొందేందుకు వీలులేదు. పరిమితకర్మలు అపరిమితానందాన్నివ్వలేవు. కనుక జ్ఞానమొక్కటియే మార్గమై యున్నది. అజ్ఞానము అవిద్య గనుక విద్య ద్వారానే ఆత్మానందము కలుగవలెను. ఆత్మానందమే సర్వోపద్రవరహిత స్థితియై యున్నది.

సర్వదుఃఖములకు, సంసార వ్యామోహములకు అజ్ఞానము మూలకారణమై యున్నది. అజ్ఞానము నంతమొందించుటయే ప్రతి సాధకుని లక్ష్యమై యున్నది. అజ్ఞానమును అంతమొందించవలె

నన్నచో మొదట అజ్ఞానమనగా ఏమిటో తెలియవలెను. అజ్ఞానమన నేమిటో చర్చించెదము.

చర్చ దేనిని గురించి? జ్ఞానమును గురించి జరుగవలెను. జ్ఞానము చర్చ కందునా? అందదు. కనుక జ్ఞానమును గూర్చిన చర్చ అనవసరము. మరి అజ్ఞానము జ్ఞానమునకు విరుద్ధమైనందున చర్చించి సాధించేదంటూ ఏమీ ఉండదు. అజ్ఞానమును గూర్చిన చర్చ అనర్థ దాయకం. జ్ఞానమును గూర్చిన చర్చ అయోమయం. కనుక వేదాంత చర్చ యనునది కష్టతరమైన విషయమై యున్నది.

జ్ఞానము లేకపోవుటయే అజ్ఞానమనియూ, అందుచేత అజ్ఞానము అభావమని న్యాయశాస్త్రజ్ఞుల నిర్ణయము. అజ్ఞానము అభావమయ్యేందుకు వీలులేదు. దేని అభావము అజ్ఞానమని నిర్ణయించబడినదో అట్టి దాని జ్ఞానమేమిటి? జ్ఞానమనునది సాక్షీస్వరూపము. అనంతము. అనంతమైన జ్ఞానస్వరూపము అభావమయ్యేందుకు వీలులేదు.

సాక్షీ స్వరూపమైన ఆత్మజ్ఞానము మొదటిది. రెండవది వృత్తి జ్ఞానము. ఇది పరోక్ష జ్ఞానమై యున్నది.

**' విజ్ఞానేన వా ఋగ్వేదం విజానాతి '**

' విజ్ఞానము ద్వారా ఋగ్వేదమును అవగాహన చేసుకొనవలెను ' అని ఛాందోగ్యోపనిషత్ తెలియజేయుచున్నది. చక్షురాదీంద్రియములు చైతన్యము వలననే నడుపబడుచున్నవి. చైతన్యము నాధారముగ గ్రహించియే చరించు చున్నవి. కనుక చైతన్యము వలన కలుగు జ్ఞానము అభావమయ్యేందుకు వీలులేదు.

చివరగా జ్ఞానాభావమునుకూడా అజ్ఞానమని నిర్వచించేందుకు వీలులేదు. ' నాకు ఆ విషయము తెలియదు ' అనుచున్నను ఆ విషయమును గూర్చి తనకు తెలియదనెడి విషయమును తెలిసి యుండుటయే జరుగుచున్నది. ఒక ప్రత్యేక విషయమును తాను తెలియకున్నను, మరొక విషయమును తెలిసికొనుట జరుగుచునే యున్నది. కనుక సామాన్య జ్ఞానము నశించుటలేదు. సామాన్య జ్ఞానము వలననే ప్రత్యేక జ్ఞానము సమకూరుచున్నది. కనుక ఎటుచూసినను జ్ఞానము అభావ మయ్యేందుకు వీలులేదు. కనుక జ్ఞానాభావము అజ్ఞానము కానేరదు.



అజ్ఞానము అభావముకాదు. పోనీ భావరూపమని నిర్ణయించుటకు అది ఆత్మవలె చైతన్యమూ కాదు. అజ్ఞానము భావ రూపమైనచో ఆత్మ సాక్షాత్కారము శూన్యమే కాగలదు. కనుక అజ్ఞానము భావము కాదు. అభావము కాదు. సత్యము కాదు. అలాగని అసత్యము కాదు. మనస్సుతో నిర్ణయించేందుకు వీలులేదు. మనస్సు కూడా అజ్ఞానజనితమే. అజ్ఞాన దశలో నిలిచి అజ్ఞానమును అర్థం చేసుకోలేము. చీకటిలో నిలిచి చీకటిని అర్థం చేసుకోలేము. జ్ఞానదశలో కూడా అజ్ఞానము అవగతము కాదు. జ్ఞానస్థితిలో అజ్ఞానమును అర్థము చేసుకొన యత్నించుట వెలుతురు ద్వారా చీకటిని దర్శించు ప్రయత్న మవుతుంది. కనుక అజ్ఞాన మనునది ఏ దశయందును అర్థంకాని విషయమై యున్నది.

**' యత్ప్రమాణా సహిష్ణుత్వ మన్యదా వస్తుసాభవేత్ '**

' దీనికి ఏ ప్రమాణములేదు. ఇది సత్యవస్తువూకాదు ' అని బృహదారణ్యా కోపనిషత్ తెలియజేయుచున్నది. జ్ఞానము కలుగగనే అదృశ్యమగుచున్నందున ఇది సత్తుకాదు. అలాగని కుందేటి కొమ్మువలె అసత్యమూకాదు. అలా అసత్యమైనచో జగద్వ్యాపారములు నడిచేందుకే వీలులేదు.

సేయంభ్రాన్తి నిరాలమ్బా సర్వన్యాయ విరోధినీ
సహతే న విచారం సా తమో యద్వ ద్దివాకరమ్

ఈ భ్రాంతి ఆధారరహితమై యున్నది. న్యాయవిరోధమై యున్నది. సూర్యుని ముందు అంధకారము అదృశ్యమగులాగున జ్ఞాన ప్రకాశములో అజ్ఞానము అంతరించుచున్నది ' యని శ్రీ సురేశ్వరా చార్యులు నైష్కర్మ్య సిద్ధి యను గ్రంథములో బహుచక్కగా వివరించారు.

మరి ప్రస్తుతము మన కర్తవ్యమేమిటి? ఆత్మజ్ఞానమును పొందుటయే. ఆత్మజ్ఞానమును జారవిడుచు కొనినందున అజ్ఞాన వలలోపడి అలమటించ వలసివచ్చినది. ఆత్మ జ్ఞానము సర్వ అనర్థములను అంతమొందించును. ఆత్మ జ్ఞాన స్వరూపమైనందున బోధ ద్వారానే లభ్యపడును. అట్టి జ్ఞానబోధ ఉపనిషత్తులద్వారా లభించును. ఉపనిషత్తులలోని సిద్ధాంతములను తర్కయుక్తుల ద్వారా బ్రహ్మసూత్రములలో వ్యాస భగవానులు భద్రపరచారు. వేదాంతసూత్రము లనబడే ఈ బ్రహ్మసూత్రములకు వివిధ మతా చార్యులు వారి వారి సిద్ధాంతములకు అనుకూలముగా వ్యాఖ్య నడిపారు. వానిలో శ్రీ శంకరుల భాష్యము అసమానమై అలరారు చున్నది.

శ్రీ శంకరులవారి బ్రహ్మసూత్రభాష్యమునకు వారి ముఖ్య శిష్యులైన పద్మపాదాచార్యులు "పంచపాదిక " అనుపేర ఒక వ్యాఖ్యానమును రసవత్తరముగా రచించిరి. పద్మపాదులవారి వ్యాఖ్యపై వివరణాచార్యులవారు "తత్త్వదీపన " అను భాష్యమును రచించిరి.

శంకరులవారి సూత్రభాష్యముపై వాచస్పతి మిశ్ర 'భామతి' అను వ్యాఖ్యను రచించెను. భామతి వ్యాఖ్యానముపై అమలా నందుల వారు " కల్పతరు " అను వ్యాఖ్యను రచించెను. కల్పతరు



వ్యాఖ్యానముపై అప్పయ్య దీక్షితులవారు 'పరిమళ' యను వ్యాఖ్యను రచించిరి. పరిమళ వ్యాఖ్యాతవలె శ్రీ కొట్టయ్యూర్ లక్ష్మీనృసింహ వాజపేయుల వారు కల్పతరు వ్యాఖ్యానముపై 'అభోగ' అను భాష్యమును రచించిరి.

శ్రీ శంకరుల సూత్ర భాష్యముపై రామానందులవారు 'రత్నప్రభ' యను వ్యాఖ్యానమును రచించిరి. అలాగే శంకరుల శిష్యులైన ఆనందగిరి ఆచార్యుల వ్యాఖ్యపై 'ఆనందగిరీయ' మను వ్యాఖ్యను రచించిరి. అలాగే త్రయంబక భట్టాచార్యులవారు 'భాష్యభానుప్రభ' అను వ్యాఖ్యను రచించిరి.

మహారాష్ట్రదేశమునకు చెందిన రఘునాథసూరి శ్రీ ఆచార్యుల భాష్యము నందలి ఒక పాదమునకు వ్యాఖ్యానము రచించి దానికి 'శంకరపాదభూషణ' మని పేరిడెను. శంకరులవారి భాష్యానుసారముగ ఇన్ని వ్యాఖ్యానములు వెలువడుటలో ఆచార్యులవారి మేధా సంపత్తి ముంజేతి కంకణమువలె భాసించుచున్నది.

బ్రహ్మ సూత్రములపై శ్రీ శంకరులు రచించిన అద్వైత భాష్యముపై వ్యాఖ్యానములు కదిలినట్లే, బ్రహ్మ సూత్రములకు ద్వైతపరంగా శ్రీ మధ్వాచార్యులవారు చేసిన భాష్యముపై కూడా అనేక వ్యాఖ్యానములు దొర్లినవి. అవన్నియు అద్వైత సిద్ధాంతమును నిశితముగా ఖండించినవి. 'న్యాయామృత' మను ద్వైత గ్రంథము అద్వైతమును విమర్శించినది. ద్వైత గ్రంథమైన న్యాయామృతమును విమర్శిస్తూ శ్రీ మధుసూదన సరస్వతి 'అద్వైతసిద్ధి' యను గ్రంథమును రచించిరి. ఆ తరువాత 'అద్వైతసిద్ధి'ని విమర్శిస్తూ, ద్వైతపరంగా "తరంగిణి" అను గ్రంథము వెలువడినది. "తరంగిణి"ని విమర్శిస్తూ గురుశ్రేష్ఠులు, గౌడదేశీయులైన బ్రహ్మానందస్వామి "చంద్రిక" అను

వ్యాఖ్యను అద్వైతపరంగా రచించారు. ఈ వ్యాఖ్యకు గౌడబ్రహ్మానందీయమను నామము కూడా కలదు. "చంద్రిక"ను విమర్శిస్తూ వనమాలమిశ్ర యనునతడు "వనమాల మిశ్రీయము" అను వ్యాఖ్యను ద్వైతపరంగా నడిపిరి. ముందు తెలియజేసిన త్రయంబక భట్టాచార్యులు తన "భాష్యభానుప్రభ" యందు వనమాల మిశ్రీయమును విమర్శించుట జరిగినది.

బ్రహ్మానందుని "చంద్రిక" ను విమర్శిస్తూ అనంతాళ్వారులు "న్యాయ భాస్కర " యను వ్యాఖ్యను విశిష్టాద్వైత పరంగా రచించగా "న్యాయభాస్కర" ను విమర్శిస్తూ రాజుశాస్త్రి "న్యాయేందు శేఖర" అను వ్యాఖ్యను అద్వైత పరంగా రచించిరి.

ఒక్క గ్రంథముపై ఇన్ని వ్యాఖ్యలు కదిలాయి. ఇక ఎన్ని కదలనున్నవో! ఇదియే మన సనాతన ధర్మ మందించు జ్ఞాన వైభవము.

తన సూత్ర భాష్యములో జటిలమైన అద్వైత సిద్ధాంతమును అనూహ్య తర్కయుక్తులతో వివరించిన శంకరభగవత్పాదులు సామాన్య మానవులకు సైతము అద్వైత విజ్ఞానము అందుటకుగాను ప్రేమతో ఈ ఆత్మబోధ యను గ్రంథమును రచించారు. నిత్య జీవితములో గోచరించు సంఘటనలను, వస్తువులను ఆధారముగా గ్రహించి, చక్కటి ఉపమానములతో అత్యద్భుతంగా రచించారు. ఆత్మబోధ యను ఈ గ్రంథములో అరువది ఎనిమిది శ్లోకములున్నవి. శ్రద్ధా భక్తి సమన్వితులై పఠించు వారలు ఆనందమూర్తులు కాగలరు. ఆత్మవిదులై ప్రకాశించగలరు. ఆప్తకాములై శోభించగలరు.

సాధకుని మనస్సు ఆత్మారామునివైపు నడచుటకు ఈ గ్రంథము ఉపకరించును. ఆచార్యుల వారి ఆత్మబోధ శ్లోకాలను



పఠించి, చక్కగా మననము సాగించి, నిధిధ్యాస యందు కొనసాగు సాధకులు ఆత్మ సాక్షాత్కారమునొంది తరించుదు రనుటలో సందేహము లేదు. అంతఃకరణలో కదిలే మల, విక్షేప, ఆవరణాది దోషత్రయము సమూలముగ నశించును. సారవంతమైన శ్రవణముచే మలదోషము నశించును. సారతరమైన మననముచే విక్షేప దోషము నివారించబడును. సారతమమైన నిధిధ్యాసచే ఆవరణ దోషము నిర్మూలిం చబడును. దోషత్రయ విముక్తులు కాగానే ఆత్మ తోషముతో భాసించి ఆత్మజ్ఞానులై, జీవన్ముక్తులై ప్రకాశించెదరు.

ఈ గ్రంథము అవతారిక, శ్లోకము, ప్రతిపదార్థము, తాత్పర్యము, వ్యాఖ్యానము అనెడి క్రమముతో కదులుచున్నది. ముముక్షువులారా! అరువది ఎనిమిది జ్ఞానరత్నములచే ప్రకాశించు ఈ "ఆత్మబోధ" రత్నహారమును ధరించి శోభించెదరు గాక!

ముముక్షువులారా! అద్వైత మార్గంలో చరించు సాధకులకు ఆత్మబోధ అత్యంత ఉపయుక్తమైనదని చెప్పుటలో అతిశయోక్తి ఇసుమంతైనను లేదు. మూలము అమూల్యమైనదని మీకు తెలుసు. వ్యాఖ్యానము కూడా విశిష్టముగానే నడిచిందని నా భావము. ప్రథమ, ద్వితీయ, తృతీయ ముద్రణములు జిజ్ఞాసువులచే చక్కగా ఆదరించబడినవి. ఇదిచతుర్థ ముద్రణము. ఈ ముద్రణము కూడా విశేషారాధనకు, ఆకర్షణకు నోచుకుంటుందని మా విశ్వాసము.

ప్రణవ ప్రేమలతో

అనంతాత్మలో

మీ

స్వామి సుందర చైతన్యానంద

## ఆది శంకరుల

# ఆత్మబోధ



ఓం

## ఆది శంకరుల

# ఆత్మబోధ

అవతారిక:- పూజ్యపాదులు, జగద్గురువరేణ్యులగు శ్రీ శంకరభగవత్పాదులు 'ఆత్మబోధ' గ్రంథమును ప్రారంభిస్తూ, ఈ గ్రంథమును శ్రవణము చేయు విద్యార్థి కుండవలసిన అర్హతలను, యోగ్యతలను ఈ ప్రథమ శ్లోకము ద్వారా తెలియజేయుచున్నారు.

తపోభిః క్షీణపాపానాం
శాంతానాం వీతరాగిణామ్
ముముక్షుణా మపేక్ష్యోయం
ఆత్మబోధో విధీయతే ॥ 1

తపోభిః = తపమాచరించుటచేత, క్షీణపాపానాం = పాపములు నశించి, శాంతానాం = ప్రశాంతత నొంది, వీతరాగిణాం = రాగములుడిగి, ముముక్షూణాం = మోక్షాపేక్ష గలవారికి, అపేక్ష్య = కోరదగిన, అయం = ఈ, ఆత్మబోధ = ఆత్మజ్ఞానము, విధీయతే = రచింపబడు చున్నది.

భావము:- **తపస్సుచేత పాపములు నశింపజేసికొనినవారును, శాంత స్వరూపులును, అనురాగము లేనివారును అగు ముముక్షువుల కొరకు వాంఛించదగిన ఈ ఆత్మబోధ లిఖింపబడుచున్నది.**

## వ్యాఖ్య

ఆత్మబోధను గ్రహించు విద్యార్థి కుండవలసిన అర్హతలను, మానసిక వాతావరణమును శ్రీ శంకరులు ఈ శ్లోకములో తెలియజేయుచున్నారు. అర్హతలను తెలియజేయుటలో అర్హులను గ్రహించి, అనర్హులను గర్హించుట ఉద్దేశ్యము కాదు. అర్హులగు విద్యార్థులు సులభముగ పొందగలరు. అనర్హు

లగువారు అర్హతను పొందుటకు యత్నించవలెనని భావము. యోగ్యతను కనుపరచుటలో గ్రంథ ప్రాముఖ్యతను వివరించుటయే ముఖ్య విషయముగు చున్నదిగాని వ్యక్తిస్థాయిని నిర్ణయించు ప్రయత్నము అందు గోచరించుటలేదు.

ఆత్మ యొక్కటే వాంఛనీయము. మానవుడు పొంద యత్నించు ఆనందము ఆత్మయే అయి యున్నది. కనుక ఆత్మయే చింతించదగినది. స్మరించదగినది. ఆత్మానుభూతియే మోక్షము. మోక్షమును వాంఛించు ధీరపురుషుడే ముముక్షువు అని పిలువబడును. కేవలం వాంఛించినంత మాత్రాన ఫలితము సిద్ధించదు. అర్హతకూడా కల్గియుండాలి. ఆత్మ బోధను శ్రవణము చేయు ముముక్షువు పాపరహితుడై యుండవలెను. నిషిద్ధ కర్మాచరణమువలన సంక్రమించు మనో మాలిన్యమే పాపము. మలినమైన అంత:కరణ కలతచెంది అల్లరిభూతమై యుండును. సంసారము తయారగును. యాతనలు ప్రారంభమగును. అట్టివాడు ఆత్మ బోధను జీర్ణించుకొనలేడు. కనుక పాపములను నశింపజేసుకొనవలెను. తపస్సుచేత పాపములు నశించును.

తపస్సనగా తపించుట యని భావము. భగవంతునికై నిరంతరము తపించుటే, పరితపించుటే నిజమైన తపస్సు. దేహేంద్రియ మనోబుద్ధులను ఆధ్యాత్మిక కార్యములలో ఉంచి, భగవదాలోచనలలో రమించుటయే తపస్సు తపమాచరించువాని మనస్సు నిర్మలమగును. రజోగుణ జనిత ఆవేశము తమోగుణ జనిత అలసత్వము నశించి, సత్త్వగుణ ప్రధానమైన ఆనందము అంత:కరణలో పొడసూపును. సదా భగవదాలోచనలో తపించు మనస్సు దైవముతో నిండియుండును. తనలో దైవస్వరూపము లేని మనస్సు భగవానునికై బయట ఎలా ప్రయత్నించగలదు? నిరంతరము బ్రహ్మాకారవృత్తి కదులు మనసులో పాప సంకల్పాలెలా పొడసూప గలవు? అంత:కరణ తపస్సుచే శుద్ధి పొందును. తపోధనుడగువాని ఆంతర్యములో విషయ లోలత్వ ముండదు. విషయములు విషముకన్నా భయంకరమైనవని తలచి జాగరూకుడై యుండును.

**విషం విషయ వైషమ్యం నవిషం విషముచ్యతే '**



విషము ఒక విషమా? విషయ వైషమ్యమే నిజమైన విషము ' అని మహో పనిషత్తు తెలియజేయుచున్నది. విషము ఒక్క మరణమును అందించును. విషయములు అనేక మరణములలో పడద్రోయును. ఈ విషయమును చక్కగా నెరిగి వివేక వైరాగ్యములచే ఇంద్రియ మనో బుద్ధులను అంతర్ముఖంచేసి, తపమాచరించు సాధకుడు పాపవలయము నుండి బయటపడును.

పాపములు క్షీణించి, మనోమాలిన్యము అంతరించిన అంత:కరణలో శాంతము చోటు చేసుకొనును. అదియే మనోనైర్మల్యము. వాసనాక్షయము వలన ప్రాప్తించిన నిర్వికల్పశాంతము. శాంతి నొందిన అట్టి మనస్సు ధ్యాన జీవనము గడుపుటకు అనుకూలమగును. అంతర్ముఖాను భూతికి అర్రులు చాచుచుండును. సంకల్పములు కదల నిష్టములేక లయించును. అదియే శాంతి జీవనము.

మనస్సులో పాపములు నశించగనే తద్వారా కలిగిన ప్రశాంతతను ఆంతర్యములో అనుభవించు సాధకుడు రాగరహితుడై యుండునని ఆచార్యులు తెలియజేయుచున్నారు. వాసనాక్షయము జరిగి, శాంతి జీవనమునకు అలవాటుపడినవానిలో అభిమాన అహంకారాదులు నశించుటచేత ప్రత్యేక ఆకర్షణలకు మనస్సులో చోటు కొరవడుటచే అనురాగము అర్థము కానివాడై యుండును. అలజడులు అణగి సంకల్ప రహితుడై యుండును. అట్టివాడు కోరదగినది మోక్షమే అయి యున్నది. అలాగాక ఆందోళనాపూరిత ఆవేశములను పొందిన మనస్సు తాను కలత చెందుటయేగాక మన ప్రగతిని కూడా నిరోధించును.

' It is your relaxed and easy worker, who is in no hurry, and quite thoughtless most of the while of consequences. Who is your efficient worker, and tension and anxiety, and present and future, all mixed up together in our mind at once, are the surest drags upon steady progress and hindrances to our success' అని విలియం జేమ్స్ వ్రాయడం జరిగింది.

తపస్సుచేత పాపములు నశించినవి. తద్వారా అంత:కరణలో ప్రశాంతత నిండుకున్నది. అనురాగము అదృశ్యమైనది. ఇదియొక నిరామయ నిస్సంకల్పస్థితి. ఈ స్థితిలో ఆత్మబోధ జరిగి స్వరూపానుభూతి కలుగవలెను. ప్రశాంతతలో ఓలలాడు అంత:కరణను అలాగే కొనసాగించినచో అది మళ్ళీ అలజడులకు ఆలయమయ్యే ప్రమాదము లేక పోలేదు.

' The let-alone principle is dangerous ' అని ' స్వెట్ మార్డన్' ' రైజింగ్ ఇన్ ది వరల్డ్ 'అనే గ్రంథములో వ్రాశాడు. కనుక శాంతి నిలయమైన అంత:కరణలో ఆత్మబోధను చొప్పించవలయును. ఆచార్యులు ఈ విషయమునే తెలియజేయుచున్నారు.

మనస్సులో శాంతి యున్నది. శాంతితోపాటు చైతన్యమున్నది. శాంతి చైతన్యము కన్నా అన్యము కాదు. శాంతియనునది చైతన్యము వలన కలిగినది. చైతన్యమే శాంతిగా తెలియుచున్నది. ఇది తెలిసి చైతన్య శాంతిలో మునిగి, తానే చైతన్యమని గ్రహించుటయే ఆత్మబోధ. అఖండానంద బోధ.

అవతారిక:- అఖండానంద మయమగు మోక్షమునకు జ్ఞాన మొక్కటియే మార్గమని ద్వితీయ శ్లోకములో తెలియజేయుచున్నారు.

బోధోన్య సాధనేభ్యోహి
సాక్షాన్మోక్షైక సాధనమ్
పాకస్య వహ్నివత్ జ్ఞానం
వినా మోక్షో న సిద్ధ్యతీ ॥ 2

అన్యసాధనేభ్య: హి = ఇతర సాధనల కంటెను, సాక్షాత్ = ముఖ్యముగా, మోక్ష సాధనమ్ = మోక్షమునకు సాధనము, బోధ: హి = జ్ఞానమొక్కటియే, పాకస్య = వంటచేయుటకు, వహ్నివత్ = అగ్నివలె, జ్ఞానంవినా = జ్ఞానము లేనిచో, మోక్ష: = ముక్తి, నసిద్ధ్యతీ = లభ్యముకాదు.

**భావము:- వంటచేయుటకు నిప్పుప్రధాన సాధనమైనట్లు మోక్షమునకు జ్ఞానము ముఖ్య సాధనమై యున్నది. ఇతర సాధనలతో పోల్చినపుడు జ్ఞానమొక్కటియే మోక్షమునిచ్చు సాధన.**



## వ్యాఖ్య

అజ్ఞాన నివృత్తి-ఆనంద ప్రాప్తియే సర్వసాధనల ముఖ్యాశయమై ఉన్నది. ఆత్మానందము నొందుటకు కర్మ, భక్తి, యోగ మార్గము లెన్ని యుండినను జ్ఞానమే సూటిదారియని, మేటిదారి యని ఆచార్యులు ఈ శ్లోకంలో తెలియ జేయుచున్నారు. జ్ఞానము లేనిదే మోక్షము రాదని నొక్కి వక్కాణించుచున్నారు.

మోక్షప్రియులమై మనము సాధన లాచరించుచున్నాము. మోక్ష మనగా ఆత్మసాక్షాత్కారము లేదా బ్రహ్మానుభూతి.

**' తరతి శోక మాత్మవిత్ '**

ఆత్మ నెరిగినవాడు శోకమును దాటునని వేదప్రవచనము.

**' బ్రహ్మవిద్ ఆప్నోతి పరమ్ '**

బ్రహ్మము నెరుగువాడు బ్రహ్మమే కాగలడని వేదనిర్ణయము.

అనంతుడు కాగలడని భావము. అపరిమితుడు కాగలడని అర్థము. ఇంతకూ మనము పరిమితులమా? అపరిమితులమా? మనము అపరిమితులమే. అనంతాత్మయే అయియున్నాము. అనంతమే మన స్వరూపము. అనంతము మన స్వరూపమైనచో అనంతమును పొందుటకు మన మేల ప్రయత్నించవలెను? ఒకవేళ మనము పరిమితులమే అని భావించినచో, పరిమితులమైన మనము అనంతమగుటకు ఏల ప్రయత్నించవలెను? అంతము గలది ఎన్నడూ అనంతము కాలేదు. కనుక మనము అనంతాత్మయే అయియున్నాము. అది తెలియకపోవుటచేత అనంతమును పొంద యత్నించు చున్నాము. అదియే అజ్ఞానము. అనంతాత్ముడైన నన్ను అనంతము నుండి వేరైనట్లు చూపునది అజ్ఞానము. అవిద్య.

అజ్ఞానము నంతమొందించినచో ఆత్మానుభూతి కలుగ గలదు. ఆత్మానుభూతికి ఇంద్రియములు సహకరించలేవు. నేత్రాలు దృశ్యముల జ్ఞానము నందించగలవు గాని దృక్కుయైన ఆత్మయొక్క జ్ఞానము నందించలేవు.

వీనులు శబ్ద విషయములను తెలియజేయగలవుగాని నిశ్శబ్దమై, నిరంజనమై భాసిల్లు ఆత్మను ఎరుక పరచలేవు.

" అచక్షుః శ్రోత్రం తదపాణి పాదమ్ "

" ఆత్మకు నేత్రములు లేవు. చెవులు లేవు. హస్తపాదములు లేవు " అని ముండకోపనిషత్తు తెలుపుచున్నది.

" అన న్తశ్చాత్మా విశ్వరూపో హ్యకర్తా "

" ఆత్మ అనంతము; సర్వరూపధారి; నిష్క్రియత్వము; " అని శ్వేతాశ్వతర ఉపనిషత్తు తెలుపుచున్నది.

" తత్సత్యం స ఆత్మా "

" అది సత్యము, అదియే ఆత్మ " యని ఛాందోగ్యోపనిషత్ తెలియజేయుచున్నది. అట్టి ఆత్మ అంతర్యామి గనుక మనము ఆత్మ స్వరూపులమే అయియున్నాము.

' ఏషత ఆత్మా సర్వాన్తరః '

" అందరిలో యుండెడి నీ ఆత్మయే అతడు " అని బృహదారణ్యకోపనిషత్ ప్రవచించుచున్నది.

ఆత్మ మనకు క్రొత్తదికాదు. కనుక దానిని కొనేది ఉండదు. ఉన్నదే గనుక కొనే ప్రసక్తిలేదు. లేనిదానిని పొందేందుకు కృషి అవసరము. ఉన్నదానిని పొందేందుకు కృషి అవసరమేమున్నది? ఋషిలా దర్శించడమే. అట్టి దర్శనమే జ్ఞానము. జ్ఞానమును తెలియజేయువాడు సద్గురువు. జ్ఞానమనునది సిద్ధాంతముకాదు. తత్త్వమూకాదు. సాధనకూడా కాదు. గురుబోధను ప్రశాంతంగా ఆలకిస్తే చాలు, జ్ఞానము కలుగుతుంది. జ్ఞానమే మార్గము, గమ్యము అయియున్నది. ప్రమేయమైన ఆత్మను గురించి ప్రమాతయైన ముముక్షువునకు ప్రమాణమైన వేదాంతము ద్వారా గురువు అందించగానే ఆత్మజ్ఞానము కలుగుతుంది. అట్టి జ్ఞానబోధ నాలకించుటలో ప్రమేయమైన ఆత్మ ప్రమాతయైన తానేనని ముముక్షువు గ్రహించి, గుర్తించి, అనుభవించడం జరుగుతుంది.



' ఆత్మ వారే ద్రష్టవ్యః '

'ఆత్మయే దర్శించ దగినది ' యని బృహదారణ్యకోపనిషత్‌లో యాజ్ఞవల్క్య మహర్షి తన భార్యయైన మైత్రేయికి తెలియజేయడము జరిగినది.

ఆత్మయే మన స్వరూపము గనుక దానిని క్రొత్తగా పొందలేము. ఆత్మ అనంతము గనుక దానిని దర్శించలేము. ఆత్మను నేను దర్శించవలె నన్నచో ఆత్మ దృశ్యము కావలెను. ఆత్మ నేను దర్శించుటకు దృశ్యమైనచో పరిమితమగును. అనంతాత్మ పరిమితమగు టెట్లు? So Atman Cannot be objectified. దర్శించేందుకు ఆత్మ వస్తువు కానేరదు. అది కేవలము వస్తురహిత చైతన్యమై యున్నది. ఆత్మను దర్శించుట యనగా తానే ఆత్మయని గ్రహించుట యగును. భార్య మగబిడ్డను ప్రసవించినది. తపాలా ఆలస్యముచేత వార్త భర్తకు అందలేదు. తండ్రి కావడానికి భర్త ప్రతిక్షణము కుతూహల పడుతూనే యున్నాడు. యదార్థానికి తాను తండ్రి అయియే యున్నాడు. ఇచ్చట కావలసింది తండ్రికి వార్త తెలియుటయేగాని తల్లి మళ్ళీ ప్రసవించనవసరము లేదు. అలాగే మనము ఆత్మయే అయియున్నాము. కావలసింది జ్ఞాన మొక్కటియే.

అందుచేతనే వంటకు నిప్పువలె మోక్షమునకు జ్ఞాన మొక్కటియే సాధనమై యున్నదని ఆచార్యులు తెలియజేయుచున్నారు.

వంట తయారగుటకు పప్పు, ఉప్పు, బియ్యము, కూరలు, దుంపలు అన్నీ యున్నవి. కానీ నిప్పు లేదు. ఏం లాభం? నిప్పు లేనిచో వంట తయారగునా? వంట తయారగుటకు నిప్పు అవసరము. అగ్నిలేనిచో పదార్థములన్నియు వాటి పూర్వస్థితిలోనే ఉండిపోతాయి. అలాగే ఎన్ని సాధనలాచరించినను జ్ఞానములేనిచో మోక్షము సిద్ధించదంటున్నారు శ్రీ శంకరులు.

సాధకులు కర్మ లాచరించవచ్చు. జపధ్యానాదులు సాగించ వచ్చు. తీర్థ యాత్రలు చేయవచ్చు. దానధర్మాలు కొనసాగించవచ్చు. తద్వారా అంతఃకరణ శుద్ధిపడవచ్చు. కానీ ఆత్మానుభూతి కలుగవలెనన్నచో జ్ఞానమును సముపార్జించ వలెను. జ్ఞానములేనిచో ముక్తి లభించదు.

జ్ఞానార్జన చేయు సాధకులు సాధన చతుష్టయసంపత్తి కలవారై యుండ వలెను. జ్ఞానాలయంలో ప్రవేశించగోరు ముముక్షువులు సాధన చతుష్టయ మనే నాలుగు ద్వారముల గుండా ప్రయాణం సాగించాలి. ఈ నాలుగు సాధనలు :- (1) వివేకము (2) వైరాగ్యము (3) షట్ సంపత్తి (4) ముముక్షుత్వము.

(1) వివేకము:- నిత్యా నిత్య వస్తు విచక్షణ వివేకమవుతుంది. ఏది సత్యము; ఏది అసత్యము? ఏది శాశ్వతము; ఏది అశాశ్వతము? ఏది సత్; ఏది అసత్? అని విశ్లేషించి, విచక్షణాపూరిత జ్ఞానమును కలిగియుండుట వివేకమనబడుతుంది.

(2) వైరాగ్యము:- వైరాగ్యమనగా నైరాశ్యమని చాలామంది అభిప్రాయ పడుతుంటారు. ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము వైరాగ్యమని భావము. ఒక్కమాటలో చెప్పాలంటే వివేకము ద్వారా అందిన నిర్ణయాలను ఆచరణలో పెట్టుటయే వైరాగ్యము అనబడుతుంది.

(3) షట్‌సంపత్తి:- షట్ సంపత్తి అనగా ఆధ్యాత్మికానుభూతికి ఉపకరించు ఆరు సుగుణములు. అవి (1) శమము (2) దమము (3) ఉపరతి (4) తితిక్ష (5) శ్రద్ధ (6) సమాధానము.

(i) శమము:- ఇంద్రియ విషయములలోని దోషముల ను పరిశీలించి, మన స్సును విషయముల నుండి మరలించి అంతర్ముఖంచేసి, శాంతి నొందిన అంత:కరణను భగవంతుని గూర్చి ధ్యానించుటకు సిద్ధపరచుట శమమగును.

(ii) దమము:- అంతరేంద్రియ నిగ్రహము శమముకాగా, బాహ్యేంద్రియ నిగ్రహము దమ మనబడుతుంది. అనగా ఇచ్చట మనస్సు పూర్తిగ నిగ్రహించబడుచున్నదని భావము.

(iii) ఉపరతి:- శమదమాదులు అలవడిన వ్యక్తిలో ఉపరతి చోటు చేసుకొనును. మనస్సు బాహ్యములో ప్రవేశించక ఆంతర్యంలో అణగిపోవుట ఉపరతి



అవుతుంది. ఈస్థితిలో సంపూర్ణ మానసిక ప్రశాంతత లభించిందని భావము. దీనిని స్వధర్మానుష్ఠానము అని కూడా అందురు.

(iv) తితిక్ష:- జీవితములో కలుగు బాధలను దు:ఖాలను సహించి పగ తీర్చుకొను స్వభావము లేక, ఆవేదనల నుండి ఆందోళన నుండి విముక్తుడై ప్రసన్నచిత్తుడై యుండుట తితిక్ష అనబడుతుంది.

(v) శ్రద్ధ:- శాస్త్ర విషయములయందు, గురుదేవుని ఉపదేశముల యందు కనబరచు సంపూర్ణ విశ్వాసమే శ్రద్ధ అనబడును. శ్రద్ధగల సాధకుడు జ్ఞానమును పొంది తరించును.

(vi) సమాధానము:- మనోవృత్తులుడిగి, నిరంతరము భగవానుని యందు తన ఏకాగ్రచిత్తము నుంచి, అంతర్ముఖమగు ఒకానొక ఆంతరంగిక స్థితియే సమాధానము. ఇట్టి ఆంతరంగిక ప్రశాంతతకు అలవాటుపడిన వ్యక్తి గురుబోధను గ్రహించి తరించుటకు సమర్థుడగును.

(4) ముముక్షుత్వము:- దేహేంద్రియ మనోబుద్ధుల సంఘాతము నుండి విడిపడి, అజ్ఞానముడి వీడి, ముక్తికాంత ఒడిలో పడి తరించేందుకు చేయు తీవ్ర వాంఛయే ముముక్షుత్వ మనబడుతుంది.

ఈ విధమైన సాధన చతుష్టయ సంపత్తిగల సాధకుడు జ్ఞాన మార్గములో పయనించి, గురుబోధను గ్రహించి, గ్రహించిన విషయమును అనుష్ఠానములో దర్శించి, ఆత్మానుభూతితో తరించి జీవన్ముక్తుడై భాసించును. కనుక అట్టి ఆత్మానుభూతికి జ్ఞానమొక్కటియే ప్రధాన సాధనమని శ్రీ శంకరులు ఈ ద్వితీయ శ్లోకముద్వారా తెలియ జేశారు.

❀

అవతారిక:- ఆత్మజ్ఞానమును పొందుటకు జ్ఞాన మొక్కటియే ఏల సాధన కాగలదు?కర్మ ఎందులకు సాధనము కాదు? ఈ విషయమును తృతీయ శ్లోకము ద్వారా తెలియజేయుచున్నారు.

అవిరోధితయాకర్మ
నావిద్యాం వినివర్తయేత్
విద్యా విద్యాం నిహంత్యేవ
తేజస్తిమిర సంఘవత్ ॥ 3

అవిరోధితయా = వైరుధ్యము లేకపోవుటచేత, కర్మ = కర్మాచరణ, అవిద్యాం = అవిద్యను, న వినివర్తయేత్ = అంతమొందించలేదు, తేజః = ప్రకాశము, తిమిర సంఘవత్ = గాడాంధకారమును పారద్రోలునట్లు, విద్యా = జ్ఞానము, అవిద్యాం = అజ్ఞానమును, నిహంతి = నశింపచేయుచున్నది.

**భావముః- కర్మకు అవిద్యకు పరస్పర వైరుధ్యము లేనందున కర్మ అవిద్యను తొలగించలేదు. వెలుతురు చీకటిని పోగొట్టునట్లు జ్ఞానమే అజ్ఞానమును అంతమొందించును.**

## వ్యాఖ్య

ప్రతి మానవుని ఆంతర్యంలో కదిలే ప్రగాఢవాంఛ పూర్ణత్వమును పొందుటకే యని మనము గ్రహించాము. అట్టి పూర్ణత్వమును సిద్ధించుకొనుటకే మానవుడు కర్మలాచరించును. కర్మవలన పూర్ణత్వము లభించునా?

పూర్ణత్వమనునది ఆత్మయే. మన స్వరూపము ఆత్మయే అయి యున్నది. మన స్వరూపమైన ఆత్మ కొరకు అన్వేషించుట అజ్ఞానము కాజాలదా? తానెవరో తనకు తెలియకపోవుట వలనకదా, తెలుసుకొనవలయునను వాంఛ కలిగినది. ఆ కోర్కెయేకదా మానవునిచే కర్మ లాచరింప చేయునది! అజ్ఞాన జనిత వాంఛా ప్రేరితుడై తాను ఆచరించు కర్మ అజ్ఞానము కాదా? అజ్ఞాన స్వరూపమైన కర్మ జ్ఞానము నందించగలదా?

మానవు డభిలషించు ఆనందము అపరిమితమైనది అయినచో అట్టి ఆనందము పరిమిత కర్మలద్వారా లభించేందుకు వీలులేదు. అనంతానందము కొరకు ఆచరించబడు కర్మకూడా అనంతమయ్యే యుండవలెను. కానీ కర్మలు



కాలములో ప్రారంభమై కాలంలో అంతరించుట వలన అనంతమయ్యేందుకు వీలుగాక కాలపరిచ్ఛేదమునకు లోనగు చున్నవి. కనుక కర్మలు మనిషిని అనంతునిగ మార్చలేవు. కానీ అనంతుడు కావలెననెడి అభిలాష వ్యక్తి ఆంతర్యములో దూరం కావడము లేదు. అందుచేత తాను పొందవలయునని యత్నించు అఖండానంద స్వరూపము తానే అయి యున్నాడు. తానే అయియున్న ఆనందమును తాను వాంఛించుట ఏమిటి? అదియే అజ్ఞానము. ఆత్మానందమును తాను వాంఛించగానే తాను ఆత్మ కాదని నిర్ణయించుటయే జరుగుచున్నది. ఈ అవగాహన దోషపూరితమై యున్నది. కనుక ప్రతికర్మ అజ్ఞాన జనితమై యున్నది. అట్టి కర్మ అందించు ఫలితము కూడా అజ్ఞాన ఫలితమే అయియున్నది. అజ్ఞానము ఉన్నంతకాలము అది తనకు వ్యతిరిక్తమగు జ్ఞానస్వరూపమైన ఆనందమునకు ప్రతిబంధకమయ్యే యున్నది. ప్రమాత, ప్రమేయము ఒకటే అయినపుడు ఆత్మానందము కలుగకపోవుటకు కారణము అజ్ఞాన జనితమైన కర్మలు అడ్డు నిలుచుటయే.

పరిమిత కర్మలద్వారా పరిమిత ఫలితాలే అందుతాయి. కర్మ ఫలితాలను భవించుటవలన కలిగిన అనుభూతులు అంతఃకరణలో వాసనల రూపమున నిలిచి వ్యక్తిని మరల కర్మాచరణకు పురికొల్పును. ఇలా ఎడతెగక ప్రవహించు కర్మ ప్రవాహము మానవుని కర్మ సముద్రములో పడద్రోసి దుఃఖానుభూతిని కలిగించును.

అయితే అజ్ఞానజనితము గనుక కర్మాచరణ నిషేధమైయున్నదా? ఇచ్చట బాగా ఆలోచించాలి. ఆత్మజ్ఞానము నందించుటలో కర్మల అశక్తతను తెలియచేయుట జరిగినదేగాని కర్మను విసర్జించమని, విస్మరించమని తెలియజేయలేదు. కర్మాచరణ ఎంత ప్రమాదమో కర్మ సన్యాసము కూడా అంతే ప్రమాదము. లేదా కొంత ఎక్కువ ప్రమాదము కావచ్చు. నీవు ఆత్మవు. ఆత్మ నిష్క్రియత్వము కనుక నీనుండి కర్మాచరణ జరిగే వీలులేదు. నీవు కర్మలే ఆచరించనపుడు కర్మలను సన్యసించుట వింత విషయమై కన్పించును. ఆలోచించండి. మనము చేయవలసింది కర్మలాచరించుట కాదు. కర్మలను విసర్జించుటయూ కాదు. జ్ఞానమును పొంది తరించుటయే. మనము అందుకొన యత్నించు ఆత్మ అందియే యున్నదనెడి జ్ఞానమును కలిగియుండుటయే.

జ్ఞానము లేకపోవుటకు కారణము అజ్ఞానము అడ్డు నిలిచియున్నదని గ్రహించాము. అజ్ఞాన తెరను తొలగించినచో జ్ఞాన జ్యోతిని దర్శించవచ్చు. అజ్ఞాన జనితమైన కర్మలు అజ్ఞానమును నిర్మూలించు అవకాశము లేదు. యోగాభ్యాసమువలన కొన్ని శక్తులు, మహిమలు లభించవచ్చు. వాటిని ప్రదర్శించి అమాయకులను మభ్యపెట్టవచ్చు. లేదా యోగాభ్యాసము ద్వారా అంతఃకరణ శుద్ధి కలుగవచ్చు. కానీ ఆత్మజ్ఞానానుభూతి కలుగదు.

పతంజలి మహర్షి రచించిన యోగసూత్రములపై వ్యాస భగవానుడు నడిపిన వ్యాఖ్యలో ఒక చిన్న కథను వ్రాశారు. జైగిషవ్యుడను గొప్ప యోగి ఉండెడివాడు. యోగము ద్వారా అతడు అద్భుతమైన సిద్ధులు పొందెను. ఒక దశలో అతడి దృష్టి యోగము నుండి జ్ఞానమునకు మఱలెను. ఆత్మానందమును గుర్తించినవాడై సదా ఆనంద పారవశ్యంలో కాలము గడుప సాగెను. ఒకనాడు అతడి గురువు అరుదెంచి, గతంలో అతడు పొందిన యోగసిద్ధుల ప్రయోజన మేమిటో తెలియజేయుమని ప్రశ్నించెను. అంతట జైగిషవ్యుడు యోగశక్తులలో ఆనందము లేదని తెలియజేసెను. గురువు దిగ్భ్రాంతి చెందెను. సుదీర్ఘ కాల మాచరించి పొందిన యోగమహిమలు అతనికి ఆనందము నివ్వ లేకపోయిన వనెడి మాట నాలకించి విస్మయమొందెను. అంతట జైగిషవ్యుడు వివరించెను. విషయ సుఖములతో పోల్చినపుడు సిద్ధులన్నీ ఉత్తమమైనవే ననియు, ఆత్మా నందముతో పోల్చినపుడు అట్టి యోగ సిద్ధులు ఆవేదన భరితములనియు తెలియజేసెను.

కనుక కర్మల ద్వారా ఆనందం లభించదు. ప్రకాశముద్వారా అంధకారము అదృశ్యమగునట్లు జ్ఞానము ద్వారానే అజ్ఞానము అంతరించవలెను: ఒక గది కొన్ని సంవత్సరములుగ మూత వేయబడి యున్నది. గది అంతయు చీకటిమయమై యున్నది. ఆ చీకటిని పోగొట్టవలెనని గదిలో గంతులువేసి, చప్పట్లు చరచి, నృత్యముచేసి, సంగీత మాలపించినంత మాత్రముచేత శ్రమ మిగులునేగాని చీకటిపోదు. చీకటిని చెదరగొట్టుటకు ఒక్కటే మార్గము. దీపము వెలిగించుటయే. ప్రకాశమును ప్రవేశపెట్టుటయే. కొన్ని సంవత్సరములుగ గదిలోయున్న చీకటి క్షణకాలములో అదృశ్యమగును. అలాగే అజ్ఞానాంధకారము



కర్మాచరణవలన పోదు. జ్ఞానజ్యోతిని వెలిగించుటయే తక్షణ కర్తవ్యము. జ్ఞాన ద్యుతిలో అనాదిగా కదలివచ్చు అజ్ఞానము అరక్షణంలో అదృశ్యమైపోవును. జాడ గోచరించకుండా అంతరించిపోవును. "అజ్ఞానము పోయినదా? అంటే- ఒకప్పుడు ఉండినదా? " అనెడి ఆశ్చర్యము కల్గించును.

అవతారిక:- మన స్వరూపమైన ఆత్మ మనకు వేఱుగాకనే అజ్ఞానముచే వేఱుగా కన్పించు చున్నదనియు, అజ్ఞానము నశించగనే స్వయం ప్రకాశమై గోచరించునని తరువాత శ్లోకములో తెలియజేయు చున్నారు.

పరిచ్ఛిన్న ఇవాజ్ఞానాత్
తన్నా శేసతి కేవలః
స్వయం ప్రకాశతే హ్యాత్మా
మేఘాపాయేంశుమానివ ॥ 4

ఆత్మా = చైతన్యము, పరిచ్ఛిన్న ఇవ = పరిమితమైనట్లు, అజ్ఞానాత్ = అజ్ఞానము చేత, తత్ = ఆ అజ్ఞానము, నాశేసతి = నశించగానే, కేవలః = ఏకమై, స్వయం ప్రకాశతే = తనకు తానుగా ప్రకాశించుచున్నది, మేఘాపాయే = మబ్బువీడగా, అంశుమానివ = సూర్యునివలె.

**భావముః-** **అజ్ఞానముచేత ఆత్మ పరిమితమైనట్లు గోచరించు చున్నది. అజ్ఞానము నశించగనే మబ్బు వీడిన సూర్యునివలె అద్వయమైన ఆత్మ తనకు తానుగా ప్రకాశించును.**

## వ్యాఖ్య

అజ్ఞానము జ్ఞానముచేతనే అంతమగునని గడచిన శ్లోకములో గ్రహించితిమి. స్వయంప్రకాశమైన ఆత్మ జ్ఞానస్వరూపమై యున్నది. ఏ జ్ఞానముచేత సకలమైన జ్ఞానములు కలుగుచున్నవో అదియే జ్ఞానము. చైతన్య స్వరూపము. వస్తురహిత చైతన్యము. ఇది అఖండ జ్ఞానము. వస్తుజ్ఞానము కాదు. సకల వస్తు విషయజ్ఞానమును గ్రహించు వస్తురహిత చైతన్యము. అదియే

ఆత్మ. సదా ఏకమై భాసించుచున్నది. ఉన్నది ఆత్మ యొక్కటే. అంతటాయున్న ఆత్మ ఆలోచనలకు అందదు. అనుభవ గ్రాహ్యమై యున్నది. ఆలోచనల వలననే ఆవేదనలు కలుగుచున్నవి. ఆవేదనల నందించు ఆలోచనలు అజ్ఞానముచే కదులుచున్నవి. అట్టి అజ్ఞాన దశలో అనంతమైన ఆత్మ పరిచ్ఛిన్నమైనట్లు గోచరించుచున్నది.

అజ్ఞానమే మిథ్యాజ్ఞానమని పిలువబడుతుంది. మిథ్యాజ్ఞానము గల వానికి సత్యము అసత్యముగను, అసత్యము సత్యముగను గోచరించును. మిథ్యాజ్ఞానము నశించవలెనన్నచో సమ్యక్ జ్ఞానము కలుగవలెను. అదియే ఏకవస్తు దర్శనము. కేవల సద్రూప జ్ఞానము. విచక్షణాపూరిత వివేకము గలవానికే సమ్యక్‌జ్ఞానము కలుగును. సదా ఆత్మానాత్మ వివేకము చేయగల మనస్సునకే సత్యానుభూతి కలుగుతుంది.

అనంతమైన ఆత్మ పరిచ్ఛిన్నమై కన్పించుటయే మిథ్యాజ్ఞానము. అదియే అజ్ఞానము. అజ్ఞానియైన మానవుడు ఆత్మయొక్క అనంతత్వమును గ్రహించలేక ఆత్మ దేహేంద్రియ మనోబుద్ధులకు పరిమితమై యున్నట్లు భావించును. పరిచ్ఛిన్నమని గ్రహించును. అంతమాత్రాన ఆత్మ పరిచ్ఛిన్నం కాలేదు. మేఘము ఆవరించిన సమయాన సూర్యుడు కనుపించడు. మబ్బు సూర్యుని క్రమ్మి యున్నట్లే గోచరించును. యదార్థానికి సూర్యుడు కప్పబడుట అసత్యము. సూర్యుని క్రమ్మడానికి మేఘమేపాటిది? విశాలమైన సూర్యుని తనలో సహస్రాంశమైనను లేని మేఘము క్రమ్మగలదా? సూర్యుని మేఘము కప్పినది అని తెలుసుకోవడానికి ఆధారము సూర్యకాంతి కాదా? చూచేవాని పరిమిత దృష్టికి సూర్యుడు మేఘముచే కప్పబడినట్లు గోచరించినను, సత్యము అందుకు భిన్నంగానే యున్నది. మేఘము సూర్యుని క్రమ్మియున్నట్లు చూచే వానికి గోచరించినా, అడ్డగించుటకు వీలులేని సూర్యప్రకాశము ఒకవైపు గోచరించుచునే యున్నది.

అలాగే మేఘముచే సూర్యుడు పరిమితుడు కానట్లు, దేహేంద్రియ మనోబుద్ధుల సంఘాతముచే ఆత్మ పరిచ్ఛిన్నం కాలేదు. అజ్ఞానముచేత మానవుడు ఆత్మ స్వరూపమును గ్రహించలేక, పరిచ్ఛిన్నమైనట్లు భావించినా, అనంతమైన ఆత్మప్రకాశము యొక్క ప్రభావము మనిషిపై అనుక్షణము



ఉంటున్నది. తాను చేస్తున్నానని, చూస్తున్నాన్నని, చవి చూస్తున్నానని, మానవుడు అనుకొంటాడేగాని, చూపులకు చూపుయై, వీనులవెనుక వినికిడి తానై యున్న ఆత్మ ప్రభావమును గ్రహించలేడు.

మబ్బు వీడితేకాని సూర్యుడు బయటపడనట్లు అజ్ఞానం తొలగితే గాని ఆత్మదర్శనం కానేరదు. అజ్ఞానం తొలగగానే ఆత్మ స్వయం ప్రకాశము గనుక తనకు తానుగా ప్రకాశిస్తుంది. మనస్సనెడి పెరుగు కుండలో విచారణ యనెడి కవ్వమునువేసి చిలికినచో జ్ఞానమనే వెన్న పుడుతుంది. జ్ఞానము కలుగగానే ఆత్మానుభూతి లభిస్తుంది.

అవతారిక:- జ్ఞానముచే అజ్ఞానము దగ్ధముకాగా, అలా అజ్ఞానము నంత మొందించిన జ్ఞానము ఆత్మలో లీనమగునని రాబోవు శ్లోకములో వివరించుచున్నారు.

అజ్ఞాన కలుషం జీవం
జ్ఞానాభ్యాసాత్ వినిర్మలం
కృత్వా జ్ఞానం స్వయం నశ్యేత్
జలం కతకరేణువత్ ॥ 5

అజ్ఞాన కలుషం = అజ్ఞానముచే మలినమైన, జీవం = జీవుని, జ్ఞాన్యాభ్యాసాత్ = జ్ఞానాభ్యాసమువలన, వినిర్మలం = పరిశుద్ధునిగా, కృత్వా = చేసి, జ్ఞానం = జ్ఞానము, స్వయం = తనే, నశ్యేత్ = నశించును, జలం = నీటిని, కతకరేణువత్ = చిల్లగింజ పొడివలె.

**భావము:- మురికినీటిని పరిశుద్ధ మొనర్చిన చిల్లగింజ గంధము తిరిగి నీటియందే కలియు విధముగ దోషపూరితుడైన జీవుని, జ్ఞానము పరిశుద్ధునిగా చేసి, తిరిగి ఆ జ్ఞానము ఆత్మయందే లీనమగుచున్నది.**

## వ్యాఖ్య

అనుభవరీత్యా ప్రతివ్యక్తి ఆత్మయై యున్నాడు. అయితే ఆ విషయము తన జ్ఞానములో లేదు. జ్ఞానము లేకపోవుటచేత దేహముతో తాదాత్మ్యము

చెంది తాను పరిమితుడనని భావించి, తత్ఫలితముగ సంభవించు అనంత దుఃఖమునకు వారసుడై అలమటించుచున్నాడు. ఇదియే అజ్ఞానము. అజ్ఞానము తొలగగానే ప్రతిజీవియు ఆత్మానందముతో ప్రకాశించ గలడు.

స్వర్ణమును మూసలో కరిగించగానే అది పచ్చనికాంతితో మెరయు చుండును. బంగారము ద్వారా మనకు తెలియవచ్చు కాంతి బంగారునందున్నదా? లేక అగ్నికి సంబంధించినదా? బంగారుకు సంబంధించినదే. బంగారులోని మాలిన్యమును తొలగించి స్వర్ణమును పరిశుభ్ర మొనర్చుటకు అగ్ని పరికరమై యున్నదేగాని, బంగారునందలి ప్రకాశము అగ్నిదికాదు. అగ్నివలననే ఆ ప్రకాశము వచ్చునట్లైనచో ఒక ఇటుకను నిప్పులో వేసినను అది బంగారువలె కాంతివంతము కావలెను.కానీ అలా జరుగదు. ప్రకాశము బంగారుయందే యున్నది. స్వర్ణములోని మాలిన్యము అగ్నిచేత తొలగించబడగానే బంగారము తన స్వప్రకాశమును వెదజల్లును. అలాగే జీవుడు అజ్ఞాన మాలిన్యముచే కలుషితమై యున్నాడు. జ్ఞానాభ్యాసము ద్వారా అజ్ఞాన మాలిన్యము తొలగగానే తాను ఆత్మయేగనుక స్వయంప్రకాశమై భాసించును. అందుచేతనే అజ్ఞానముచే కలుషితమైన జీవుడు జ్ఞానాభ్యాసముచే వినిర్మల మగునని ఆచార్యులు ఈ శ్లోక ప్రథమ పాదములో తెలియజేసినారు.

జ్ఞానాభ్యాస మనగా ఆత్మానుభూతి నొందుటకు ఉనకరించు ఉత్తమ సాధన ప్రక్రియ. నిషిద్ధ, నిర్ణయ పద్ధతులద్వారా అధ్యాసను వదలి, ఆధ్యాత్మములో కదిలి తరించు ఏకైకమార్గము. దేహేంద్రియ మనోబుద్ధులు తాను కానని, వీటికి ఆధారమై భాసించు ఆత్మయే తానని తెలియు జ్ఞానమార్గము. ఆత్మ తనకు తాను స్వయం ప్రమాణమై యున్నది. తన ప్రకాశమే తనకు ప్రమాణమై యున్నది.

రాగద్వేషాది సంకుల చిత్తులై ఉన్నందున మన మనస్సులలో విషయ చింతనయే నిరంతరము కదులుచుండును. ప్రత్యాహారము ద్వారా మనస్సును



అంతర్ముఖం చేయవలెను. బ్రహ్మాకార వృత్తిద్వారా విషయ వృత్తులను నిర్వీర్యంచేసి, ఆ తరువాత బ్రహ్మాకార వృత్తిని కూడా విడిచి, బ్రహ్మమై తరించవలెను.

**నిర్వికార తయా వృత్త్యా బ్రహ్మాకార తయా పునః**
**వృత్తి విస్మరణం సమ్యక్ సమాధి జ్ఞాన సంజ్ఞకః**

పరిణామ రహితమైన బ్రహ్మాకార వృత్తిచేత మనోవృత్తులను సమూలంగా మాయంచేసి, ఏకవస్తు చింతన యందుండుటయే సమాధియనియు, దాని ఎరుకయే జ్ఞానమగుననియు శ్రీ ఆచార్యులవారు అపరోక్షానుభూతి యను గ్రంథములో వివరించారు.

తదేక బ్రహ్మచింతనమే జ్ఞానాభ్యాసము. సద్గురువు ద్వారా శ్రవణము చేసిన విషయమును, మననము నందు చక్కగా తిలకించి, నిది ధ్యాసలో స్థిరపరచుకొనవలెను. తద్వారా కలుషితమైన విషయ వృత్తులు సమూలంగా నశించగలవు. వృత్తి రహితమై యున్నంత మాత్రమున మనస్సు నిర్మలమైనదని భావించడానికి లేదు. సుషుప్తిలో వృత్తిరహిత స్థితియే యున్నది. మత్తుపానీయముల కలవాటుపడిన వ్యక్తి తరచుగ ఆ స్థితిని అనుభవించుచుండును. వృత్తి లేనంత మాత్రాన నివృత్తి కలిగినదని భావించరాదు. వృత్తి లేకపోవచ్చుగానీ అజ్ఞానము స్థిరముగనే యున్నది. అధ్యాస బీజము తాత్కాలికముగ అణగియున్నది. అనుకూల సమయమందు మళ్ళీ తొంగిచూచును. వృత్తి అణగిన దశలో ఆనందము కలుగవచ్చు. కానీ అది శాశ్వతానందము కాదు. కనుక అజ్ఞానము నివృత్తి కావలెనన్నచో జ్ఞానాభ్యాసమే తరుణోపాయమై యున్నది. " నేనే బ్రహ్మము " అను బ్రహ్మాకారవృత్తి భావపూరితముగ సదా కదులుచుండవలెను. అలా కదలవలెనన్నచో సద్గురువు చెంత శ్రవణమననాదులు చక్కగా జరిగి యుండవలెను. విషయగ్రహణ సంపూర్ణముగా జరిగినంతవరకు పునః పువః శ్రవణము చేయవలెను. శ్రవణము చక్కగా జరిగినచో మవవము రాజబాటలో నడచును. మననమే మనిషికి రూపు రేఖలు దిద్దును.

**యచ్చింతయసి తద్భవసి। శరీరమాత్మానం మన్యమానః శరీరాత్మా భవ సి**

**సచ్చిదానంద బ్రహ్మమితి। మన్యమానః బ్రహ్మైవభవసి ॥**

మనసెట్లు నడచునో మనిషి అట్లు తయారగును. శరీరమే తామని భావించు అజ్ఞానులు జడ ప్రాయులుగనే యుందురు. "నేను సచ్చిదానంద బ్రహ్మమును అని చింతించువాడు బ్రహ్మమే అగును " అని విచార బిందూపనిషత్తు తెలుపుచున్నది.

జ్ఞానాభ్యాసమనే ఆత్మవిచారముచేత మనోనాశము జరుగును. అజ్ఞానము నశించి ఆత్మజ్ఞానము స్ఫురించును. యోగాభ్యాసము ద్వారా మనస్సు లయించును. జ్ఞానాభ్యాసము ద్వారా మనస్సు నశించును. లయించిన మనస్సు తిరిగి ప్రకోపించును. నశించిన మనస్సు తిరిగి జనించదు.

**లయవినాశనే ఉభయ రోదనే**

**లయగతం పున ర్భవతి నోమృతం**

అని భగవాన్ రమణమహర్షులవారు తన ఉపదేశసార గ్రంథములో తెలియజేశారు. మనస్సును నిగ్రహించుటవలన మనస్సుయొక్క అస్థిత్వమును స్థిరపరచుట జరుగుచున్నది. మనస్సును గూర్చి విచారణ జరిపినచో అసలు మనస్సే లేదని తెలియును. ఇదియే చక్కటి మార్గము. మనస్సును నిగ్రహించవలసినది మనస్సే కదా! బాగా ఆలోచించండి. చోరుడు రక్షకభటుడుగా నియమింపబడ్డాడు. తాను చేసిన చోరత్వమునకు విచారణ జరిపి దొంగను కనిపెట్టునా?

కనుక జ్ఞానాభ్యాసము ద్వారా విచారణ జరుగుటచేత అజ్ఞాన కాలుష్యము అంతమై మనస్సు నిర్మలమగును. అలా నిర్మల అంతఃకరణను తయారుచేసిన జ్ఞానము ఆ తరువాత ఆత్మయందే లీనమగును. బ్రహ్మాకార వృత్తిద్వారా బ్రహ్మచింతన జరిగినది. చింతన నశించి, చిరంతనము నిలిచినది. ఈ విషయము సుస్పష్టముగ తెలియుటకు ఆచార్యులవారు చిల్లగింజ గంధము ద్వారా జలమును శుభ్రపరచు ప్రక్రియను ఉదహరించారు.

వర్షాకాలమునందు నీరు బురదతో నిండియుండును. అట్టి నీటిని పానము చేయుటచేత అనారోగ్యము సంభవించే ప్రమాదము లేకపోలేదు. ఆ



నీటిని శుభ్రపరచి పానము చేయవలెను. జలమును శుభ్రపరచుటకు మన పూర్వీకులు ఒక చక్కటి మార్గమును అవలంబించెడివారు. చిల్లగింజను గంధముగా తీసి జలములో కలిపెడివారు. ఆ గంధము నీటిలోని మాలిన్యమును తీసికొని నీటి అడుగుభాగమున పాత్రపై చేరును. అలా శుభ్రపడిన జలమును పానము చేసి ఆరోగ్యమును కాపాడుకొనెడివారు.

మురికినీటిలో ఇండుపకాయను వేయగా మురికి అడుగు భాగమునకు దిగి, నీరు శుభ్రమగును. ఇలా నీటిని శుభ్రపరచిన చిల్లగింజ పొడికూడా నీటియందే లయించును. అలాగే జ్ఞానము అజ్ఞానముచే కలుషితమైన జీవుని పరి శుద్ధమొనర్చి తిరిగి అట్టి జ్ఞానము ఆత్మయందే లయించు చున్నది.

అవతారిక:- మరి అజ్ఞాన దశయందు గోచరించు సంసార మేమగును? అను శంకను నివారిస్తూ, అది స్వప్నతుల్యమని, జ్ఞానానుభవములో అదృశ్యమగునని ఆరవ శ్లోకములో తెలియజేయుచున్నారు.

సంసారః స్వప్నతుల్యోహి
రాగద్వేషాది సంకులః
స్వకాలే సత్యవత్ భాతి
ప్రబోధే అసత్యవత్ భవేత్ 6

రాగద్వేషాది సంకులః = రాగద్వేషాదులచే కలుషితమైన, సంసారః = సంసారము, స్వప్నతుల్యోహి = కలవంటిది, స్వకాలే = స్వప్నకాలమందే, సత్యవత్ = సత్యమవి, భాతి = గోచరించుచున్నది, ప్రబోధే = ఆత్మజ్ఞానము కలుగగానే, అసత్యవత్ = అసత్యమగుచున్నది.

**భావము:- రాగద్వేషాది దోషములతో నిండిన సంసారము స్వప్నముతో సమానము. స్వప్నకాలమందు సత్యముగా తోచి మేల్కొనగానే ఎలా స్వప్నము అదృశ్యమగుచున్నదో అలాగే జ్ఞానోదయము కాగానే సంసారము కలవలె అసత్యమగుచున్నది.**

## వ్యాఖ్య

అనాత్మతో ఏర్పరచుకొనిన అక్రమ సంబంధమే జీవుని దు:ఖమునకు ప్రథమ కారణమై యున్నది. బంధములన్నీ అనాత్మ సంబంధముతో కలిగినవి. ఇదియొక మానసిక సుడిగుండము. ఇదియే సంసారము. నిస్సారమైన సంసారమునుండి బయటపడవలె నన్నచో అనాత్మతో మనం ఏర్పరచుకొన్న సంబంధమును దూరం చేసుకొనవలెను. వివేకము లోపించిన వ్యక్తి అనాత్మ తానని భావించాడు. అనాత్మ నుండి విడిపడవలెనన్నచో వివేకము వృద్ధిచెందాలి. వివేకము విచారణద్వారా కలుగుతుంది. రాగద్వేషాదులచే కలుషితమైన నిస్సార సంసారమును గూర్చి ఆచార్యుల వారు ఈ శ్లోకంలో విచారణ జరుపుచున్నారు. రాగద్వేషాదులచే కలుషితమైన సంసారజీవనము స్వప్నతుల్యమని తెలియ జేయుచున్నారు. స్వప్నము మనో కల్పితము. మనో నిర్మితము. జాగ్రదవస్థలో జరిపిన విఫల మనోరథములు, ప్రయత్నములు, నెరవేరని కోర్కెలను వ్యక్తి తన స్వప్నములో నెరవేర్చుకొని సంతసించును. తనను తాను మరచిన అయోమయ స్థితిలో గోచరించునదియే స్వప్నము. క్షణికమై భాసించు అనిత్య జగత్తుయే స్వప్నము. కల ననుభవిస్తున్నంత వరకు కల యదార్థముగనే కన్పట్టును. కలలోని వస్తువులు సత్యముగనే భాసించును. కలలోని సంఘటనలు నిత్యమైనట్టే గోచరించును. కల కంటున్నంత వరకు కల అంతయు సత్యమై నిలుచును. కల ఎంతవరకుంటుంది? కరిగేదే కల. కలనుండి మేల్కొనగానే కనినదంతయూ కల్లయేనని బోధపడుతుంది. కలలోని బాంధవ్యాలు ఖండించబడ్డాయి. సంఘటనలు చెదిరిపోయాయి. అనుభూతులు అదృశ్య మయ్యాయి. మిగిలినదంతా ఆశ్చర్యమే.

స్వప్నంలోని సంతోషము సంతోషమూ కాదు. దు:ఖము దు:ఖమూ కాదు. అదంతయూ మానసిక కల్పనయే. చిత్త చాంచల్యమే. అయితే ఈ సత్యము కలగంటున్నప్పుడు అర్థం కాదు. కల ననుభవిస్తున్నంత సేపు కల సత్యమే. కల నుండి మేల్కొనగానే కల అబద్ధమని అర్థమయింది. అలాగే



మేల్కొన్న వానికి కల ఎలా అసత్యమో మేలు తెలిసిన వానికి ఈ జాగ్రత్ప్రపంచము, అందులో తయారైన సంసారము సర్వమూ స్వప్నతుల్యమే.

ఆదియందు లేక, అంత్యమందు అగుపించక మధ్యలో గోచరించేది అసత్య మనబడుతుంది. రజ్జు సర్పభ్రాంతిలో సర్పమెలా అసత్యమైనది? ఆదియందు త్రాడేగాని తాను లేదు. జ్ఞానము కలిగిన తరువాత కూడా త్రాడే గాని తానులేదు. ఏదయితే ఆద్యంతములయందు లేదో అదియే సర్పము. అనిత్యము. దేనికి ఆద్యంతములు కలవో అదియే అనిత్యము. భ్రాంతిలో సర్పము గోచరించినది. జ్ఞానములో పాము అదృశ్యమైనది. కనుక సర్పమునకు ఆద్యంతము లున్నవి. అలాగే స్వప్నమునకు ఆద్యంతము లున్నవి. ఆద్యంతముల యందు స్వప్నములేదు కనుక అది అసత్యము. స్వప్నానుభూతికి ఆధారమైనది చైతన్యము. చైతన్యము త్రికాలములందున్నది. కాలాతీతమై యున్నది. జాగ్ర దవస్థను నీవు అనుభవిస్తున్నావు. జాగ్రదవస్థకు సంబంధించిన అనుభవాలు నీకున్నవి. స్వప్నాన్ని అనుభవిస్తున్నవాడివి కూడా నీవే. నీకు స్వప్నానుభూతి కూడా యున్నది. సుషుప్తికి ఆధారమైనవాడవు కూడా నీవే. నీకు సుషుప్త్యానుభవము కూడా యున్నది. సుషుప్తిలో ఏజ్ఞానము లేదనెడి జ్ఞానము నీకున్నది. కనుక అవస్థాత్రయము నీయందే జరుగుచున్నది. మూడు అవస్థలకు నీవే ఆధారమై, అధిష్ఠానమై యున్నావు. జాగ్రదనుభవాలు స్వప్నములో గోచరించవు. స్వప్నాను భవము జాగ్రదవస్థలో లేదు. ఈరెండు అనుభవాలు సుషుప్తిలో లేవు. కానీ నీవు మూడింటిని గ్రహించుచున్నావు. గ్రహించలేనిదంటూ వుంటే అలా గ్రహించలేదనెడి విషయమును కూడా గ్రహించుచున్నావు గనుక అవస్థా త్రయమును దర్శిస్తూ మనుగడను సాగించే నీ వ్యవస్థ నిత్యమైనదేగాని అనిత్య మైనది కానేరదు.

అయితే నిత్యమైన ఆత్మ నేనే అయినపుడు, ఆత్మజ్ఞానము నా కెందుకు లభించుటలేదు? అనెడి సందేహము కలుగవచ్చును. కలగంటున్న వాడికి జాగ్రత్ప్రపంచముయొక్క ఎరుక లేనట్లు అనిత్య వస్తు సంఘాతముతో తాదాత్మ్యము చెంది సంసారము తయారుచేసుకొని నందున నీకు నిత్యాత్మ జ్ఞానముగా అందుటలేదు.

స్వప్నము స్వప్నకాలములో యదార్థముగా యున్నను మేల్కొనగానే ఎట్లు అనిత్యమగ. ున్నదో, రాగద్వేషాది మాలిన్యముచే నిండిన ఈ దుఃఖమయ సంసారము అనుభవించు సమయాన వాస్తవముగ, మధురముగా గోచరించినను జ్ఞానానుభూతిలో అసత్యమని తెలియును. వెలుతురు చెంత అంధకారము అదృశ్యమగునట్లు జ్ఞానావస్థలో సంసారము సమసిపోవును. అంతరించును.

' ప్రబోధే అసత్యవత్ భవేత్ '

జ్ఞానానుభూతిలో అసత్యమగునని ఆచార్యులు తెలియజేయుచున్నారు.

**పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథానిద్రయా**

**యస్సాక్షాత్కురుతే ప్రబోధ సమయే స్వాత్మాన మేవాద్వయం**

సర్వము ఆత్మలో యున్నను మాయచేత స్వప్న ప్రపంచమువలె వేరుగా కన్పించి, జ్ఞానోదయము కలుగగానే అభేద స్వరూపమైన ఆత్మ అద్వయమై వెల్గొందుచున్నట్లు ఆచార్యులవారు దక్షిణామూర్తి స్తోత్రములో తెలిపియున్నారు.

అవతారిక:- పరబ్రహ్మానుభవము కలగినంతవరకు జగత్తు సత్యమై తోచునని తరువాత శ్లోకములో తెలియజేయుచున్నారు.

తావత్సత్యం జగద్భాతి
శుక్తికా రజితం యథా
యావన్న జ్ఞాయతే బ్రహ్మ
సర్వాధిష్ఠాన మద్వయం 7

సర్వాధిష్ఠానం = సర్వమునకు ఆధారమైన, అద్వయం = రెండు కానటు వంటి, బ్రహ్మ = పరమాత్మ, యావత్ = ఎంతవరకు, న జ్ఞాయతే = తెలియబడదో, తావత్ = అంతవరకు, జగత్ = ప్రపంచము, శుక్తికా = ముత్తెపు చిప్పయందు, రజితం యథా = వెండివలె, భాతి = ప్రకాశించు చున్నది.

**భావము:-** **సకలమునకు ఆధారమై, అధిష్ఠానమై భాసించు బ్రహ్మము తెలియబడనంత వరకు ముత్తెపు చిప్పలో వెండి గోచరించు నట్లు జగత్తు గోచరించును.**



## వ్యాఖ్య

ఈ ప్రపంచము వివర్తము. ఇదెన్నడూ సమవర్తి కాజాలదు. ప్రపంచము దృశ్యము గనుక మాయ. బ్రహ్మము దృక్కు గనుక సత్యము. వివర్తమనగా లేనిది ఉన్నట్లుగా గోచరించుట. యదార్థానికి ఉన్నది బ్రహ్మ మొక్కటియే. జగత్తు భ్రాంతి జనితము. శాశ్వతుడైన పరమాత్మ అశాశ్వతమైన ప్రపంచమునకు ఆధారము. ప్రపంచమునకు బ్రహ్మము కారణమై యున్నది. ఎవనినుండి ఈ జగత్తు ఆవిర్భవించినదో, ఎవని యందున్నదో, తిరిగి ఎవనియందు లయించు చున్నదో అదియే బ్రహ్మము. బ్రహ్మమును ఉపనిషత్తులు ఈవిధముగా నిర్ణయించినవి. దీనినే తటస్థలక్షణ మందురు. మరి తటస్థలక్షణము ద్వారా విచారణ సాగించినచో బ్రహ్మము సత్యస్వరూపమని తెలియును. సత్యవస్తువు, నిత్యమై వెల్గొందుటచేత జ్ఞానరూపమై కూడా యున్నది. అట్టిది ఆనందమై, అనంతమై యుండగలదు. కనుక బ్రహ్మకు మరియొక నిజ నిర్వచనము సచ్చిదానందము. ఇది స్వరూపలక్షణమని తెలియబడును.

స్వరూపానంద స్థితియందున్న బ్రహ్మమే జగత్తునకు ఆధారము. అధిష్ఠానము. జగత్తు ఒక కాలములో గోచరించుచున్నది. కనుక అసత్యమై యున్నది. బ్రహ్మము సనాతనమై యున్నది.

జగత్తు కార్యరూపమై భాసించుటచే దానికి కారణ ముండవలెను. అట్టి ఆది కారణమే బ్రహ్మము. కార్యమునందు కారణమే యుండును. మట్టితో కుండలను చేయుదురు. కుండ కార్యము, మట్టి కారణము. కార్యమైన కుండలో ఉన్నదంతయు కారణమైన మట్టియే. అలాగే కార్యమైన జగత్తునకు బ్రహ్మము కారణము గాన జగత్తు అంతయు బ్రహ్మముకన్నా అన్యము కాదు. కానేరదు. జగత్తు బ్రహ్మము కన్నా అన్యము కానపుడు ఇక దానిని బ్రహ్మ మనియే తెలియవలెను. జగత్తని పలవరించుట సబబు కాదు. అదియే అధ్యాస. అజ్ఞానము. కనుక కారణమును దర్శించునంత వరకు కార్యమే గోచరించు

చుండును. కారణమును దర్శించగానే కార్యమై భాసించునది కూడా కారణమేనని అనుభవమునకు అందును. బంగారును దర్శించగా నగలేదు. మట్టిని దర్శించగా కుండలేదు. రజ్జువును చూడగా సర్పములేదు. ఎడారి తెలియగానే ఎండమావి లేదు. అందుచేతనే సకలమునకు ఆధారమై, కారణమై భాసించు బ్రహ్మము తెలియబడనంతవరకు ముత్తెపుచిప్పలో వెండి గోచరించునట్లు, జగత్తు అనుభవమునకు అందునని ఆచార్యులు తెలియజేయుచున్నారు.

ముత్తెపు చిప్పలోని శ్వేతవర్ణమును గాంచి అది వెండియని భ్రమించుట కలదు. ముత్తెపుచిప్పలో వెండియుండుట అసంభవము. అది భ్రాంతి జన్యమైన విషయము. మరి అందు గోచరించు వెండి ఎంతవరకు కన్పించును? ముత్తెపు చిప్పను తెలుసుకున్నంతవరకు. ముత్తెపుచిప్ప తెలియకపోవుటచేత దానిస్థానే రజితము గోచరించి భ్రాంతిని అందించుచున్నది. ముత్తెపు చిప్పకు సంబంధించిన జ్ఞానము అందగనే రజితము మిథ్యయై మిగులును. అలాగే అధిష్ఠానమైన బ్రహ్మము తెలియబడనంత వరకు ముత్తెపుచిప్పలో వెండివలె ప్రపంచము భాసించును. తటస్థ, స్వరూప లక్షణాదుల ద్వారా బ్రహ్మయొక్క నిజస్థితి అర్థమయినచో ఈ జగత్తు భ్రాంతియని, అసత్యమని తెలియును.

**దృశ్యా సంభవ బోధోహి జ్ఞానం జ్ఞేయం చిదాత్మకమ్**
**తదేవ కేవలీ భావం తతోఽన్యత్సకలం మృషా ॥**

దృశ్యములేని జ్ఞానమే జ్ఞానము. చిదాత్మకమగు ఆ జ్ఞానమే జ్ఞేయము. అదియే కేవలస్థితి లేదా కైవల్యము. దీనికంటె అన్యమగు సర్వము మిథ్యయై యున్నది యని మహోపనిషత్తు తెలుపుచున్నది.

ఆత్మా నాత్మ వివేకజ్ఞానము ద్వారా ఎవని మనస్సు రాగరహితమై, ద్వంద్వ రహితమై, దృశ్యమును ఆశ్రయించని స్థాయికి చేరునో అట్టి మనస్సు పంజ రమునుండి బయటపడిన పక్షివలె జగద్భ్రాంతి నుండి విడిపడి ఆత్మానంద సాగరములో ఓలలాడును.



అవతారిక:- బ్రహ్మము కారణమైనందువ కార్యరూపమైన జగత్తుయొక్క సృష్టి స్థితి లయాదులు బ్రహ్మమునందే జరుగుచున్నవి. ఈ విషయమును రాబోవు శ్లోకము ద్వారా తెలియజేయుచున్నారు.

ఉపాదానేఽఖిలాధారే
జగంతి పరమేశ్వరే
సర్గస్థితి లయాన్యాన్తి
బుద్బుధా నివ వారిణి 8

ఉపాదానే = ఉపాదానకారణమై, అఖిలాధారే = సర్వమునకు ఆధారమైన, పరమేశ్వరే = పరమాత్మయందు, జగంతి = లోకములు, వారిణి = నీటియందు, బుద్బుదానివ = బుడగలవలె, సర్గస్థితి లయన్ = పుట్టుట, ఉండుట, లయించుటను, యాంతి = పొందుచున్నవి.

**భావము:- సర్వమునకు ఆధారమై, ఉపాదాన కారణమైన పరమాత్మ యందు ప్రపంచములు నీటియందు బుడగలవలె పుట్టి, పెరిగి లయించుచున్నవి.**

## వ్యాఖ్య

ముముక్షువు ప్రపంచములో జీవించుచుండును. ఒకవైపు తాను మోక్షమునకై తీవ్రప్రయత్నము సాగించుచున్నను మరియొకవైపు తాను నివసిస్తున్న ప్రపంచము యొక్క ఆవిర్భావమును గూర్చి అన్వేషణ, ఆలోచన మనస్సులో కదులుచునే యుండును. తనకు నిర్విరామంగా అనుభవాలను అందించే ఈ ప్రపంచ మెలా పుట్టినది? దీనికి ఆధార మేమిటి?దీని వయస్సెంత? ఇది ఎప్పుడు నశించును? నశించినది తిరిగి జన్మించునా? ఇలాంటి ప్రశ్నలు అసంఖ్యాకముగ అంతఃకరణలో కదులుచుండును. ప్రపంచము కార్యరూపములో గోచరించు చున్నందున దీని వెనుక ఒక కారణ ముండాలి.కార్యము కారణమునుండి ఉత్పన్నమగును గనుక జగత్తు దేనినుండి ఆవిర్భవించినది?

తైత్తిరీయోపనిషత్తులో వరుణుడు తన కుమారుడైన భృగువుకు ఈ విషయమై చక్కగా వివరించెను.

" యతోవా ఇమాని భూతాని జాయంతే

యేన జాతాని జీవంతి, యత్ప్రయం త్యభిసం విశంతి

తద్విజిజ్ఞాసస్వ, తద్ బ్రహ్మేతి "

" దేనినుండి భూతములు ఆవిర్భవించునో, దేనియందు జీవించునో, చివరగా దేనియందు లయించునో, దానిని తెలుసుకొన యత్నించుము. అదియే బ్రహ్మము " అని చెప్పెను. ఈ నిర్వచనము తటస్థలక్షణ విధానమని గడచిన శ్లోకము ద్వారా గ్రహించితిమి. సృష్టిస్థితి లయాదులు బ్రహ్మమునుండి కదులుచున్నందున బ్రహ్మము ఆదికారణమై యున్నది. ఆదికారణమైన చైతన్యము జ్ఞానస్వరూపమై యున్నది. తన లోని ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తుల ద్వారా సృష్టిక్రమమును నడుపుచున్నది. సృష్టికర్త సృష్టికి నిమిత్తకారణమైనందున జ్ఞాన స్వరూపమై యున్నాడు. జ్ఞానస్వరూపుడై యున్నందున తాను సర్వవ్యాపియై యున్నాడు. సర్వవ్యాపి యైనందున ఏకమై, అద్వయుడై యున్నాడు. ఏకమైన బ్రహ్మలో సృష్టి జరుగుటకు వీలగునా? ఒకవేళ సృష్టి జరిగినచో అది బ్రహ్మము కన్నా అన్యము కానేరదు. కనుక సృష్టియొక్క మనుగడ సృష్టికర్తలోనే యున్నది.

మృత్తికాయాం ఘటస్తన్త్వౌ పటస్స్వర్ణేంఽగు లీయకమ్

ఇతి వైశేషికాః ప్రాహు స్తథా నైయాయికా అపి ॥

కార్యము ఆవిర్భవించినపుడు అది కారణములోనే యుండును. కుండ మట్టి లోను, వస్త్రము దారమునందును, ఉంగరము బంగారములోను ఉండునట్లు కారణమునందే కార్యము ఇమిడి యుండునని వైశేషికులు, నయ్యాయికుల అభిప్రాయమై ఉన్నది.

కనుక కార్యమైన జగత్తు కారణమైన బ్రహ్మముకన్నా అన్యము కానందున బ్రహ్మములో పుట్టి బ్రహ్మములో పెరిగి బ్రహ్మములో లయించు చున్నది. ఈ విషయము బ్రహ్మసూత్రములలో కూడ తెలియ చేయబడినది.

' జన్మాద్యస్య యతః '



'పుట్టుట, పెరుగుట, నశించుట ఎవనియందు జరుగుచున్నదో అదియే బ్రహ్మము' అని బ్రహ్మసూత్ర నిర్ణయమై యున్నది. అందుచేతనే సృష్టికి బ్రహ్మము ఉపాదాన కారణమని ఆచార్యులు ఈ శ్లోకములో తెలియ జేయుచున్నారు.

ఒక వస్తువు సృష్టింపబడుటకు జ్ఞానస్వరూపమైన నిమిత్తకారణముతో పాటు వస్తు స్వరూపమైన ఉపాదాన కారణము కూడా ఉండవలెను. కుండ తయారయినది; సృష్టి తయారయినది; కుండకు కుమ్మరి నిమిత్త కారణము. సృష్టికి సృష్టికర్త నిమిత్త కారణము. కుండకు మట్టి ఉపాదాన కారణము. సృష్టికి ఉపాదాన కారణమేమిటి? ఏమీలేదు. ఏమీ లేదనుట శూన్యస్థితి. శూన్యమునుండి ఏమియు ఆవిర్భవించుటకు వీలులేదు. కనుక సృష్టికి ఉపాదాన కారణము శూన్యము కాదు. కాలేదు. కాజాలదు. సృష్టికి పూర్వము బ్రహ్మ మొక్కడే ఉండవలయును గాన మరియొక ఉపాదానము ద్వారా సృష్టి తయారయినచో బ్రహ్మము పరిమితము కాగలదు. పరిమితమైనవాడు సృష్టికర్త కాలేదు. కనుక సృష్టికి ఉపకరించు ఉపాదానము బ్రహ్మకు అన్యముగా యుండేందుకు ఆస్కారము లేనందున బ్రహ్మమే ఉపాదాన కారణమైయున్నాడు.కనుక సృష్టికి బ్రహ్మమే నిమిత్త కారణము. బ్రహ్మమే ఉపాదాన కారణము. తన సృష్టికి తానే ఎలా ఉపాదానము కాగలడు?

" యథోర్ణ నాభిః సృజతే గృహ్ణతేచ "

ఈ విషయము ఊర్ణనాభి దృష్టాంతము ద్వారా పరిష్కరించబడినది. సాలెగూడు నిర్మాణములో సాలీడు తానే నిమిత్తకారణము, తానే ఉపాదాన కారణమై యున్నట్లు, సృష్టి కార్యములో బ్రహ్మమే నిమిత్తకారణమై, బ్రహ్మమే ఉపాదాన కారణమై యున్నాడు. అదియునుగాక మన స్వప్నమును మనమే తయారుచేసుకొనుచున్నాము. స్వప్న విషయమంతయు మనోకల్పితమే. స్వప్నమునకు స్వప్నద్రష్టయే నిమిత్త కారణము, ఉపాదాన కారణమును అయి యున్నాడు. స్వప్నములో గాంచు విషయములు, వస్తువులు తన కన్యా అన్యముకాదు. అలాగే సృష్టి అంతయు బ్రహ్మముకన్నా అన్యము కాదు. తెరపై బొమ్మలు కదులునట్లు తనలోనే సర్వము సాగిపోవుచున్నది. బొమ్మలు

అనిత్యము. తెర నిత్యము. సృష్టి అనిత్యము. సృష్టికర్త నిత్యము. కల మనస్సులో పుట్టి, మనస్సులోమెదిలి, మనస్సులో లయించును. అలాగే జగత్తు బ్రహ్మములో పుట్టి, బ్రహ్మములో కదిలి, బ్రహ్మములో కరిగిపోవును. ఈ విషయమును నీటిబుడగ దృష్టాంతము ద్వారా ఆచార్యుల వారు ఈ శ్లోకములో వివరించినారు.

నీటి బుడగ నీటియందే ఆవిర్భవించును. నీటిలోనే జీవించును. నీటిలోనే లయించును. జీవించునపుడు కూడా అది నీటికన్నా అన్యముగా లేదు. నీటి లక్షణములే నీటిబుడగ యందున్నవి. నీటికి వేరుగాకనే ఒక ప్రత్యేక నామము ద్వారా తెలియుచున్నది. వస్తుత: నీటికి, నీటి బుడగకు ఎలాంటి భేదములేదు. అలాగే బ్రహ్మమునుండి ఆవిర్భవించిన జగత్తు బ్రహ్మముకన్నా అన్యముకాదు. నామరూపములను తొలగించి చూసినచో, అస్తి, భాతి, ప్రియమైన ఆత్మయే అధిష్ఠానవస్తువై తెలియును. జగత్తు కేవలం కలవలె మనోకల్పితమనియు, ఉన్నది బ్రహ్మ మొక్కటియేననియు అనుభూతి కలుగును.

బ్రహ్మ మొక్కటియే యున్నయెడల జగత్తు భ్రాంతిమయమై యుండ వలెను. రజ్జువునందు సర్పము గోచరించు విధమున జగత్తు బ్రహ్మమునందు ఆరోపించబడియున్నది. రజ్జువును గాంచగనే సర్పభ్రాంతి నశించును. బ్రహ్మ దర్శనముతో జగద్భ్రాంతి అంతరించును. మరి మనకు జగద్భ్రాంతి ఎందుకని అదృశ్యం కావడంలేదు? మనము జగత్తుతో తాదాత్మ్యం చెంది జగత్తును అర్థం చేసుకొనుటకు ప్రయత్నించుట వలన జగత్తు యొక్క వాస్తవ స్వరూపము గోచరించుట లేదు. జగత్తుతో మానసికంగా విడిపడి, జగత్తును గూర్చి ప్రశ్నించి సత్యమును గ్రహించవలెను.

ప్రపంచము నీలో యున్నదా? నీవు ప్రపంచములో ఉన్నావా? తానున్నట్లు ప్రపంచము ప్రకటించుట లేదు. నీ మనోభావాల ద్వారాప్రపంచము తెలియు చున్నది. సుషుప్తిలో మనస్సు లయించుచున్నది. అంతమాత్రాన నీవు అంతరిం చుటలేదు. నీవు మేల్కొనగానే జగత్తు అనుభవమునకు అందుచున్నది. నీ సంకల్పములే ప్రపంచమును తయారు చేయుచున్నవి. కనుక ప్రపంచము



నీలోనే యున్నది. ప్రపంచము గోచరించుటకు సంకల్పము కారణము. సంకల్పములు చైతన్యమును ఆధారముగ జేసుకొని నడచుచున్నవి. సంకల్పములు చైతన్యములో లయించినచో, సంకల్ప జనితమైన జగత్తు కూడా అదృశ్యమగును.

జగత్తును గూర్చి ఆలోచించుట చేయగనే మన మనస్సు జగత్తులో చేరిపోవుచున్నది. అలాగాక ఈ జగత్తును వీక్షించు సంకల్పమునకు ఆధారమైన వస్తువు ఏమిటో ఆలోచించి చూసినచో, ఆ వస్తువు అధిష్ఠానమై భాసిల్లు ఆత్మయే ననియు, అట్టి ఆత్మ తానేనియు అనుభవమునకు అందును.

అవతారిక:- సచ్చిదానంద స్వరూపమై భాసిల్లు ఆత్మయందు నానావిధములైన రూపములు ఎలా కల్పించబడినవి? వివరణకు ముందుకు సాగండి.

సచ్చిదాత్మన్యనుస్యూతే
నిత్యే విష్ణౌ ప్రకల్పితాః
వ్యక్తయో వివిధా స్సర్వాః
హాటకే కటకాదివత్ 9

సచ్చిదాత్మని = సత్, చిత్ స్వరూపమైన, అనుస్యూతే = సర్వగతమైన, నిత్యే = శాశ్వతమైన, విష్ణౌ = సర్వవ్యాపకమైన పరమాత్మయందు, వివిధాః = అనేకవిధములైన, సర్వాః = సమస్తములైన, వ్యక్తయః = రూపములు, హాటకే = బంగారమునందు, కటకాదివత్ = మురుగు మొదలగు ఆభరణముల వలె, ప్రకల్పితాః = కల్పింపబడినవి.

భావము:- **నిత్యమై, సర్వవ్యాపకమై, సచ్చిదానంద లక్షణములు కలిగిన బ్రహ్మమునందు, వివిధములగు ఆభరణములు బంగారమునందు కల్పించబడి యున్నట్లు, వివిధ జగద్రూపములు కల్పింపబడినవి.**

## వ్యాఖ్య

అస్తిభాతి ప్రియములు నిత్యములు.నామరూపములు అనిత్యములు. అస్తిభాతి ప్రియమైన సచ్చిదానంద స్వరూపము సర్వవ్యాపకము. నామరూపములు

పరిమితమనుగడను సాగించును. నామరూపములు ఆధేయమై యుండ అస్తి భాతి ప్రియము ఆధారస్వరూపమై యున్నది.ఆధారవస్తువు సత్యము. ఆధేయ వస్తువు ఆరోపించబడినదికాన అసత్యము. పరమాత్మ సత్యము. ప్రపంచము అసత్యము. ఆరోపించబడిన జగత్తు కల్పితము. ఆధారమైన బ్రహ్మము నిర్వికల్పము, నిరంజనము.

ఉన్నదంతయు ఒక్కటే అనునది ఉపనిషదృషుల విశిష్ట సందేశము. ఇది కేవలం జిడ్డు సిద్ధాంతము గాక గడ్డు జీవితమును తెడ్డువేసి నడిపించు అనుభవ సిద్ధాంతమై యున్నది. జీవించియుండగనే అనుభవించదగిన అపూర్వ అనుభూతియై యున్నది. ఆధునిక విజ్ఞానశాస్త్ర పరిధిలో జరిగిన ప్రయోగములు, తద్వారా అరుదెంచిన నిర్ణయములు ఈ సనాతన ఆర్ష సిద్ధాంతమును బలపరుచు శక్తివంతమైన ఆయుధములై నిలిచినవి. ప్రముఖ విజ్ఞానశాస్త్రవేత్త అయిన ఐన్‌స్టీన్ ' నాకు గోచరించు విశ్వము' (The universe as I see it) అనెడి గ్రంథములో ఇలా వ్రాశారు.

This firm belief, a belief bound up with deep feeling, in a superior mind that reveals itself in the world of experience, represents my conception of God. In common parlance this may be described as pantheistic.

' అనుభవాత్మక ప్రపంచములో తనను తాను ప్రదర్శించుకొను నట్టి ఒక పరిశుద్ధమైన మనస్సులో గాఢమైన భావనతో బద్ధమైన విశ్వాసము. ఈ దృఢ విశ్వాసము నా భగవదవగాహనను సూచిస్తుంది. దీనిని మామూలు మాటల్లో చెప్పాలంటే వైశ్వ దేవమతం అనవచ్చు '.

ఐన్‌స్టీన్ కనుపరచిన ఈ భావమునే నోబుల్ బహుమతి గ్రహీత వేవ్ మెకానిక్స్ (Wave mechanics) ను కనిపెట్టిన మేధావి ష్రోడింజర్ " వాట్ ఈజ్ లైఫ్ " అనే తన గ్రంథములో ధృవపరచడము జరిగినది.

ప్రముఖ పెలంటయాలజిస్టు " ది మీనింగ్ ఆఫ్ ఎవల్యూషన్ " అనే తన గ్రంథములో ఈ క్రింద విధముగా తెలియజేశారు.



' The first grand lesson was that of the unity of life ..... not only are all men brothers; all living things are brothers in the very real sense that all have arisen from one source and developed with in the divergent intricacies of one process .... Man is part of nature and he is kin to all life.'

' జీవిత ఏకత్వము ప్రప్రథమమైన దివ్యోపదేశం. అందరు మానవులు సోదరులే. అంతేకాదు యదార్థానికి సర్వజీవరాశులు సోదరులే. ఏలన, అన్నీ ఒక ఉద్గమస్థానము నుండి బయలుదేరి, ఒక పద్ధతి యొక్క విభిన్నమైన తికమకలలో వృద్ధినొందాయి. మానవుడు ప్రకృతిలో భాగం. అతడు సమస్త ప్రాణికోటికి బంధువు.'

ప్రముఖ విజ్ఞాన శాస్త్రవేత్త అయిన ' సర్ జేమ్స్ జీన్స్ ' తన గ్రంథమగు ' ఫిజిక్స్ అండ్ ఫిలాసఫీ ' లో ఈ క్రింది విధంగా వ్రాశారు.

' When we view ourselves in space and time, our consciousnesses are obviously the separate individuals of a particular picture, but when we pass beyond space and time, they may perhaps form ingredients of a single continuous stream of life. As it is with light and electricity, so it may be with life; the phenomena may be individuals carrying on separate existences in space and time, while in the deeper reality beyond space and time we may all be members of one body'.

దేశకాల పరిధులలో మనల్ని మనం చూసుకొన్నప్పుడు మన ప్రజ్ఞలు ఒక నిర్దేశిత చిత్రము యొక్క విభిన్న వ్యక్తులుగ ష్పష్టీకరణ మవుతాయి. కాని మనం దేశ, కాలాలను దాటిపోయినప్పుడు అవి ఏకైక అఖండ జీవ ప్రవాహంలోని అంశాలుగా గోచరమవుతాయి. కాంతి, విద్యుత్తుల విషయంలో లాగానే జీవిత విషయంలో కూడా, దృగ్విషయాలు అనేవి దేశకాలాల్లో వ్యక్తులు భిన్న అస్తిత్వాలను గొనిపోవడం గావచ్చు. కాని, దేశ కాలాలను అతిక్రమించిన ప్రగాఢ సత్యదృక్పథంలో మనమందరము ఒకే ఒక దేహానికి సంబంధించిన వివిధ అవయవాలు అవుతాము.

జె.బి. యస్. హాల్డేనే అనే ప్రముఖ జీవశాస్త్రజ్ఞుడు ఒకచోట తన ఉపన్యాసమును క్రింద కనుపరచిన ఉత్తేజకరమైన వాక్యముతో ముగించెను.

' On the walls of the large room in the Zoological laboratory at Munster, where professor Rensch keeps his living animals, are written the words 'Tat Twam Asi' (Thou art that). If I have helped any of you to understand some of the implications of this great saying, my lectures have not been in vain.'

' మన్స్టర్‌లోని ప్రాణిశాస్త్ర సంబంధ పరిశోధనాగారంలో (అచట రెన్స్ అనే ఆచార్యుడు తన సజీవ జంతువులను ఉంచుతాడు) ఒక పెద్దగది గోడల పైన 'తత్ త్వం అసి ' అనే మాటలు వ్రాయబడి ఉన్నాయి. ఈ మహా వాక్యములోని కొన్ని జటిల భావాలను మీలో ఎవరైనా గ్రహించడానికి నేను తోడ్పడియుంటే, నా ఉపన్యాసాలు వృథా కాలేదు అని అనుకొంటాను.'

నామరూపాత్మకమైన జగత్తునకు బ్రహ్మమే ఆధారమై యున్నందున జగత్తు బ్రహ్మము కన్నా అన్యముకాదు. నామరూపములను తొలగించి దర్శించినచో బ్రహ్మానుభవము కలుగును. బంగారు ఆభరణములలో యున్నదంతయూ బంగారమే.ఆభరణములను దర్శించగానే రూపము గోచరమై, తద్వారా నామము తెలియును. ఆభరణములను దర్శించు దృష్టిని ఆధార వస్తువుపై మరల్చగానే బంగారు అనుభవమునకు అందును. బుద్ధిలో బంగారు అను భావము మెదలగానే బంగారము అనుభవమై మిగులును. కనుక బుద్ధి గొలుసుపై గాక బంగారుపై పయనించవలెను. గొలుసు బుద్ధి భ్రాంతి నందించును. బంగారు బుద్ధి శాంతిని చేకూర్చును. కనుక ఆభరణములు బంగారు యందు ఆరోపించబడియున్నట్లు జగత్తు బ్రహ్మమునందు కల్పించ బడియున్నదని ఆచార్యులు తెలియ జేయుచున్నారు. బంగారును దర్శించువానికి ఆభరణములు గోచరించనట్లు బ్రహ్మమును దర్శించువానికి జగత్ కనుపించదు.

**ఐతదాత్మ్య మిదగ్ం సర్వమ్ '**



"సర్వమూ ఆత్మయే" నని వేదము తెలియజేయుచున్నది. ఆత్మానుభూతియే అజ్ఞానమును అంతమొందించును.

**సబాహ్యాభ్యంతరే దేహే హ్యద ఉర్ధ్వం చ దిక్షుచ**
**ఇత ఆత్మాతతో౽ప్యాత్మా నాస్త్యనాత్మ మయం జగత్**

" ఈ దేహమునకు బయట లోపల, పైన క్రింద, అటు ఇటు, అన్ని దిశల, సర్వత్ర ఆత్మయే యున్నది. అనాత్మయగు జగత్తు లేదు." అని మహోపనిషత్ తెలుపుచున్నది.

కనుక ఉన్నది ఒక్క ఆత్మయే. రెండవ వస్తువు గోచరించుట భ్రాంతి లేక అవిద్య. అవిద్యాజనితమైన జగత్తు యొక్క అస్తిత్వము అనిత్యమని గుర్తించి సదా ఏకవస్తు దర్శనముచేసి ముముక్షువు తరించవలెను.



అవతారిక:- సదా ఏకమై భాసించు ఆత్మ ఎలా భిన్నముగ గోచరించుచున్నది? తరువాత శ్లోకము ననుసరించవలెను.

యధాకాశో హృషీకేశః
నానోపాధి గతో విభుః
తత్ భేదాత్ భిన్నవద్భాతి
తన్నాశే కేవలో భవేత్ ॥ 10

హృషీకేశః = మనస్సు మొదలగు ఇంద్రియములను నియమించు, విభుః = సర్వవ్యాపకుడైన పరమాత్మ, యధా = ఏవిధముగా, ఆకాశః = ఆకాశము, తద్భేదాత్ = ఉపాధుల భేదముచేత, భిన్నవత్ = వేరుగా యున్నట్లు తోచుచున్నదో, తన్నాశేసతి = ఆ ఉపాధులు నశించగా, కేవలః = ఏకముగా, భవేత్ = అగుచున్నాడు.

**భావము:- ఘట మఠాది ఉపాధి సంసర్గము చేత ఆకాశము భిన్నమైనట్లు గోచరించి, ఉపాధులు నశించగనే ఏకమై ఎలా గోచరించుచున్నదో అలాగే, సర్వగతుడైన పరమాత్మ ఉపాధి సంసర్గముచే భిన్నముగా తెలియుచున్నను ఉపాధులు నశించగానే అఖండమై అలరారును.**

# వ్యాఖ్య

ఆత్మ చైతన్య స్వరూపము. చైతన్యమైన ఆత్మ సర్వగతమై యున్నది. మానవుడు చైతన్య స్వరూపుడు. చైతన్య స్వరూపమైన తాను పరిమితుడనని భావించి దుఃఖితుడగుచున్నాడు. ఇదియే బంధమై యున్నది. ఈ బంధమునే అధ్యాస యందురు. దేహేంద్రియ మనో బుద్ధులతో తాదాత్మ్యం చెంది తాను జీవుడనని, అజ్ఞానినని భ్రాంతి చెందుచున్నాడు. తాను యదార్థానికి సర్వగతుడైన పరమాత్మయై యుండి అవిద్యా ప్రభావముచే సంకుచితభావ బంధములో చిక్కి బాధితుడగుచున్నాడు. దేహాత్మ భావమును ఆత్మయం దారోపించుకొని వ్యథ చెందుచున్నాడు. అదియే అధ్యాస.

' అతస్మిం స్తద్బుద్ధి రధ్యాసః'

" ఒకదాని లక్షణమును మరొక దాని యందు ఆరోపించుట అధ్యాస యనబడును" సర్పముకాని రజ్జువునందు సర్పబుద్ధి నుంచుట అధ్యాస యనబడుతుంది.

దేహాత్మ భావముచే దేహము తాననెడి అధ్యాస ఏర్పడినది. దేహము పరిమితమై యున్నందున తానూ పరిమితుడనని భావన కలుగుచున్నది. దేహమునకు పుట్టుక యున్నందున తాను పుట్టుక గలవాడనని అభిప్రాయము ఏర్పడుచున్నది. దేహము నశించును గనుక తాను నశించువాడనని ఆలోచన కదులుచున్నది. దేహము దృశ్యమై తెలియబడుచున్నది. తాను దృక్కుయై దేహమునకు దర్శించు చున్నాడు గాన తాను దేహముకన్నను అన్యమై యున్నాడు.ఉపాధి రహితుడై యున్నాడు. ఈ సత్యమును గ్రహించలేని అజ్ఞానదశలో తాను ఉపాధికి పరిమితుడనని భావించుచున్నాడు. ఈ విషయమును ఆకాశ ఉపమానము ద్వారా ఆచార్యులు తెలియజేయుచున్నారు.

ఆకాశము అనంతమై యున్నది. ఒక కుండ తయారైనది. కుండలో ఆకాశము నిలిచియున్నది. ఎన్ని కుండలు చేసినను అన్ని కుండలలో ఆకాశము



గోచరించును. ఆకాశము యొక్క అనంతత్వము తెలియని అజ్ఞాని ఆకాశము కుండలకు పరిమితమై యున్నదని భావించును. ఒక్కొక్క కుండలో ఒక్కొక్క ఆకాశమున్నట్లు భావించును. ఘటము తయారైనదేగాని ఆకాశము తయారు కాలేదు. ఘటము నశించునేగాని ఆకాశము నశించదు. ఘటము ఆకాశములోనే తయారైనది గనుక ఆకాశము ఘటమునకు పరిమితముకాదు. ఘటమును ఒకచోట నుండి ' మరియొక చోటికి తరలించినపుడు ఘటము కొనిపోబడునేగాని ఆకాశమును తరలించుట జరుగదు. ఘటము కదులునపుడు కూడా అది ఆకాశములోనే కదులుచున్నది. ఆకాశము సర్వత్ర నిండియుండుటచే రాకపోకలకు ఆస్కారము లేదు. ఆకారమై గోచరించనూ లేదు. ఘటము వికారము చెందును. ఆకాశము అవికారమై యున్నది.

ఘటమువలె శరీరము వికారము చెందును. జగత్తు పరిణామ యుతము. దేహాదులు కూడా ప్రపంచములోనే జనించుటచేత అవికూడా పరిణామశీలమై యున్నవి. జడమగు వస్తువు తనను గాని, తన కన్యమైన దానిని గాని తెలిసికొనలేదు. చైతన్యమే తెలిసికొనును. దేహము జడము గనుక తనకు తనను గురించిగాని అన్యమైన వస్తువులను గురించి గాని తెలియదు. కళ్ళజోడు తనకు తానుగా దేనిని చూడజాలదు. మనము కళ్ళజోడు ద్వారా సమస్తమును తర్శించగలుగుదుము శరీరము కళ్ళజోడులాంటి పరికరము. చైతన్యమే సమస్త సాక్షియై యున్నది. అట్టి చైతన్యము సర్వగతమై యున్నది. అజ్ఞానముచే ఉపాధి సంసర్గముచేత భిన్నమైనట్లు భావించబడుచున్నది.

ఆకాశము భిన్నముగాకనే భిన్నమైనట్లు గోచరించుట అజ్ఞానము. అనంతమైన ఆకాశ మనుగడను అవగతము చేసికొనుట యను జ్ఞానము ద్వారా అజ్ఞానము నంతమొందించవలయును. అజ్ఞానము అంతమొందించబడగానే స్వరూపజ్ఞానము కలుగును. అట్టి జ్ఞానానుభూతిలో ఆకాశము అభిన్నమని, సర్వగతమని తెలియును. ఘట మఠాకాశము లనునవి కల్పితభావాలే నని ఎఱుకపడును. ఘట మఠములు నశించినను ఆకాశము నశించదని తెలియును.

అలాగే అనంతుడైన పరమాత్మ ఉపాధి సంసర్గముచేత, ఆకాశము భిన్నముగ గోచరించులాగున, పరిమితుడైనట్లు తెలియుచున్నాడు. ఉపాధి యనునది కేవలము అధ్యాసే గనుక అట్టి కల్పిత భావము నశించగానే ఏకమై తెలియబడును. ఏకమైన వస్తువు సర్వవ్యాపి గనుక పరమాత్మను 'విభు:' అని సూచించెను. విభుడైన పరమాత్మను 'హృషీకేశ:' అని కూడా ఆచార్యులవారు ఈ శ్లోకములో తెలియజేసిరి. 'హృషీక ఈశ హృషీకేశ:' అనగా ఇంద్రియములకు ప్రభువు అని అర్థము. ఇంద్రియములకు శక్తినొసగు ఆత్మయే ఇచ్చట హృషీకేశ యని తెలియబడినది. అదియునుగాక ఇంద్రియ నిగ్రహము గలవారే ఉపాధి రహితులై, హృషీకేశుడైన పరమాత్మానుభూతిని పొందుటకు అర్హులని తెలియుట గమనార్హము.

❀❀❀

అవతారిక:- అజ్ఞానముచే ఉపాధి, సంసర్గము ప్రాప్తించినది. ఉపాధి సంసర్గముచే ఆత్మ యందు అనాత్మ లక్షణములు ఆరోపించబడినవి. ఈ విషయమును రాబోవు శ్లోకము వివరించును.

నానోపాధి వశాదేవ
జాతి వర్ణాశ్రమాదయ:
ఆత్మ న్యారోపితాస్తోయే
రసవర్ణాది భేదవత్ ॥ 11

నానోపాధి వశాదేవ = అనేకములయిన ఉపాధుల సంసర్గమువలననే, తోయే = నీటియందు, రసవర్ణాది భేదవత్ = రుచి, రంగు మొదలగు భేదములవలె, ఆత్మని = పరమాత్మయందు, జాతివర్ణాశ్రమాదయ: = జాతి, వర్ణము, ఆశ్రమము మొదలగువవి, ఆరోపితా = కల్పింపబడినవి.

**భావము:- నీటియందు రుచి, రంగు మొదలగునవి ఆరోపించబడినట్లు ఉపాధి సంసర్గముచేత ఆత్మయందు ,జాతి, కుల, ఆశ్రమాదులు ఆరోపించబడినవి.**



## వ్యాఖ్య

దేని జ్ఞానముచేత మనము సకలమును గాంచుచున్నామో అదియే ఆత్మ. సర్వదేహాలలో ప్రకాశించు జ్ఞానద్యుతి ఈ ఆత్మయే. దేహము చరించుట ఈ ఆత్మయే కారణమగుచున్నది. మనోబుద్ధులు ప్రవర్తించుటకు ఆత్మయే ఆధారమై యున్నది. ఇంద్రియములు పనిచేయుటకు వలయు శక్తి ఆత్మనుండియే గ్రహించబడుచున్నది. ఎవరు ఏవిధమైన ఆలోచన సాగించినా దానికి కారణమైన శక్తి ఆత్మయే అయియున్నది.

అందరిలో భాసించు ఆత్మ ఒక్కటియే. ఆత్మ ఒక్కటేగాని రెండు కానేరదు. అవస్థాత్రయమునకు సాక్షియై, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలలో జరుగు సమస్తమును గ్రహించునదియై యున్నది. తాను నిరుపాధికము, ఆత్మ అనంతము గనుక పరిమితము కాదు. సర్వవ్యాపియై యున్నందున నిష్క్రియము. శరీరములలో భేదమేగాని ఆత్మ ఏకమై భాసించుచున్నది. చెఱకు గడలు వేరుగా కన్పించినను తియ్యదనములో మార్పులేనట్లు, రానట్లు, దేహములు భిన్నమైనను ఆత్మస్వరూపము నందు అభేదమే గాంచదగియున్నది.

అభేదమై, అద్వయమై భాసించు ఆత్మను దర్శించు జ్ఞానము లేక పోవుటచేత దానిస్థానే అనాత్మ గోచరించి అజ్ఞానమును నింపుచున్నది. అట్టి అజ్ఞాన ఫలితముగ దేహము, భార్యా పుత్రాదులు, సంసారము మొదలుగునవి తయారై మానవుని అనంత దు:ఖమునకు గురిచేయు చున్నవి. శరీరమునకు మనము ఎంతగా తాదాత్మ్యము చెందియున్నామో దు:ఖమునకు అంత చేరువై యున్నామని భావము. అనాత్మ తోడి సంబంధమే జీవునికి ముఖ్యబంధమై యున్నది. సాధారణముగా ప్రతి వ్యక్తి తాను దేహమనే భావించి, దేహమును పోషించుటలో, సింగారించుటలో కాలయాపన చేస్తుంటాడు. ఆ వ్యక్తే మానసికావేశమునకు గురియైనపుడు తాను మనస్సని భావించి, ఊహాలోకాల్లో అప్రయోజకుడై విహరిస్తుంటాడు. అదే వ్యక్తి బుద్ధితో తాదాత్మ్యం చెందినపుడు తన భావాలలో సంయోగము చెంది, గాలిమేడలు నిర్మిస్తుంటాడు. ఇలా దేహస్థాయిలోను, మనోస్థాయిలోను పరిభ్రమిస్తూ ఆత్మా సంసర్గముచే కలుగు

శీతోష్ణములు, సుఖదుఃఖములు మానావమానములను అనుభవిస్తూ తాను పరిమితుడనని వ్యథ చెందుతుంటాడు.

దేహము తానని భావించుటచేత దేహమును ప్రాణ సమానముగా సదా కాపాడుకొనవలసిన దుర్గతి ఏర్పడినది. నిరంతర దేహాధ్యాసవలన దేహమే ఆత్మయనెడి భావము ఏర్పడినది. దేహ లక్షణములను ఆత్మ యందు ఆరోపించడము జరిగినది. ఈ విషయమును ప్రస్తుత శ్లోకములో ఆచార్యులు తెలియజేయుచున్నారు. నీటియందు రుచి, రంగు మొదలగునవి ఆరోపించబడినట్లు ఉపాధి సంసర్గముచేత ఆత్మయందు జాతి, కుల, ఆశ్రమాదులు ఆరోపించబడి యున్నవని తెలియజేయు చున్నారు.

నీటికి రంగు, రుచి లేదు. అవి కేవలం మనోకల్పితములై యున్నవి. అనేక రంగుల సీసాలలో నీటిని నింపినపుడు, సీసాయొక్క రంగును బట్టి నీటియొక్క రంగు గోచరించును. యదార్థానికి అచ్చట గోచరించు రంగు ఉపాధియైన సీసాదే గాని నీటిది గాదు. అలాగే ఆత్మ అందరిలో ఏకమై భాసించుచున్నది. నిర్మలమైన ఆత్మలో జాతి కుల ఆశ్రమాదులు తలెత్తే అవకాశము లేదు. ఉపాధుల ననుసరించి ఈ భేదము గుర్తించబడుచున్నది. మానవపశుపక్ష్యాదుల యందున్న ఆత్మ ఒక్కటియే. ఉపాధి భేదము ననుసరించి మానవజాతి, పశుజాతి, పక్షిజాతి యనిగణనీయమైయున్నది. మానవులందరూ చైతన్య స్వరూపులే అయి యున్నారు. దేహభేదముచేత బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య,శూద్రయని విభజింపబడి యున్నారు. ఆత్మకు లింగభేదములేదు. వయోభేదములేదు. శరీర భేదముచేత బ్రహ్మచారియని, గృహస్థుడని, వానప్రస్థుడని, సన్యాసియని పిలవబడుచున్నారు. ఈ భేదము లన్నియు ఉపాధి స్థాయి నుండి జరుగుచున్నవే గాని ఆత్మస్థాయిలో అగోచరమై యున్నవి. ఆత్మజ్ఞానము లేకపోవుటచేత ఉపాధులకు పరిమితులమై అనాత్మ లక్షణాలను ఆత్మయందారోపించుకొని దుఃఖితులగుచున్నాము. రెండుపాళ్ళ ఉదజని ఒకపాలు ప్రాణవాయువు కలియుటచే ఏర్పడిన జలముయొక్క యధార్థ స్వరూపము



మనకు శాస్త్రీయముగా అర్థమైనచో నీటియందు గోచరించు రంగు, రుచి మొదలగునవి కల్పితమైనవని గుర్తించగలము. అలాగే నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త స్వరూపమైన ఆత్మయొక్క సచ్చిదానంద లక్షణము అనుభవరీత్యా బోధపడినచో ఈనాడు మనకు గోచరించు జాతి వర్ణ ఆశ్రమాదులు కల్పితములని, ఆరోపితములని గుర్తించ గలము.

**అనాద్యనంత బ్రహ్మోహం!**

**అమృతా వినాశి బ్రహ్మోహం!**

**అధిష్ఠా నా పరిచ్ఛిన్న బ్రహ్మోహం!**

'నేనుఆదిలేనివాడను. అనంతబ్రహ్మమును. అమృతస్వరూపము. అవి నాశియైన బ్రహ్మమును, అధిష్ఠాన అపరిచ్ఛిన్న బ్రహ్మమును' అని బ్రహ్మానుభవ ఉపనిషత్తు తెలియజేసినది. ఇదియే ప్రతి ఒక్కరు ఉపాధి సంసర్గమును వీడి పొందదగిన దివ్యానుభూతి.



అవతారిక:- అజ్ఞానముచే సంప్రాప్తించిన శరీరము మూడు విధములుగ తెలియుచున్నది. అవియే స్థూల, సూక్ష్మ కారణ శరీరములనెడి దేహత్రయము. రాబోవు శ్లోకములో స్థూల శరీరమును గూర్చి ఆచార్యులు తెలియజేయుచున్నారు.

పంచీకృత మహాభూత
సంభవం కర్మసంచితమ్
శరీర సుఖదుఃఖానాం
భోగాయతన ముచ్యతే ॥ 12

పంచీకృత మహాభూత సంభవం = పంచ మహాభూతములు పంచీకరణ చెందుట ద్వారా జనించినదియు, కర్మ సంచితం = గత కర్మలచే పొందబడిన, శరీరం = దేహము, సుఖదుఃఖానాం = సుఖదుఃఖములకు, భోగాయతనం = అనుభవించు క్షేత్రముగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**భావము:- గత కర్మానుసారముగా నిర్ణయించబడి పంచభూతముల యొక్క పంచీకరణ ద్వారా ఏతెంచిన శరీరము స్థూల శరీరమనబడి సుఖదుఃఖముల ననుభవించు క్షేత్రమై యున్నది.**

## వ్యాఖ్య

అజ్ఞానాలయమైన దేహము అవతరించిన విధానమును దాని నిజ స్థితిని గూర్చి ఆచార్యులవారు ఈ శ్లోకములో తెలియజేయుచున్నారు. మొదట పంచమహాభూతములు సూక్ష్మరూపములో సృష్టించబడినవి. వాటినే తన్మాత్రలు అందురు. అవి తదుపరి పంచీకరణము ద్వారా స్థూలరూపమును పొంది ఇంద్రియ మనోబుద్ధులచేత తెలియబడుచున్నవి. సూక్ష్మరూపములో నున్న పంచమహాభూతములు స్థూలముగా వ్యక్తమగుటకు జరిగిన పద్ధతిని వేదాంత పరిభాషలో పంచీకరణము అందురు. ఈ పంచీకరణ ప్రక్రియ ద్వారానే మనకు స్థూలదేహము ప్రాప్తించినది.

సూక్ష్మరూపములో నున్న పంచమహాభూతములే తన్మాత్రలని గ్రహించితిమి వీటినే పంచ తన్మాత్రలు అందురు. భూమి, వాయువు, అగ్ని, జలము, ఆకాశము అను పంచభూతములకు ఈ తన్మాత్రలు ప్రాతినిధ్యము వహించుచున్నవి. ఒక్కొక్క తన్మాత్ర రెండుగా విభజింపబడుటకు వీలుగా తయారుకాగానే, తరువాత దశలో రెండు సమభాగములుగా విభజింపబడును. ప్రతి తన్మాత్ర రెండు సమభాగములైనది. తరువాత ప్రతి తన్మాత్రలో సగభాగము అలాగే చెదరకుండా యుండగా, మిగిలిన సగభాగము నాలుగు సమభాగములగును.

ప్రతి తన్మాత్ర సగభాగము ఒకటిగా యుండ, మిగిలిన సగభాగము నాలుగు సమభాగము లయ్యెను. నాలుగు భాగములైన సగభాగములోని ఒక్కొక్కభాగము మొత్తము తన్మాత్రలో ఎనిమిదవ వంతుగా యున్నదని మనకు అవగతమైనది. తరువాత ఒక తన్మాత్రలో చెదరకయున్న సగభాగముతో మిగిలిన నాలుగు తన్మాత్రలలో ఒక్కొక్క దానిలో నాలుగు సమభాగములై యున్న వానిలో ఒక్కొక్కటి చొప్పున కలియును. ఇపుడు మళ్ళీ పూర్ణ తన్మాత్ర



స్వరూపమంత అగును. అనగా ఒక తన్మాత్రలోని సగభాగము మిగిలిన నాలుగు తన్మాత్రలలో ఒక్కొక్కదానినుండి ఎనిమిదవ వంతును గ్రహించును. ఇదియే పంచీకరణము అనబడును.

ఆకాశము:- 1/2 ఆకాశము+1/8 గాలి+1/8 అగ్ని+1/8 నీరు+1/8 భూమి.

భూమి:- 1/2 భూమి+1/8 గాలి+1/8 అగ్ని+1/8 నీరు+1/8 ఆకాశము.

నీరు:- 1/2 నీరు+1/8 గాలి+1/8 అగ్ని+1/8 భూమి+1/8 ఆకాశము.

అగ్ని:- 1/2 అగ్ని+1/8 గాలి+1/8 భూమి+1/8 నీరు+1/8 ఆకాశము.

గాలి:- 1/2 వాయువు+1/8 అగ్ని+1/8 భూమి+1/8 నీరు +1/8 ఆకాశము.

ఈ విధమైన పంచీకరణద్వారా ఏర్పడిన స్థూల పంచ భూతముల వలన స్థూలశరీరము ఏర్పడును. దేహములన్నియు పాంచ భౌతికములై యున్నను, అందరి దేహములు ఒకే విధముగా, ఒకే రూపములో ఉండవు. రూపములలో వ్యత్యాసము లుండును. ప్రవర్తనలలో భేదము గోచరించును. అనుభూతులలో తారతమ్యముండును. అందరిలో ఒకే చైతన్యము భాసించునపుడు ఈ విధమైన భేదములు ఎలా గోచర మగుచున్నవి? సూక్ష్మ శరీరములో మార్పు యుండుట చేత. సూక్ష్మ శరీరములో మార్పు ఎలా కలిగెను? గత కర్మానుసారముగ కలిగెను.

గతములో మన మాచరించిన కర్మల యొక్క ఫలితముగ మనకు ఈ జన్మ ప్రసాదించబడినది. గతములో మనము పొందిన అనుభవములతో నుండిన సూక్ష్మ శరీరము మనకు లభించును. సూక్ష్మ శరీరములో నిగూఢమైయున్న వాసనలు ఈ జన్మలో స్థూలశరీరము ద్వారా వ్యక్తమగుచుండును. వ్యక్తులు గత జన్మములలో పొందిన అనుభూతులు, ఆచరించినకర్మలు ఏవిధముగ యున్నవో తదనుకూలమైన సూక్ష్మశరీరము లభించును. ఈ సూక్ష్మ శరీరములోని భావాలే స్థూలశరీరము ద్వారా వ్యక్తమగును గాన వ్యక్తుల కర్మాచరణ యందు తేడా గోచరించును.

## వ్యాఖ్య

అజ్ఞానాలయమైన దేహము అవతరించిన విధానమును దాని నిజ స్థితిని గూర్చి ఆచార్యులవారు ఈ శ్లోకములో తెలియజేయుచున్నారు. మొదట పంచమహాభూతములు సూక్ష్మరూపములో సృష్టించబడినవి. వాటినే తన్మాత్రలు అందురు. అవి తదుపరి పంచీకరణము ద్వారా స్థూలరూపమును పొంది ఇంద్రియ మనోబుద్ధులచేత తెలియబడుచున్నవి. సూక్ష్మరూపములో నున్న పంచమహాభూతములు స్థూలముగా వ్యక్తమగుటకు జరిగిన పద్ధతిని వేదాంత పరిభాషలో పంచీకరణము అందురు. ఈ పంచీకరణ ప్రక్రియ ద్వారానే మనకు స్థూలదేహము ప్రాప్తించినది.

సూక్ష్మరూపములో నున్న పంచమహాభూతములే తన్మాత్రలని గ్రహించితిమి వీటినే పంచ తన్మాత్రలు అందురు. భూమి, వాయువు, అగ్ని, జలము, ఆకాశము అను పంచభూతములకు ఈ తన్మాత్రలు ప్రాతినిధ్యము వహించుచున్నవి. ఒక్కొక్క తన్మాత్ర రెండుగా విభజింపబడుటకు వీలుగా తయారుకాగానే, తరువాత దశలో రెండు సమభాగములుగా విభజింపబడును. ప్రతి తన్మాత్ర రెండు సమభాగములైనది. తరువాత ప్రతి తన్మాత్రలో సగభాగము అలాగే చెదరకుండా యుండగా, మిగిలిన సగభాగము నాలుగు సమభాగములగును.

ప్రతి తన్మాత్ర సగభాగము ఒకటిగా యుండ, మిగిలిన సగభాగము నాలుగు సమభాగము లయ్యెను. నాలుగు భాగములైన సగభాగములోని ఒక్కొక్కభాగము మొత్తము తన్మాత్రలో ఎనిమిదవ వంతుగా యున్నదని మనకు అవగతమైనది. తరువాత ఒక తన్మాత్రలో చెదరకయున్న సగభాగముతో మిగిలిన నాలుగు తన్మాత్రలలో ఒక్కొక్క దానిలో నాలుగు సమభాగములై యున్న వానిలో ఒక్కొక్కటి చొప్పున కలియును. ఇపుడు మళ్ళీ పూర్ణ తన్మాత్ర



స్వరూపమంత అగును. అనగా ఒక తన్మాత్రలోని సగభాగము మిగిలిన నాలుగు తన్మాత్రలలో ఒక్కొక్కదానినుండి ఎనిమిదవ వంతును గ్రహించును. ఇదియే పంచీకరణము అనబడును.

ఆకాశము:- 1/2 ఆకాశము+1/8 గాలి+1/8 అగ్ని+1/8 నీరు+1/8 భూమి.

భూమి:- 1/2 భూమి+1/8 గాలి+1/8 అగ్ని+1/8 నీరు+1/8 ఆకాశము.

నీరు:- 1/2 నీరు+1/8 గాలి+1/8 అగ్ని+1/8 భూమి+1/8 ఆకాశము.

అగ్ని:- 1/2 అగ్ని+1/8 గాలి+1/8 భూమి+1/8 నీరు+1/8 ఆకాశము.

గాలి:- 1/2 వాయువు+1/8 అగ్ని+1/8 భూమి+1/8 నీరు +1/8 ఆకాశము.

ఈ విధమైన పంచీకరణద్వారా ఏర్పడిన స్థూల పంచ భూతముల వలన స్థూలశరీరము ఏర్పడును. దేహములన్నియు పాంచ భౌతికములై యున్నను, అందరి దేహములు ఒకే విధముగా, ఒకే రూపములో ఉండవు. రూపములలో వ్యత్యాసము లుండును. ప్రవర్తనలలో భేదము గోచరించును. అనుభూతులలో తారతమ్యముండును. అందరిలో ఒకే చైతన్యము భాసించునపుడు ఈ విధమైన భేదములు ఎలా గోచర మగుచున్నవి? సూక్ష్మ శరీరములో మార్పు యుండుట చేత. సూక్ష్మ శరీరములో మార్పు ఎలా కలిగెను? గత కర్మానుసారముగ కలిగెను.

గతములో మన మాచరించిన కర్మల యొక్క ఫలితముగ మనకు ఈ జన్మ ప్రసాదించబడినది. గతములో మనము పొందిన అనుభవములతో నుండిన సూక్ష్మ శరీరము మనకు లభించును. సూక్ష్మ శరీరములో నిగూఢమైయున్న వాసనలు ఈ జన్మలో స్థూలశరీరము ద్వారా వ్యక్తమగుచుండును. వ్యక్తులు గత జన్మములలో పొందిన అనుభూతులు, ఆచరించినకర్మలు ఏవిధముగ యున్నవో తదనుకూలమైన సూక్ష్మశరీరము లభించును. ఈ సూక్ష్మ శరీరములోని భావాలే స్థూలశరీరము ద్వారా వ్యక్తమగును గాన వ్యక్తుల కర్మాచరణ యందు తేడా గోచరించును.

గత కర్మానుసారముగా ప్రాప్తించిన ప్రారబ్దమును అనుభవిస్తూ వ్యక్తి నూతన కర్మల నాచరించును. నేడు ఆచరించు కర్మలే రాబోవు జన్మను నిర్ణయించును. మన కర్మలవలన సంప్రాప్తమగు ఫలితములను అనుభవించుటకు అనువైన క్షేత్రములను, అవి కొనసాగుటకు అనుగణ్యమైన ప్రదేశములలో జనించునట్లు కర్మఫల ప్రదాతయైన పరమాత్మ నిర్ణయించును. కనుక మన విధికి మనమే కర్తలమై యున్నాము అనుట నిర్వివాదాంశమై తెలియుచున్నది. కర్మానుసారముగా ఇలా ప్రాప్తించిన శరీరము స్థూలశరీరము (gross body) అనబడును. ఈ శరీరము సుఖదుఃఖముల ననుభవించు క్షేత్రమై యున్నది.

జీవుడు క్షరమైన ఈ శరీరముతో తాదాత్మ్యం చెంది, ఇంద్రియ సహచర్యముచే ఇంద్రియ విషయముల ననుభవించుటకు అలవాటుపడి, తద్వారా సుఖదుఃఖములను అనుభవించుచుండును. గృహస్థునకు గృహమువలె జీవునకు ఈ శరీరము విరామస్థానమై, అనుభవ క్షేత్రమై యున్నది,

పంచేంద్రియముల ద్వారా ఇంద్రియ విషయములను అనుభవించుటకు జీవుడు యత్నించును. విషయములు బయట ఉన్నవి. అనుభవము తన ఆంతర్యములో జనించుచున్నది. గృహస్థుడు బాహ్య ప్రపంచములో ధనార్జనచేసి, గృహములో అనుభవించులాగున జీవుడు బాహ్యవస్తువులతో సంబంధమును ఏర్పరచుకొని, తద్వారా కలుగు సుఖదుఃఖములను శరీరములో అనుభవించును. అందుచేత మానవుని స్థూలశరీరము సుఖదుఃఖముల ననుభవించు అనుభవ క్షేత్రమై యున్నది.



అవతారిక:- భోగాయుతమైన స్థూలశరీరమును గూర్చి గడచిన శ్లోకము ద్వారా తెలిసికొంటిమి. రాబోవు శ్లోకములో భోగసాధన క్షేత్రమైన సూక్ష్మశరీరమును గూర్చి గ్రహించెదము.

**పంచప్రాణ మనోబుద్ధి:**
**దశేంద్రియ సమన్వితం**
**అపంచీకృత భూతోత్థం**
**సూక్ష్మాంగం భోగసాధనం ॥ 13**



పంచప్రాణ = పంచప్రాణములు,మనోబుద్ధి: = మనోబుద్ధులు, దశేంద్రియ: = పది ఇంద్రియములు, సమన్వితం = కలిసి, అపంచీకృత = పంచీకరణము జరుగని, భూత = సూక్ష్మభూతముల వలన, ఉత్థం =ఏర్పడిన, సూక్ష్మాంగం = సూక్ష్మదేహము, భోగసాధనం = సుఖదుఃఖాది భోగములకు సాధనమని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

భావము:- **పంచప్రాణములు, దశేంద్రియములు, మనస్సు బుద్ధి మొత్తము పదునేడింద్రియములతో కలిసి, పంచీకరణము జరుగని సూక్ష్మ భూతముల వలన పుట్టిన దేహము సూక్ష్మ మనబడి భోగసాధన క్షేత్రమని పిలువబడుచున్నది.**

## వ్యాఖ్య

గడచిన శ్లోకములో స్థూలశరీరమును గురించి వివరించిన ఆచార్యులవారు ప్రస్తుత శ్లోకములో సూక్ష్మ శరీరమును గూర్చి తెలియజేయుచున్నారు. పంచీకరణము జరుగని సూక్ష్మభూతములనెడి తన్మాత్రలవలన ఆవిర్భవించిన సూక్ష్మశరీరము పదునేడింద్రియములతో కూడియున్నది. అవి పంచప్రాణములు. పంచప్రాణము లనగా ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అను ఐదు ప్రాణములు. తదుపరి జ్ఞానేంద్రియములు ఐదు. కర్మేంద్రియములు ఐదు. మనోబుద్ధులు రెండు. మొత్తము కలిపి పదునేడు అయినవి. ఈ పదునేడు ఇంద్రియములతో సూక్ష్మ శరీరమున్నది. ఈ సూక్ష్మ శరీరమునే లింగశరీరమని కూడా అందురు.

వాసనల సముదాయమంతయు సూక్ష్మ శరీరమునందే యుండును. మానవుని ప్రవర్తనను నడుపునది సూక్ష్మ శరీరమే అయి యున్నది. జాగ్రదావస్థలో స్థూల సూక్ష్మ శరీరములు రెండును చైతన్య వంతమై యుండును. సూక్ష్మ శరీరము ఇచ్చు ఆజ్ఞలను స్థూలశరీరము అమలు జేయుచుండును. స్వప్నావస్థలో స్థూలశరీరము ఎఱుక ఉండదు. అచ్చట సూక్ష్మశరీరమే సంపూర్ణముగ తెలియుచుండును. మనస్సులో అణగద్రొక్కబడియున్న నెరవేరని కోరికలు రూపమును దీర్చుకొని సంతృప్తి నొందును.

ఆత్మ చైతన్యము జాగ్రదావస్థయందు సూక్ష్మశరీరమును ప్రకాశవంతము చేసి, తద్వారా స్థూల శరీరము ప్రవర్తించునట్లు చేయును. స్థూల శరీరము నుండి విడపడి కేవలం సూక్ష్మ శరీరమునకే పరిమితమైనపుడు స్వప్న ప్రపంచము ననుభవించును. జాగ్రత్స్వప్నములు రెండిటియందును తెలియదగు సూక్ష్మ శరీరము చైతన్యముచే ప్రభావితమై ప్రకాశించుచున్నది. కనుకనే ఈ సూక్ష్మ శరీరమును వడ్రంగివాని పనిముట్లుతో పోల్చారుశ్రీ శంకరులు. మనో బుద్ధులనెడి సూక్ష్మ శరీరము వడ్రంగివాని పనిముట్లు వంటిదని వివేక చూడామణిలో తెలియజేశారు. పనిముట్లు వడ్రంగి కెలా ఉపకరించునో సూక్ష్మ శరీరము ఆత్మకు అలా ఉపకరించును. ఆత్మ చైతన్యవంతమైనను నిష్క్రియమై యున్నందున వ్యక్తము కాలేదు. ఆత్మ ప్రకాశము సూక్ష్మ శరీరము ద్వారా వ్యక్త మగును. వడ్రంగి పనిముట్లుతో అనేక విధములైన వస్తువులు తయారుచేయును. పనిముట్లు వాటంతట అవి పనిచేయలేవు. అలాగని వడ్రంగి సాధనము కాడు, సాధనములైన సుత్తి మొదలగు వానిద్వారా తాను పనిచేయును. అలాగే ఆత్మ తనకు తానుగా కర్మ లాచరించలేదు. మనోబుద్ధుల ద్వారా తాను పనిచేయును. ఆత్మ అండలేనిదే మనోబుద్ధులు కదలలేవు. స్థాణువులై పడియుండును. సాధనము సక్రమముగా లేనిచో వడ్రంగి క్రియాశీలత్వమునకు భంగము వాటిల్లును. అయితే ఈ విషయములో దోషము పనిముట్టుదే గాని పనివానిది కాదు. అలాగే వ్యక్తి చర్యలలో గోచరించు వ్యత్యాసములకు సూక్ష్మ శరీరమే కారణముగాని, దానిని నడుపు చైతన్యము కాదు. అందుచేత సూక్ష్మ శరీరము భోగసాధన క్షేత్రమని తెలియబడు చున్నది. సుఖదుఃఖాలకు ముఖ్యకారణమై యున్నది

❧

అవతారిక:- రాబోవు శ్లోకములో కారణ శరీమునుగూర్చి, ఆత్మ సాక్షిత్వమును గూర్చి తెలియజేయుచున్నారు.

అనాద్య విద్యా నిర్వాచ్యా
కారణోపాధి రుచ్యతే
ఉపాధి త్రిత్రయాదన్యం
ఆత్మాన మవధారయేత్ ॥ 14



అనాది = ఆదిలేనిది, అవిద్యా = అజ్ఞానము, అనిర్వాచ్యా = నిర్వచించుటకు వీలు కానిది, కారణోపాధి: = కారణశరీరముగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది, ఉపాధి త్రియాదన్యం = ఉపాదిత్రి త్రయమునకు వేరుగా, ఆత్మానం = ఆత్మ. అవధారయేత్ = తెలుసుకొనవలెను.

భావము:- అనిర్వాచ్యమై, అనాదియైనట్టి అజ్ఞానము కారణశరీరమై యున్నది. ఉపాధిత్రయమునకు విలక్షణమైనదే ఆత్మయని తెలుసుకో.

## వ్యాఖ్య

స్థూల సూక్ష్మ శరీరములను గూర్చి గడచిన రెండు శ్లోకములలో తెలిసికొంటిమి. దేహత్రయములో చివరిదైన కారణ శరీరమును గూర్చి ఈ శ్లోకములో తెలుసుకొందుము. జాగ్రత్స్వప్నావస్థల నుండి విడిపడగానే జీవుడు సుషుప్తిలో ప్రవేశించును. జాగ్రదానుభవములు, స్వప్నానుభూతులు కలసి సుషుప్తిలో అవ్యక్త స్వరూపమున బీజరూపముగ యుండును. సుషుప్తిలో ఇంద్రియ మనోబుద్ధులు సంపూర్ణముగా లయించినవి. అందుచేత మనో సంకల్పములుగాని, బుద్ధిలోని భావాలు గాని తెలియక, ఇంద్రియ జ్ఞానము సైతము లేని లయోమయస్థితియై యుండును. సుషుప్తిలో విషయజ్ఞానము లేదు. ఆత్మజ్ఞానము లేదు. కేవలం అజ్ఞానదశయై యున్నది. మనస్సు లయించుట చేత విషయ జ్ఞానము కలుగదు. అజ్ఞానదశయై యున్నందున ఆత్మజ్ఞానము అంతుపట్టదు. ఈ సుషుప్త్యవస్థయే కారణ శరీరము. అజ్ఞానమే కారణ శరీరము. కారణ శరీరమునందలి అవ్యక్తము సూక్ష్మ శరీరముతో తాదాత్మ్యము చెందగనే స్వప్నానుభూతులు కలుగును. స్థూల సూక్ష్మముల రెండిటితో తాదాత్మ్యం చెందగానే జాగ్రత్ప్రపంచము ఇంద్రియముల ద్వారా అనుభవమునకు అందును. అలాగాక ఈ ఉపాధి త్రయమునకు వేరుగా నిలబడి దర్శించగనే ఆత్మానుభూతి కలుగును.

జాగ్రత్స్వప్నావస్థలకు ఆధారమైన ఈ కారణ ఉపాధి అనాది యని, అనిర్వాచ్యమని ఆచార్యులవారు ఈ శ్లోకంలో తెలియజేయుచున్నారు.

కారణోపాధి అనగా అజ్ఞానము. అజ్ఞానము అనాదియై యున్నది. అనగా ఆదిలేనిది అని భావము.

అవిద్యారూపమైన కారణోపాధి అనాదియని అంటున్నారు శ్రీశంకరులు. అనాది యనగా ఆదిలేనిది అని భావము. అవిద్యకు అది ఎందుకు లేదు? ఆదిని గుర్తించునది ఎవరు? మనస్సు. మరి మనస్సు నుండి అజ్ఞానము జనించినదా? అజ్ఞానము వలన మనస్సు కలిగినదా? అజ్ఞానజనితమైన మనస్సు అజ్ఞానము నెరుగుట అసంభవము. అజ్ఞాన దశయందు మనస్సు లేకపోవుట చేత మనస్సుచేత అవిద్యయొక్క ఆదిని నిర్ణయించేందుకు వీలులేదు గాన అది అనాది యని తెలియబడినది. అజ్ఞాన జనితమైన మనస్సు ద్వారా అజ్ఞానమును అర్థము చేసుకొనుటకు యత్నించుట గుఱ్ఱము ముందు బండిని ఉంచుట లాంటిది.

మరి ఇచ్చట ఒక సందేహము కలుగవచ్చును. అజ్ఞానము అనాది యని తెలుపుటచేత, ఆదిలేని దానికి అంతములేదు గనుక అజ్ఞానము అంతరించే అవకాశములేదు. ఈ సమస్యను ఘటప్రాగాభావము అను ఉదాహరణ ద్వారా నయ్యాయికులు చక్కగా పరిశీలించి పరిష్కరించిరి.

ఒక కుండ పుట్టినది. ఒక స్థలములో ఒక కాలములో ఈ కుండయొక్క ఆవిర్భావము జరిగినది. ఆ కుండ ఆవిర్భవించక పూర్వము కుండ యొక్క అభావము వుండెడిది. అనగా కుండ లేదనెడి భావము. ఈ కుండయొక్క అభావము ఎప్పటి నుండి యున్నది? అనాదియై యున్నది. అనాదిగాయున్న ఘట ప్రాగాభావము ఘటము తయారు కాగానే అంతరించిన విధముగ అనాదియైన అజ్ఞానము జ్ఞానము కలుగగనే అంతరించును.

అనాదియైన అజ్ఞానము అనిర్వచనీయమని ఆచార్యులు తెలియ జేయుచున్నారు. నిర్వచించునది మనస్సు. అజ్ఞానము నిర్వచింపబడదు. నిర్వచించు మనస్సు తనకు కారణమైన అవిద్యను తెలియలేదు. అవిద్యయు, అవిద్యా జనిత ఫలితములు ప్రతి ఒక్కరికి అనుభవములో యున్నందున



అవిద్య నెవరు నిరాకరించరు. అలాగని నిర్వచించనూలేరు. అనుభవములో ఉన్నందున అది సత్తు యని భావించలేము. జ్ఞానము కలుగగానే అదృశ్య మగుచున్నందున అది సత్తు అయ్యేందుకు వీలు లేదు. అనుభవములో నున్నందున అసత్తని నిరాకరించుటకు వీలుపడదు. కనుక అవిద్యను మూడు దశలనుండి గాంచదగును. జ్ఞాన దశలో అజ్ఞానము మిథ్య లేక అసత్యము. అజ్ఞాన దశలో పరమ సత్యము. ఆలోచనా పరిధిలో అనిర్వచనీయము.

మనో స్థాయిలో జరుగు నిర్ణయాలేవీ వాస్తవాలు కావు. కాలేవు. అవి కేవలం మానసిక చిత్రాలు మాత్రమే. వక్ర సత్యాలుమాత్రమే. మనస్సును దాటిన స్థితిలోనే సత్యము ఎఱుక పడును. ఈ విషయమునే ఆధునిక విజ్ఞాన శాస్త్రము ధృవపరచుచున్నది.

" Modern physics has confirrned most dramatically one of the basic ideas of eastern mysticism; that all the concepts we use to describe nature are limited, that they are not features of reality as we tend to believe, but creations of the mind, parts of the map, not of the territory." అని అభిప్రాయపడ్డారు కెప్రా.

' ప్రకృతిని నిర్దేశించుటకు మనము సాగించు భావములు పరిమితమై యున్నవి. మనము విశ్వసించునట్లు ఆ భావాలు సత్యరూపాలు కావు. మనోచిత్రాలు మాత్రమే. పటములోని ప్రదేశాలు వాస్తవ ప్రదేశాలు కావు కదా! అని ప్రాచ్య ఖండములోని భావగర్భిత సత్యాలను ఆధునిక భౌతిక విజ్ఞానశాస్త్రము చక్కటి వైవిధ్యముతో ధృవపరచుచున్నది అని కెప్రా అభిప్రాయపడ్డారు.

స్థూల సూక్ష్మ కారణ శరీరములు అవిద్యా రూపములని అవగతమైనది. అవిద్యను త్యజించనిదే ఆనందము గోచరించదు. విద్య ద్వారానే అవిద్య అంతరించవలెను. విద్యయే ఆత్మజ్ఞానమై యున్నది. 'ఇట్టి ఆత్మ అవస్థా త్రయమునకు సాక్షియై యున్నందున ఉపాధిరహితమై యున్నది. సాక్షియై

వెల్గొందుచున్నది. అట్టి విలక్షణమైన ఆత్మను తెలుసుకొనమని ఆచార్యులు తెలియజేయుచున్నారు.

చూడబడు వస్తువులు చూచువాని కన్నా అన్యమైనవి. అవస్థాత్రయమును నేను దర్శించుచున్నాను గనుక దృశ్యమైన ఉపాధిత్రయమునకు విలక్షణమైనవాడిని. ద్రష్టలేనిదే దృశ్యము తెలియబడదు. కనుక ద్రష్టయే సత్యము. దృశ్యము అసత్యము. నేను సత్యస్వరూపమునై యున్నాను. ఈ నేను జాగ్రదావస్థలో విషయాకార జ్ఞానమై తెలియుచున్నది. స్వప్నావస్థలో మనోకల్పిత దృశ్యములుగా తెలియుచున్నది. నేను ఉండుటచేత సుషుప్తిలో ఏమి తెలియకున్నను అలా తెలియుట లేదనెడి విషయమును తెలిసి కొనుచున్నాను. దర్పణము ముందు వస్తువు నుంచగనే అద్దము ఆ వస్తువును ప్రతిబింబించును. అద్దము ఎదుట ఏమియు లేనపుడు అది దేనిని ప్రతిబింబించదు. అలాగే చైతన్య ముండుటవలన వస్తుజ్ఞానము కలుగు చున్నది. వస్తువులున్నను, లేకపోయినను అలా వున్నవని, లేవని తెలుసుకొను నేను లేకపోవుటలేదు. అంతఃకరణ అద్దమువలె పరిశుద్ధమైనచో అది ఆత్మను అవగతము చేసికొనగలదు. ఇదియే జ్ఞానము. కనుక ఉపాధిత్రయమునకు విలక్షణమై మల విక్షేప ఆవరణాది దోషములు నశింప చేసుకొని ఆత్మవిదులై భాసించమని ఆచార్యులు తెలియజేయుచున్నారు.

ఉపాధిత్రయము ఆత్మపైననే ఆధారపడి మనుగడ సాగించుచున్నది. వాస్తవానికి దేహత్రయము లేనిదే యగును. ఉపాధిత్రయము నశించగనే జగత్తు కూడా లేనిదే యగును. ఉన్నది బ్రహ్మ మొక్కటియే అని అనుభూతి కలుగును. ఈ విషయమునే ఉపనిషత్తు ధృవపరచినది.

**సతి దీప ఇవాలోకః సత్యర్క ఇవ వాసరః**
**సతి పుష్ప ఇవామోదశ్చితి సత్యం జగత్తథా**
**ప్రతి భాసత ఏవేదం జగత్ పరమార్థతః**



' దీపము వలన ప్రకాశమునకు ఉనికి గల్గును. సూర్యునివలన పగలు భాసించును. పుష్పము వలన సుగంధము నిలుచును. చైతన్యము వలన జగత్తు మనుగడ సాగించును. ' కనుక ఆత్మయే సర్వాధిష్ఠాన స్వరూపమై యున్నది.

శాంతి

అవతారికః- ఏకమైన ఆత్మయందు భేదములు గోచరించుటకు పంచకోశములతో తాదాత్మ్యము చెందుటయే ముఖ్య బంధమై యున్నదని తరువాత శ్లోకములో తెలియదగును.

పంచకోశాది యోగేన
తత్తన్మయ ఇవస్థితః
శుద్ధాత్మా నీలవస్త్రాది
యోగేన స్ఫటికోయథా ॥ 15

పంచకోశాది యోగేన = పంచకోశముల సంబంధముచే, శుద్ధాత్మా = పరిశుద్ధమైన ఆత్మ, నీలవస్త్రాది యోగేన = నీలము మొదలగు వస్త్రముల సంబంధముచే, స్ఫటికః = స్ఫటికమణి, యథా = ఏ ప్రకారము (గోచరించునో), తథా = ఆ ప్రకారము, తత్తన్మయ ఇవ = ఆయా స్వరూపములను పొందినట్లు, స్థితం = తెలియుచున్నాడు.

భావముః- నీలము మొదలగు వర్ణముగల వస్త్రముల సంబంధముచే స్వచ్ఛమైన స్ఫటికము వర్ణయుతమై గాన్పించునట్లు, పరిశుద్ధమైన ఆత్మ పంచ కోశముల తాదాత్మ్యముచే తద్రూపమై యున్నట్లు గోచరించుచున్నది.

## వ్యాఖ్య

అనాత్మ సంబంధమువలన బంధమేర్పడినది. బంధితుడైన జీవునకు పరిణామ శీలమైన దేహేంద్రియ మనోబుద్ధులు స్థిరమగు ఆత్మవలె గన్పట్టును. ఆత్మను దర్శించలేని అజ్ఞానదశలో మానవునికి మాయపొర కప్పినది. అదియే ఆవరణ యనబడును. సత్యమైన ఆత్మను అజ్ఞానావరణ ఆవరించగనే మాయామోహితుడైన జీవుడు చెదరిన అంతఃకరణ గలవాడై విక్షేపమును

పొందును. రజ్జువును చూడలేకపోవుట ఆవరణకాగా, ఉన్న రజ్జువులో లేని సర్పమును చూప్పించుట విక్షేపమైనది. ఈ ఆవరణ విక్షేప దోషములచే రజ్జువును సర్పముగ దర్శించునట్లు అనాత్మను ఆత్మగా దర్శించును. దేహేంద్రియ మనోబుద్ధులను ఆత్మయందు ఆరోపించి అవేదనలకు బానిస యగును.

స్ఫటికమునకు దగ్గరగా రంగు వస్త్రములను ఉంచినపుడు ఆయా వస్త్రముల రంగులు స్ఫటికమునందు అగుపించును. యదార్థానికి స్ఫటికములో ఏవిధమైన రంగులును లేవు. అలాగే పంచకోశముల తాదాత్మ్యముచే ఆత్మయందే పంచకోశముల ధర్మములు ఆరోపించ బడుచున్నవి. యదార్థానికి ఆత్మ విశుద్ధమై, నిర్మలమై యున్నది.

పంచకోశములు అనగా ఐదు కోశములు. అవి 1) అన్నమయ కోశము 2) ప్రాణమయకోశము 3) మనోమయకోశము 4) విజ్ఞానమయ కోశము 5) ఆనందమయకోశము. కోశము అనగా ఒర యని అర్థము. ఒర యనగా ముసుగు అని భావము. ముసుగును తొలగించగనే వస్తు దర్శనమగునట్లు, పంచకోశములను దూరము చేయగనే ఆత్మదర్శన మగును. అంతవరకు పంచకోశముల ధర్మములు ఆత్మయందు ఆరోపించబడి, భ్రాంతిని కల్గించి శాంతిని దూరము చేయును.

పంచకోశములలో మొదటిది అన్నమయకోశము. అన్నముద్వారా పుట్టి, అన్నముతో పెరిగి, అన్నముగా మారు ఈ మానవ దేహమే అన్నమయకోశము. రక్తమాంసాదులతో, చర్మ శల్యములతో మల మూత్రాదులతో నిండిన మలినకూపము. మలభాండము. ఒక కాలములో అగుపించి మరియొక కాలములో అంతరించు పరిమిత మనుగడ గలది.

రెండవది ప్రాణమయకోశము. కర్మేంద్రియములతో కలిసి జరుగు ప్రాణ సంచారము ప్రాణమయకోశము. ప్రాణమయకోశముచే పరివేష్టితమై అన్నమయ కోశము తన వ్యాపారములను కొనసాగించును.

మూడవది మనోమయకోశము. జ్ఞానేంద్రియములతో కలిసి మనో సంచారము జరుగుటయే మనోమయకోశము. నేను, నాది యను అహంకార



మమకారాదులు మనస్సులో తల ఎత్తును. మనోమయకోశము ప్రాణమయ కోశమును వ్యాపించి యుండును. పంచేంద్రియముల ద్వారా మనస్సు జ్ఞానమును గ్రహించి అనుభవములను పొందును. అజ్ఞానము మనస్సును ఆవరించి యుండును. అందుచేత బంధ మోక్షములకు మనస్సే కారణమై యున్నది.

నాల్గవది విజ్ఞానమయకోశము. జ్ఞానేంద్రియ సంయుతమైన బుద్ధి విజ్ఞానమయకోశమై నిలుచును. ఇందులో కర్తృత్వభావముండి జన్మకు కారణమగును. దేహేంద్రియ మనస్సులతో తాదాత్మ్యం చెంది కర్తృత్వ భోక్తృత్వ భావములకు నిలయమై యుండును. పరిచ్ఛిన్నత్వము కల్గి యుండును. వికారత్వమును పొందుచుండును.

ఐదవది ఆనందమయకోశము. సుషుప్తియే ఆనందమయకోశము. ఇంద్రియ పెనుగులాటలు, మనో సంకల్పాలు ఇచ్చటకు చేరలేవు. అజ్ఞానావరణతో కప్పబడి యుండును. దుఃఖము తెలియని స్థానమై యున్నది .ఆత్మానందమునకు అతి చేరువమై యున్నది. సాధారణముగ ఆనందము ననుభవించువారు ముక్తాత్ములే అయి యున్నారు. మిగిలిన వారందరు దుఃఖఛాయలలోనో, దుఃఖరహిత ఛాయలలోనో జీవితమును కొనసాగించుచుందురు. ఇంతవరకు మనము చూసిన ఈ పంచకోశములు ఆత్మ కానేరవు.

పరిమిత మనుగడ కల్గి. పరిణామశీలమై, నశించిపోవు జడస్వరూపమైన శరీరము ఆత్మ అయ్యేందుకు వీలులేదు. అరువు తెచ్చుకొన్న ఆత్మతేజముచే నడక సాగించు ప్రాణము ఆత్మ కాజాలదు. అన్ని దశలలో అగుపించక, దృశ్యమువలె గోచరమగుచు, వికారములు చెందుతున్న మనస్సు ఆత్మ కాబడదు. సర్వజ్ఞత్వము లోపించి జడప్రాయమై ద్వంద్వముల మధ్య చెదరిపోవు బుద్ధి ఆత్మ స్వరూపము కాదు. అజ్ఞానముచే పరివేష్టితమై, దుఃఖరహిత స్థితిలో సుఖమేమిటో తెలియక, అయోమయ స్థితిలో కొనసాగే ఆనందమయ కోశము చైతన్య మెలా కాగలదు?

నశించు శరీరమును గాంచుచు, ప్రాణక్రియలను గుర్తించుచు, మనోచేష్టలను నడిపించుచు, బుద్ధి నిర్ణయాలను కదిలించుచు సుషుప్తిలో ఏమీ

తెలియుటలేదనెడి జ్ఞానమును తెలిసికొనుచు, సర్వమున కాధారమై, పంచ కోశములకు అధిష్ఠానమై, విలక్షణమై సాక్షిమాత్రమై భాసించు నదియే ఆత్మ. అదియే నీవు.

క్రమ పరిశీలనద్వారా ఆత్మానాత్మా వివేక జ్ఞానముద్వారా, పంచకోశములను నిరాకరించినచో ఆ తరువాత సర్వగతమై మిగిలి యున్నదియే ఆత్మ. రంగు వస్త్రములు దూరము కాగానే స్ఫటికము స్వచ్ఛమై భాసించునట్లు, పంచకోశ వివర్జితుడైన వాని ఆత్మ నిర్మలమై భాసించును.



అవతారిక:- పంచకోశములను వేరుచేసి ఆత్మానుభూతి నొందు విధమును రాబోవు శ్లోకములో కూడా తెలియజేయుచున్నారు.

వపు స్తుషాదిభిః కోశైః
యుక్తం యుక్త్యావఘాతతః
ఆత్మాన మన్తరం శుద్ధం
వివిచ్యాత్తండులం యథా ॥ 16

తుషాదిభిః = పొట్టు మొదలగువానిచే, యుక్తం = కూడియున్న, తండులం = బియ్యమును, యథా = ఏ ప్రకారముగా, అవఘాతతః = వేరుచేయుదుమో, కోశైః పంచకోశాదులచే, వపుః =రూపముగా తెలియువట్టి, అన్తరం = ఆంతర్యములో యున్నట్టియు, శుద్ధం = పరిశుద్ధమైనట్టియు, ఆత్మానం = ఆత్మ, యుక్త్యా = యుక్తిచేత, వివిచ్యాత్ = వేరు చేయబడవలెను.

**భావము:-** బియ్యమును మూసియున్న ఊక, తవుడును వేరుచేసి బియ్యమును గ్రహించు విధమున విచక్షణ ద్వారా, యుక్తి ద్వారా విచారణ చేసి ఆత్మను పంచకోశముల నుండి వేరు చేయవలెను.

## వ్యాఖ్య

అనాత్మ సంబంధముచేత బద్ధుడైన జీవుడు తాను పరిమితుడని భావించుచున్నాడు. పంచకోశములతో తాదాత్మ్యము చెంది ఆయా వికారముల



ననుభవించుచున్నాడు. విచారణచేసి చూడగా తాను ఆత్మయేనని, పంచ కోశములకు విలక్షణుడని తెలియగలదు. విచారణ ద్వారా అనాత్మనుండి విడిపడి ఆత్మానుభూతిని పొంది తరించు మార్గమును ఆచార్యులు ఈ శ్లోకంలో తెలియజేయుచున్నారు.

జీవుడు పంచకోశములను కలిగియున్నాడేగాని తాను యదార్థానికి పంచకోశములు కాడు. కోశము అనగా ఒర యని అర్థము. కత్తిని ఒరలో ఉంచుకొందురు. కత్తి ఒరలో యున్నను కత్తివేరు; ఒరవేరు. అలాగే పంచకోశములు ఒరలాంటివి గనుక ఆత్మకన్నా భిన్నమై యున్నవి. ఈ విషయమును కాస్త పరిశీలనలో విచారించెదము.

పంచకోశములలో మొదటిది అన్నమయకోశము. అదియే శరీరము. జననముతో కదిలి మరణముతో అంతమయ్యేది శరీరము. ప్రారబ్ధాధీనమై మనుగడ సాగించును. నేను కదులుచుండ నా కళ్ళజోడు కదులును. కళ్ళజోడు తనకు తానుగా కదలలేదు. అలాగే శరీరము కళ్ళజోడువలె జడప్రాయమైనది. తనంతట తాను కదలలేదు. చైతన్య ప్రభావముతో చలించును. ఘట మఠాదులవలె దేహముకూడా దృశ్యమై యున్నది. దృశ్యమైనది నశించును. దృశ్యమైన దేహము దృక్కుయైన నీకన్నా అన్యముగా గోచరించుటవలన శరీరము ఆత్మ అయ్యేందుకు వీలులేదు. శరీరము పరిణామశీలమై యున్నది శరీరములో జరుగు మార్పులనే వీక్షించుటచే ఆత్మ దేహము కాదు. శరీరములో ఒక అవయవము లేదా కొన్ని అవయవములు లోపించినను వ్యక్తి మనుగడ కొనసాగుటచే దేహము ఆత్మకాదు. అవయవలోపము చేత జీవుడు నశించని విధముగ దేహము సంపూర్ణముగా నశించినను జీవుడు నశించడు. కనుక చైతన్యమైన జీవుడు దేహము కానందున ఆత్మ శరీరముకాదు. కానేరదు.

అన్నమయ కోశమైన దేహము ఆత్మ కానట్లే ప్రాణమయకోశము కూడా ఆత్మ కానేరదు. వాయు చలనమే ప్రాణ రూపముగా మారుచున్నందున జడమైన ప్రాణము శ్వాసవలె సంచరించుచున్నదే గాని తాను చైతన్యము

కానేరదు. దేహమునకు వెలుపల వాయువుగా చరించునదియే శరీరములో చరించునపుడు ప్రాణమగుచున్నది. వాయువు జడమే గనుక అది లోపలున్ననూ జడమే అయియున్నది. ప్రాణము దేనిని తెలిసికొనలేదు. అందుచేత ప్రాణము జ్ఞాన స్వరూపమైన ఆత్మ కానేరదు.

అన్నమయ, ప్రాణమయ కోశముల తరువాత తెలియదగినది మనోమయ కోశము. నేను, నాది యనెడి అహంకార మమకారములకు నిలయము. కర్తృత్వ భోక్తృత్వ అభిమానాలకు ఆలయము. అజ్ఞానమునకు ఆధారము. మనస్సే జగత్తును చిత్రించుచున్నది. మనో నాశముతో జగత్తే అదృశ్యమగుచున్నది. జాగ్రత్స్వప్నావస్థలయందే గోచరించి సుషుప్తిలో లయించుచున్నది. సుషుప్తిలో మనస్సు లేకపోయినను ఎఱుక నశించుటలేదు. చైతన్యము చెదిరిపోవుటలేదు. కనుక మనస్సు ఆత్మ కానేరదు. సర్వబంధములను మనస్సే తయారు చేయుచున్నది. మనస్సులో నడిచే సర్వసంకల్పములు నీచేత చూడబడుటచే నీవు మనస్సుకాదు. నీవు గడియారమును ధరించి, నా గడియారమని తెలియ జేయులాగున, మనస్సును ధరించి యుండుటచే నా మనస్సు అని పలుకు చున్నావు.

తరువాత గ్రహించదగిన నాల్గవ కోశము విజ్ఞానమయకోశము. అదియే బుద్ధి. మనస్సుకన్నా లోతుగా విషయ గ్రహణ చేయునది. సంశయాత్మకమగు మనోభావాలను విశ్లేషించి, నిర్ణయించి నిశ్చయించునది. సుఖదు:ఖాది ద్వంద్వములను అనుభవించునది. చైతన్యముచేత ప్రభావితమై విజ్ఞాన మయకోశము ప్రకాశించుచున్నది. మనస్సులోని విపరీత జ్ఞానమును, బుద్ధిలోని విజ్ఞానమును, నిద్రలోని అజ్ఞానమును సమస్తమును ప్రకాశింపచేయునది ఆత్మయే అయియున్నది. సుషుప్తిలో బుద్ధి లేదు. అయినను చైతన్యము యున్నది. అందుచేత విజ్ఞానమయకోశము కూడా ఆత్మ కానేరదు.

పంచకోశములలో మనము ఇంతరవకు గ్రహించిన నాలుగుకోశములు ఎలా ఆత్మకాదో ఐదవ కోశమైన ఆనందమయ కోశముకూడా ఆత్మ కానేరదు.



సుషుప్తిలో ఆనందమయకోశము వ్యక్తమగుచున్నది. సుషుప్తిలో విషయజ్ఞానము లేదు. ఆత్మజ్ఞానము కలుగదు. వృత్తిరహిత స్థితియై ఆనందము నిచ్చుచున్నదే గాని అజ్ఞాన నివృత్తి కావడములేదు. ఉపాధిసహితమై యున్నందున, ప్రకృతి వికారములచే తీర్చి దిద్దబడుచున్నందున, కార్యకారణ సంబంధముపై ఆధారపడి యున్నందున, ఆనందమయ కోశము పరిమితమై, వికారయుతమై యున్నది. అట్టి ఆనందమయ కోశము పరిపూర్ణమైన ఆత్మ కానేరదు.

పంచకోశములను పై విధముగ విచారించి చూడగా అవి ఆత్మ కానేరవని తెలియును. ఇట్టి విచక్షణాపూరిత జ్ఞానముతో పంచకోశ విలక్షణమై యున్న ఆత్మయొక్క అనుభూతిని పొంది తరించవలెను. అలా వేరుచేసి ఆత్మజ్ఞానమును పొందుటకు ఆచార్యులు వడ్లనుండి బియ్యమును వేరుచేయు ప్రక్రియను ఉదాహరణగా తెలియజేయుచున్నారు.

వరిలో ఊక, తవుడు ఉన్నవి. వానిని వేరుచేయగనే సారవంతమైన బియ్యము గోచరించుచున్నవి. బియ్యమును ఊక, తవుడు కప్పి యున్నను బియ్యము ఊకకు విలక్షణముగనే యున్నది. అలాగే ఆత్మ పంచకోశములతో కప్పబడియున్నది. పంచకోశములను వేరుచేయగనే ఆత్మ అనుభవమునకు అందును. పంచకోశములు ఆవరించియున్నట్లు గోచరించినను ఆత్మ పంచకోశములకు విలక్షణముగనేయున్నది. ధాన్యమును దంచుటచే బియ్యము ఊకనుండి వేరగునట్లు, విచారణ చేయుటద్వారా పంచకోశములకు విలక్షణమైన ఆత్మ అనుభవమునకు అందును.

వెలుగుతున్న లాంతరును తీసుకొని దానిని కాగితముతో చుట్టితిమి. దానిపై మరియొక కాగితపుపొరను ఉంచితిమి. ఐదు కాగితపు పొరలు ఉంచగనే లాంతరు వెలుతురును విరజిమ్మ లేకపోయినది. ఇప్పుడు లాంతరుపై చుట్టబడిన కాగితపు పొరలలో ఒక్కొక్క దానిని తొలగించగానే వెలుతురు క్రమముగ ప్రస్ఫుటమగుచు ఐదు పొరలు తొలగించగానే .పూర్ణకాంతితో ప్రకాశించును. అలాగే పంచకోశముల తాదాత్మ్యముచే జీవుడు అజ్ఞానాం

ధకారములో అలమటించు చున్నాడు. పంచకోశములలో ఒక్కొక్క దానినుండి విడిపడుచుండగా ఆత్మ ప్రకాశము క్రమముగ ప్రస్ఫుటమగుచు, పంచకోశ వివర్జితుడు కాగానే ఆత్మవిదుడై భాసించును.

ఆవతారిక:- నిర్మలాత్మను అనుభవించవలెనన్నచో అంతఃకరణ నిర్మలమై ఉండవలెను. ఈ విషయమును రాబోవు శ్లోకము వివరించును.

స్సదా సర్వగతోఽప్యాత్మా
న సర్వత్రావ భాసతే
బుద్ధావే వావభాసతే
స్వచ్ఛేషు ప్రతిబింబవత్ ॥ 17

ఆత్మ = ఆత్మ, సదా = ఎల్లప్పుడు, సర్వగతః = అంతటను వ్యాపించి, అపి = యుండినను, సర్వత్ర = అంతటను, న అవభాసతే = ప్రకాశించుటలేదు. బుద్ధౌ = బుద్ధియందు, ఏవ = మాత్రమే, అవభాసతే = ప్రకాశించు చున్నది, స్వచ్ఛేషు = నిర్మలమైన (దర్పణమునందు), ప్రతిబింబవత్ = ప్రతిబింబము గోచరించునట్లు

భావము:- ఆత్మ సర్వవ్యాపకమైనను సర్వత్ర ప్రకాశించుటలేదు. పరిశుద్ధ దర్పణము నందే బింబము గోచరమగులాగున నిర్మలమైన బుద్ధి యందే ఆత్మ శోభించును. యందే ఆత్మ శోభించును.

## వ్యాఖ్య

ఆత్మ అనంతము. ఆత్మ అనంతమైనచో రెండవ వస్తువు వుండేందుకు వీలులేదు. రెండవ వస్తువు యున్నచో అది ఆత్మను పరిమితము చేయును. ఆత్మ పరిమితమైనచో అనంతము కానేరదు. కనుక ఆత్మ అనంతము. అనంతమగుటచే ఆత్మ సర్వగతమై యున్నది. అద్వయమైయున్న ఆత్మను సర్వగతమని ఎందులకు తెలియజేయవలెను? అలా తెలిసికొనవలసిన అవసరము,



అగత్యము ఎవరికున్నది? తాను ఆత్మయే అయినను, అజ్ఞానము చేత ఆవరించబడి, జీవుడనని, పరి మితుడనని భ్రాంతిలో పలవరించువానికి ఆత్మ అనంతమని, సర్వగతమని తెలిసి కొనవలసిన, తెలిసి తరించవలసిన అవసరమున్నది.

అజ్ఞాన మెచ్చట గోచరించుచున్నది? మనోబుద్ధులలో గోచరించు చున్నది. మనస్సులో రజో తమో గుణములు ఆవరించి యుండినపుడు అలలచే సరస్సు కదులునట్లు, సంకల్పముచే మనస్సు కలతచెందును. మనస్సులో సత్త్వగుణము నిండగనే నిస్తరంగ సరోవరము వలె మనస్సు నిర్మలమై భాసించును. రజస్తమో గుణములచే ప్రేరేపింపబడి విషయ సుఖాల వెంబడి పరుగులిడుటచేత మనస్సు బంధకారణమై యున్నది. అట్టి మనస్సు సత్త్వ సమన్వితమై అంతర్ముఖమగుటచేత మోక్షకారణమై యున్నది. కలుషితమైన మనస్సు సంసారమును తయారుచేయును. నిష్కల్మషమైన మనస్సు ఆత్మానుభూతిని కలిగించును.

ఆత్మ జ్ఞానస్వరూపమై యున్నందున కర్మలద్వారా పొందేది కాదు. నూతనముగా తయారుచేసేది కాదు. అవికార్య సత్తాస్వరూపమును వికారము చెందించలేము. అందుచేత ఆత్మానుభూతి నొందవలయునన్నచో మనస్సును శుద్ధి చేయుట యనెడి సమకార్యము ద్వారానే సాధ్యపడును. మలరహితమైన మనస్సు ఆత్మవైపుకు మార్గము మళ్ళించును. ఆత్మను పొందగోరి ఆత్మలో లయించును.

మల విక్షేప ఆవరణాదులు తొలగిన నిర్మల మనస్సులో ఆత్మ ప్రతిబింబించును. ఆత్మ సర్వవ్యాపి అయినపుడు పరిమిత ప్రదేశములో ప్రకాశించుట ఏమిటి? తీగ యంతటిలో కరెంటు ఉన్నను బల్బులోనే భాసించునట్లు ఆత్మ సర్వగతమైనను శుద్ధ బుద్ధి యందే గోచరమగును.

మురికి చేరిన అద్దమునందు ప్రతిబింబము గోచరించదు. ప్రతిబింబము గోచరించుటకు బింబమును సరిచేసి పొందు ఫలము శూన్యము. దోషము బింబములో కాదు. దర్పణమునం దున్నది. అద్దముపై ఆవరించియున్న మాలి న్యమును తొలగించగనే ప్రతిబింబము చక్కగా గోచరించును. అలాగే

బుద్ధియందలి దోషములను తొలగించి, నిర్మల మొనర్చినచో , అట్టి పరిశుద్ధ అంతఃకరణమునందు ఆత్మ స్వప్రకాశమై భాసిల్లును.

**' బుద్ధి గ్రాహ్య మతీంద్రియం '**

ఇంద్రియములకు అందని ఆత్మానందము బుద్ధికి అందునని తెల్పుటలోని భావార్థ మిదియే.

ప్రతి సాధకుడు ఆచరించ దగిన సాధన బుద్ధిని శుద్ధిచేయుటయే. శ్రద్ధ, భక్తి, ధ్యాన, యోగాదులు శుద్ధి ప్రక్రియలేనని గ్రహించాలి. అనిత్యమైన విషయ సుఖాలలో ఆనంద మున్నదని భ్రమించుటవలన మనస్సు బహిర్ముఖమై కల్లోలమైన సంసారమును తయారుచేసినది. విషయ సుఖములలోని విషపూరిత జీవనము విచారణ ద్వారా తెలియబడగనే మనస్సులో విముఖత పొడసూపును. అదియే వైరాగ్యము. వైరాగ్యపూరితమైన మనస్సు విషయ సుఖములను వాంఛించదు. విషయ సుఖానురక్తి నశించగనే ఇంద్రియములు అంతర్ముఖమగును. కోరికలు నిర్వీర్యమగును. వాసనలు అడుగంటును. ఇంతవరకు వాసనా ప్రేరితమై, ఇంద్రియముల ద్వారా బాహ్యప్రపంచములో విషయ సుఖాలమధ్య స్వైర విహారము సాగించిన మనస్సు ఒక్కసారి చలన రహితమై నిలుచును. సంకల్పతరంగములు ఆగుటచేత నిర్మలమై భాసిల్లును. అట్టి నిర్మలాంతఃకరణలో ఆత్మ స్వచ్ఛముగా తెలియును. ఈవిధముగా శుద్ధబుద్ధిలో ఆత్మానందమును చవిచూచిన వ్యక్తి తానే ఆత్మయని తెలిసికొనును. తన స్వరూపము ఎఱుకపడును. స్వరూపానుభూతి కలుగగనే అంతఃకరణయందు ఆత్మను దర్శించుటకు స్వస్తిచెప్పి, ఆత్మయైన తనలోనే సర్వమును గాంచి తృప్తి చెందును.

అవతారిక:- పంచ కోశాదులకు విలక్షణమై నిర్మల అంతఃకరణము నందు ప్రతిబింబించు ఆత్మ దేహేంద్రియ మనోబుద్ధులకు సాక్షియైయున్నదని తరువాత శ్లోకము వివరించుచున్నది.



దేహేంద్రియ మనోబుద్ధి
ప్రకృతిభ్యో విలక్షణమ్
తద్వృత్తి సాక్షిణం విద్యాత్
ఆత్మానం రాజవత్సదా ॥ 18

దేహ = శరీరము, ఇంద్రియ = ఇంద్రియములు, మన: = మనస్సు, బుద్ధి = బుద్ధి, ప్రకృతిభ్య: = ప్రకృతికంటె, విలక్షణం = వేరైనదియు, తద్వృత్తి సాక్షిణం = ఆయా ఇంద్రియవృత్తులకు సాక్షిగా నున్నదియునగు, ఆత్మానం = ఆత్మను, రాజవత్ = రాజువలె సదా = ఎల్లప్పుడూ, విద్యాత్ = తెలిసికొనుము.

భావము:- దేహేంద్రియ, మనోబుద్ధి ప్రకృతులకు విలక్షణముగా నుండునదియు, ఆయావృత్తులకు సాక్షియైనదియునగు ఆత్మ రాజువలె సాక్షిగా యుండునది అని గ్రహించవలెను.

## వ్యాఖ్య

వ్యక్తి ఆంతర్యంలో కదులు వృత్తులు అహంకారానికి ప్రతిరూపాలు. " అహం "వృత్తియే అహంకారము. ఆత్మస్ఫురణచే 'అహం ' వృత్తి కదులును. సూక్ష్మ రూపంలో వున్న ఈ వృత్తి దేహేంద్రియ మనోబుద్ధుల తాదాత్మ్యముతో స్థూలముగ వ్యక్తమగును వ్యక్తిలో కదులు వృత్తి మనస్సుకు సంబంధించినదియేగాని ఆత్మకు సంబంధించినదికాదు. గాఢనిద్రలో దేహేంద్రియ మనోబుద్ధులు లయించినవి. అంతమాత్రాన చైతన్యము మరుగుపడలేదు. మనోవృత్తులు కదులుచున్నవని, కరిగి పోయినవని ఇలా రెండింటిని గ్రహించు చైతన్యము మనోవృత్తులయ్యేందుకు వీలులేదు. అందుచేత సకల వృత్తులకు సాక్షియై విలక్షణమై ఆత్మ అలరారుచున్నది.

ఆత్మ సదా జ్ఞానస్వరూపము. అట్టి జ్ఞానము వస్తువులను దర్శించగనే వస్తువులను తెలిసికొనుచున్నది. రూపముల చెంతకు నడువగనే చూసేది అగుచున్నది. వస్తువులనుండి విడిపడగనే తెలివియై యున్నది. రూపముల నుండి వెనుదిరిగి చూపుయై యున్నది. శబ్దములవైపు చరించి వినేది అగుచున్నది. శబ్దముల నుండి వెనుకకు మరలగనే చైతన్యమై భాసించుచున్నది.

తెలియబడే ప్రపంచ మున్నంతవరకు తాను తెలుసుకొనుచున్నది. ప్రపంచము నుండి విడిపడగనే తాను నిష్ప్రపంచమై, నిరామయమై, వస్తురహిత చైతన్యమై భాసించుచున్నది. కనుక ప్రపంచము వృత్తులపై ఆధారపడి తెలియుటచేత మనోస్థాయిలోనే గోచరమగుచున్నది. గాఢనిద్రలో మనస్సు లయించుట వలన అది కల్పించు ప్రపంచము కూడా అదృశ్యమగుచున్నది.

**' సుషుప్తి కాలే సకలం విలీనే '**

అని ఉపనిషత్ తెలియజేయుచున్నది. కనుక జాగ్రదవస్థలో మనకు తెలియబడు జ్ఞానము వృత్తిజ్ఞానమైనందున అది వ్యవహారికము లేదా సంబంధిత సత్యము. ఈ సంబంధిత జ్ఞానము మనో సంబంధమగుటచేత అది అనిత్యము, భ్రాంతి మయము. అనిత్యమై, భ్రాంతిమయమై తెలియబడు సమస్తమును ప్రకాశింప చేయునది ఆత్మయే అయియున్నది.

వృత్తులు కాలపరిచ్ఛేదములో యున్నవి. కాలము మనో జనితము. మనోజనితమైన కాలములో మనోకల్పిత వృత్తులు కదులు చున్నవి. వృత్తి కదులుటకు చైతన్య మాధారము. వృత్తి కదిలినపుడు అది చైతన్యములోనే కదులుచున్నది. వృత్తి లయించుటకూడా చైతన్యమునందే జరుగుచున్నది. అందుచేత సకల మనోవృత్తులకు చైతన్యము సాక్షియై యున్నది.

వృత్తిజ్ఞానము పరిమితమైనది. పరిమితమైన వృత్తిజ్ఞానమునకు కారణమైన చైతన్యము అపరిమితమై యున్నది. అఖండ జ్ఞాన స్వరూపమై అలరారుచున్నది. వృత్తి జ్ఞానము వస్తువులపై, అనుభవములపై ఆధారపడి కదులుచున్నది. ఆత్మజ్ఞానము స్వయంప్రకాశమై, ఆధార రహితమై యున్నది. దేశకాలాదుల నధిగమించి మనుగడను సాగించు మహోజ్జ్వల ఉనికియై యున్నది.

' అహం ' వృత్తి అంతర్యంలో కదిలి దేహేంద్రియ మనో బుద్ధులతో తాదాత్మ్యము చెందును. దేహముతో తాదాత్మ్యము చెందగనే దేహ లక్షణములను తనపై ఆరోపించుకొనును. రూపము, రంగు, లావు, పొడవు, పొట్టి మొదలగు లక్షణములను ఆపాదించుకొని, తద్వారా సంక్రమించు దేహబాధలన్నీ తనవిగా భావించి వ్యథచెందును. ఇంద్రియములతో సంబంధము కలిగి, అంధత్వాన్ని,



చెవిటితనమును ఆరోపించుకొని కలత చెందును. ప్రాణముతో కలిసి ఆకలి దప్పులను గ్రహించి కలవరపడును. మనస్సుతో మెలిగి భావవలయంలో చిక్కి బాధపడును. బుద్ధిలో మెదిలి సంకల్ప సుడిలో పడి అలమటించును. ఈ 'అహం' వృత్తి అంతర్యంలో లయించుటచేత సుషుప్తిలో అజ్ఞాన దశలో అణగియుండును. మనోజనితమైన ఈ 'అహం' వృత్తి దేహేంద్రియ మనో బుద్ధుల స్థాయిలలో కదులుచున్నను, తదనుగుణ్యమైన అనుభవములను సేకరించుకొనుచున్నను ఆత్మ సకలమునకు విలక్షణమై, సర్వమును ప్రకాశింప చేయుచు, సమస్తమును వీక్షించుచున్నది. వీక్షించునది ఆత్మఅయినందున వీక్షించు తాను వీక్షించబడు దేహేంద్రియ మనోబుద్ధుల వృత్తులకు విలక్షణమై, సాక్షియై యున్నది. ఈ విష యమునే ఆచార్యులవారు రాజును ఉదహరించుచు తెలియజేయుచున్నారు.

రాజు రాజ్యమును పాలించుచుండును. రాజ్య పాలనాభార మంతయు తనమీదనే ఆధారపడియుండును. రాజ్యములో జరుగు సకల రాచకార్యములకు తానే కారణమైయుండును. అలాగని ఆ కార్యముల నాచరించుట వలన రాజు అలసట చెందుటలేదు.రాజ్యములో జరుగు సకల కార్యములు తన పర్యవేక్షణలో, సాక్షిత్వములో జరుగుచున్నవేగాని తాను రంగప్రవేశము చేయుటలేదు. రాజసిబ్బంది కార్యములో నిమగ్నమైయుండ ఆయా కార్యములకు మూల పురుషుడైన రాజు అలసటనొందక విశ్రాంతిలోనే యుండును.

అలాగే దేహేంద్రియ మనోబుద్ధుల స్థాయిలో జరుగు సకల వృత్తులకు ఆత్మయే ఆధారము. కాని ఆత్మ నిష్క్రియత్వము. సకల వృత్తులను ప్రభావితం చేయునది తానై యున్నను, వృత్తులకు విలక్షణమై రాజువలె సాక్షియై యున్నది. అందుచేత కర్మలచేగాని, ఫలితములచేగాని, వృత్తులచేగాని, అజ్ఞానముచేగాని, కలుషితముగాక కమనీయ కైవల్య స్థితియందు సాక్షియై ప్రకాశించుచున్నది.

అవతారిక:- ఆత్మనిష్క్రియమై, సాక్షిస్వరూపమై యున్నను, ఈ సత్యమును గాంచలేని అజ్ఞానులకు ఆత్మ కర్మరంగమున కదులుచున్నట్లు భ్రాంతి జనించును. ఈ విషయమును రాబోవు శ్లోకము వివరించును.

వ్యాపృతే ష్వింద్రియేష్వాత్మా
వ్యాపారీవా వివేకినామ్
దృశ్యతేఽభ్రేషు ధావత్సు
ధావన్నివ యథా శశీ ॥ 19

ఇంద్రియేషు = ఇంద్రియములు, వ్యాపృతేషు = చరించుచుండగ, అవివేకినాం = అజ్ఞానులకు, ఆత్మా = ఆత్మ, వ్యాపారీవ = చరించుచున్నట్లు, దృశ్యతే = గోచరించుచున్నది, యథా = ఏ విధముగా, అభ్రేషు = మేఘములు, ధావత్సు = కదులుచుండగ, శశీ = చంద్రుడు, ధావన్నివ = పరుగిడు వానివలె,

భావము:- ఆకసమున మేఘములు కదులుచుండ చంద్రుడు పరుగిడు చున్నట్లు గోచరించును. అలాగే ఇంద్రియములు విషయ ప్రపంచమున క్రీడించుచుండ అజ్ఞానులకు ఆత్మ ప్రవర్తించు చున్నట్లు గోచరించును.

## వ్యాఖ్య

విచారణ లోపించుటచేత విచారము కలుగుచున్నది. గగుచున్నది. విచారణ చేయునది మనస్సు. మనస్సు విచారణను ఆపదు. అయితే మనస్సులో పడమ ఆ విచారణ ఆత్మ విచారణమో లేదాలోక విచారణమో అవలోకించు చుండవలెను. విషయ చింతనాభిలాష వలన ఆత్మయందు అభిరుచి నశించి అనాత్మయందు అభిలాష మెండగును. తద్వారా ఆత్మ అనాత్మగా, అనాత్మ ఆత్మగా గోచరించును.

అజ్ఞానియైన మానవుడు అనాత్మతో సంబంధము కలిగి భ్రాంతిలో కదులుచుండును. అట్టివానికి ఆత్మ అనాత్మవలె గోచరించును. ఆత్మను గూర్చిన జ్ఞానము తనకు లేకపోవుటయే ఈ మిథ్యా జ్ఞానమునకు కారణము. ఆత్మ అనంతము. అనంతమైన ఆత్మయందు క్రియాశీలత్వమునకు ఆస్కారములేదు. ఆత్మప్రకాశముతో ఇంద్రియములు, మనోబుద్ధులు చలించుచుండును. అజ్ఞాని యగు మానవుడు ఈ సత్యము నెరుగనివాడై



దేహేంద్రియ మనోబుద్ధులలో జరుగు వ్యాపారములను ఆత్మకు ఆపాదించును. మనోచలనమును ఆత్మ చలనముగా భావించును. ఇంద్రియ కదలికలను ఆత్మ కదలికగా మోపబడును.

ఆత్మ అద్వయము. అచలము. ఆత్మను సాక్షియని నిర్వచించుటకు కూడా వీలుపడదు. సాక్షియను భావన నీ మనస్సులో కదిలినది. చలించు సమస్తమును గ్రహించు ఆత్మ చలనరహితమై యుండవలెనని, అట్టి చైతన్యము సాక్షి స్వరూపమని నీ మనస్సుతోనిర్ణయించడము జరిగినది. 'సాక్షి ఎవరు'? అని ప్రశ్నించగనే 'నేను' అని జవాబు ఇవ్వక తప్పదు. మరి ఆ నేనెవరు? అహంకారమే. మనస్సులో జనించు భావనయే. కనుక మనస్సులో జరిగే నిర్ణయాలేవీ ఆత్మ కానేరవు. ఆత్మను నిర్వచించలేని అయోమయస్థితిలో, నిర్ణయించలేని అజ్ఞానపరిధిలో ఆత్మను వివరించుటకు ప్రయత్నించగనే అనాత్మ లక్షణాలను ఆత్మయందు ఆరోపించడము జరుగుచున్నది. ఇంద్రియములు విషయ ప్రపంచములో రమించుచుండ ఆత్మయే విషయ ప్రపంచమున రమించుచున్నట్లు గోచరించుచున్నది.

కుండను గొనిపోవునపుడు కుండలోని ఆకాశమునుకూడా కొని పోవునట్లు భ్రాంతి కలుగుచున్నది. పరిమితమైన కుండను కొనిపోగలమే గాని సర్వగతమైన ఆకాశమును నడిపించుట ఎట్లు? కుండను కదిలించగానే ఆకాశము కదిలించ బడలేదు.యదార్థానికి కదిలెడి కుండ కదలని ఆకాశములోనే కదులుచున్నది.

ఆత్మ విషయ సుఖాలయందు ఎలా రమించగలదు? అనంతమైన ఆత్మ కదులుట ఎలా సాధ్యము? ఆత్మావగాహన లేకపోవుటచే ఇట్టి వ్యర్థభావాలు తలెత్తుచున్నవి. అసంపూర్ణస్థితిలో యున్న మనస్సు పరిపూర్ణత నొందుటకు, ఆనందమును పొందుటకు విషయ ప్రపంచములో క్రీడించుచున్నది. మరి పూర్ణస్వరూపమైన ఆత్మ దేనిని అభిలషించి ప్రయత్నము సాగించవలెను? తన కన్యమైన వస్తువే లేనపుడు తాను ఆశించుట కేమున్నది? పరిమితమైన మనస్సు సుఖాన్వేషియై అల్లాడుచున్నది. చంచలమైన ఇంద్రియాలు విషయ సుఖాలకై అర్రులు చాచుచున్నవి. ఈ ఇంద్రియ పెనుగులాటను అజ్ఞానియగు మానవుడు

ఆత్మయం దారోపించుచున్నాడు. యదార్థానికి కదిలేవి ఇంద్రియ మనో బుద్ధులేగాని ఆత్మకాదు.

మనమొక రైలుబండిలో కూర్చొనియుండగా ప్రక్కనే మరియొక రైలుబండి కదిలిపోవును. మనము ఎక్కిన బండి కదలక నిలబడియే యుండును. ప్రక్కన కదులుచున్న రైలుబండిని తదేకముగా చూచుటచేత అలా చూచువానికి తాను ఎక్కిన బండియే కదులుచున్నట్లు గోచరించును. ఇదియే భ్రాంతి. ఈ భ్రాంతి కలుగుటకు గల కారణములను పరిశీలించెదము. చలించు బండిని తాను తదేకంగా చూచుటచేత చలించు స్వభావముగల తన నేత్రములు తమలో చలనమును భావించుటవలన, ఆ నేత్రములుగల శరీరమును మోయుచున్న రైలుబండి కదులుచున్నట్లు తెలిసినది. ఒక్కసారి కదులుచున్న రైలుబండిని గాంచు దృష్టిని కదలక నిలబడియున్న రైలుబండిపై మరలించగనే కదిలే దెవరో, కదలిక ఎచ్చటనున్నదో బోధపడగలదు.

ఇంద్రియములు విషయములలో కదులుచుండ మనస్సు వాటి వైపే నడక సాగించుటచేత తాను చలించి, తన కాధారమైన ఆత్మ చలించుచున్నట్లు భావించుచున్నది. నిరంతర ఇంద్రియ విషయ లోలత్వమే ఈ భ్రాంతికి కారణము. సదా ఇంద్రియముల వెంట దృష్టి సారించి నడక సాగించే మనస్సు ఇంద్రియ విషయముల నుండి మరలి అంతర్ముఖం కాగానే నిరంజన స్వరూపమైన ఆత్మ అనుభవమునకు అందగలదు. అట్టి అనిర్వచనీయ ఆత్మానుభూతిలో ఆత్మ నిష్క్రియ మని బోధపడును. ఇంద్రియములు కర్మరంగములో చరించుచున్నవేగాని తాను అచల సత్తా స్వరూపమని అనుభవమునకు అందును. ఈ విషయమును భగవద్గీత-కర్మసన్యాసయోగములో చక్కగా ధృవీకరించడము జరిగినది.

**నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్**
**పశ్యన్ శృణ్వన్‌స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్**
**ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్ని మిషన్న పి**
**ఇన్ద్రియాణీన్ద్రి ఇతి ధారయన్**



'తత్త్వవిదుడైన జ్ఞాని గాంచుచు, వినుచు, తాకుచు, వాసన చూచుచు, తినుచు, నడచుచు, నిద్రించుచు, గాలి వదులుచు, మాట్లాడుచు, విసర్జించుచు, గ్రహించుచు, కనులు తెఱచుచు, మూయుచు, ఇంద్రియములు విషయములందు చరించుచున్నవేగాని నేను ఇసుమంతైనను చేయుట లేదు అని తలచును'.

ఆత్మజ్ఞానము కలవాడు ఆత్మ నిష్క్రియత్వమని గ్రహించుచుండ అజ్ఞానియైనవాడు ఇంద్రియ చలనమును ఆత్మయం దారోపించును. ఈ విషయమును చంద్రుడు-మేఘ కదలిక అను ఉపమానము ద్వారా ఆచార్యులు ప్రస్ఫుట మొనర్చుచున్నారు.

ఆకసమున రాత్రిపూట మేఘములు కదులుచుండును. మేఘ చలనమును గాంచలేనివానికి శశి కదలిక గోచరించును. యదార్థానికి కదులుచున్నవి మేఘములేగాని చంద్రుడుకాదు. చూచువాని స్థాయి ననుసరించి చంద్రుడు కదులుచున్నట్లు గోచరమగుచున్నదేగాని వాస్తవానికి కదలిక మేఘమునకు సంబంధించినదే. ఆకాశము మేఘరహితమై వినిర్మలముగా ఉండునపుడు చంద్రునియందు కదలికలేదని తెలియగలదు లేదా మేఘమును చేరి చూచినచో చంద్రునియందు చలనము లేదని తెలియగలదు. ఆత్మ చంద్రునివలె చలనరహితమైయుండ, మేఘ కదలికలు చంద్రునియందు ఆరోపించబడినట్లు ఇంద్రియ చలనములు ఆత్మయందు ఆరోపించబడుచున్నవి.

❦

అవతారిక:- ఆత్మ నిష్క్రియము. ఇంద్రియ మనోబుద్ధులు కార్య రంగమున ప్రవర్తించుచున్నవి. ఆత్మ చలించకున్నను ఆత్మచైతన్యము చేతనే దేహేం ద్రియ మనోబుద్ధులు ప్రవర్తించుచున్నవి. ఈ విషయము 20వ శ్లోకముద్వారా సుస్పష్టమగుచున్నది.

ఆత్మ చైతన్య మాశ్రిత్య
దేహేంద్రియ మనోధియః
స్వక్రియార్థేషు వర్తన్తే
సూర్యలోకం యథా జనాః ॥ 20

ఆత్మ చైతన్యం = ఆత్మ చైతన్యమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, దేహేంద్రియ మనోధియ: = దేహము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, స్వక్రియార్థేషు = వాటివాటి కార్యములందు, వర్తంతే = వ్యవహరించు చున్నవి, యధా = ఏవిధముగ, జనా: = జనులు, సూర్యలోకం = సూర్యప్రకాశముచేత.

**భావము:-** **భాస్కర తేజము నాశ్రయించి జనులు తమతమ కార్యములను సాగించునట్లు, ఆత్మతేజము నాశ్రయించి దేహేంద్రియ మనోబుద్ధులు కార్యరంగమున సాగుచున్నవి.**

## వ్యాఖ్య

ఆత్మ అచలమనియు, చలించునవి ఇంద్రియ మనోబుద్ధులే యని గడచిన శ్లోకముద్వారా గ్రహించితిమి. మరి అలా చలించు దేహేంద్రియ మనోబుద్ధులు తమంతట తాము వ్యవహరించగలవా? దేహేంద్రియ మనోబుద్ధులు జడములు గనుక అవి వాటంతటవి కదలలేవు. తాము కదులుటకు చైతన్యముపై ఆధారపడియున్నవి. చైతన్యమైన ఆత్మ తాను కదలకనే సకల కదలికలకు ఆధారమై యున్నది.

దేహము చలించును. చలించు ఈ దేహము ఒకనాడు చలనమును కోల్పోయి శవముగా పడిపోవును. శరీర స్వరూపము అచ్చట కనబడుచున్నను ఆ శరీరము కదలలేదు. కారణమేమిటి? అది చైతన్యము నుండి విడిపడినది. మరి నిద్రించునపుడు కూడా శరీరము చలించడము లేదుకదా? అనే సంశయము కలుగవచ్చు. నడిపించే మనస్సు నిద్రలో లేనందున శరీరము కదలక పోవచ్చునుగానీ ఆ దేహము చైతన్యము నాశ్రయించియే యున్నది. లేనిచో అది శవమువలె నశించుటకు ప్రారంభించవలెను.

ఇంద్రియములు కూడా చైతన్యము నాశ్రయించియే చరించు చున్నవి. కనులు చూచుచున్నవి అవి అందుము. కళ్ళు చూడవు. చూసేందుకు కళ్ళున్నవి. అలాగే వినేందుకు చెవులున్నవి. ఆఘ్రాణించుటకు నాసిక మున్నది. రుచి చూచుటకు నాలుక ఉన్నది. స్పృశించుటకు చర్మమున్నది. వీటన్నిటి



వెనుక తెలుసుకొనునది మనస్సై యున్నది. మనస్సు అంగీకరించనిచో ఏ ఇంద్రియము కూడా ఆయా ఇంద్రియ విషయములో రమించదు. విషయములు ఇంద్రియములకు దృశ్యములై యున్నట్లు ఇంద్రియములు మనస్సుకు దృశ్యమై యున్నవి. జాగ్రదావస్థలో మనస్సు పనిచేయుటచేత ఇంద్రియములు విషయములయందు చరించుచున్నవి. జాగ్రదావస్థ నుండి విడిపడి స్వప్నావస్థకు నడక సాగించగనే స్థూలశరీరము నిరుపయోగముకాగా సూక్ష్మ శరీరము ద్వారా మనస్సు స్వప్న ప్రపంచమును తయారుచేసికొని అనుభవించును. సుషుప్త్యవస్థలో మనోబుద్ధులు కూడా లయించును. ఈ స్థితిలో మనోబుద్ధులు, మనస్సు నాశ్రయించి నడక సాగించిన దేహేంద్రియములు కూడా మనస్సుతో పాటు చైతన్యములో లయించినవి. మనస్సు జడము. జడమైన మనస్సు చైతన్యముద్వారా ప్రభావితమై దేహేంద్రియములను ప్రకాశింప చేయుచున్నది. కనుక దేహేంద్రియ మనోబుద్ధుల సంఘాతమంతయు చైతన్యము నాశ్రయించి, చైతన్యముపై ఆధారపడి చరించు చున్నవి.

ఇచ్చట మనకొక సంశయము కలుగవచ్చును. దేహేంద్రియ మనోబుద్ధులు చైతన్యము నాశ్రయించుకొనియే గదా ప్రవర్తించుచున్నవి. అలాగయినచో దేహేంద్రియ మనోబుద్ధులద్వారా జరుగు కర్మలు ఆత్మకు అంటవా? అంటవు. ఎందుకని? కారు కదులుటకు పెట్రోలు కారణమై యున్నది. ప్రయాణము చేయునది బండియేగాని దానిని నడిపించు పెట్రోలు కాదు. బండి సురక్షితముగా గమ్యము చేరవచ్చు. లేదా ప్రమాదమునకు గురియై మరణించవచ్చు. ఏది జరిగినా దాని ప్రభావము బండిపైననేగాని పెట్రోలు పైకాదు. పెట్రోలుకు గమ్యము లేదు. గాయముకాదు. ఆత్మకూడా అంతే. దేహేంద్రియ మనోబుద్ధులు తన నాశ్రయించి వ్యవహరించుచున్నవేగాని తనకు వాటితో ఏ విధమైన ప్రమేయములేదు. ఈ విషయమును భాస్కరతేజము అను ఉదాహరణ ద్వారా ఆచార్యులు తేలిక పరచుచున్నారు.

రాత్రివేళ మనము విశ్రమించెదము. సూర్యోదయముతో లేచి కార్యక్రమములయందు వ్యవహరించెదము. సూర్యుని తేజము నాధారముగా గొని

కార్యరంగములో ప్రవేశించెదము. కానీ మనము చేయు కార్యములకు సూర్యునికి సంబంధములేదు. ఆయా కార్యముల ద్వారా కలుగు సుఖదుఃఖాలు సూర్యుని అంటవు. కార్యముల యందలి మంచిచెడులకు భాస్కరునికి సంబంధములేదు. ఆడే బాలునికి, పాడే గాయకునికి, మాట్లాడే వానికి, పోట్లాడేవానికి, వాదించేవానికి, నివేదించే వానికి, తోలేవానికి, తూలేవానికి అందరికి ప్రకాశము నందించును. తాను దేనిని అంటడు.

తన ప్రకాశముద్వారా లోకమును ప్రభావితంచేసి తాను దేనికి అంటక వెలిగే సూర్యునివలె దేహేంద్రియ మనోబుద్ధులను ప్రకాశింపచేయు ఆత్మ ఆయా వ్యవహారములకు అంటక సదా స్వప్రకాశమై వెల్గొందుచున్నది.

❧❧❧

అవతారిక:- ఆత్మ ప్రకాశము నాశ్రయించి దేహేంద్రియ మనోబుద్ధులు ప్రవర్తించుచుండ, నిష్క్రియమైన ఆత్మ తత్త్వము నెరుగని అజ్ఞానులు గుణాది వ్యాపారములను ఆత్మయందు ఆరోపించుచున్నారు. ఈ విషయమును తరువాత శ్లోకము వివరించుచున్నది.

దేహేంద్రియ గుణాన్ కర్మా
ణ్యమలే సచ్చిదాత్మని
అధ్య స్యన్య్ వివేకేన
గగనే నీలతాదివత్ ॥

21

దేహేంద్రియ గుణాన్ = దేహేంద్రియగుణములను, కర్మాణి = కర్మలను, అమలే = శుద్ధమైన, సచ్చిదాత్మని = సత్ చిత్ స్వరూపమైన ఆత్మయందు, అవివేకేన = అజ్ఞానముచేత, అధ్యస్యన్తి = ఆరోపించుచున్నారు, గగనే = ఆకాశమునందు, నీలతాదివత్ = నీలాది వర్ణములవలె.

**భావము:- ఆకసమున నీలము మొదలగు రంగులను ఆరోపించునట్లు స్వచ్ఛమైన ఆత్మయందు దేహేంద్రియ గుణాది వ్యాపారములను విచక్షణా రహితులగు అవివేకులు ఆరోపించుచున్నారు.**



## వ్యాఖ్య

అద్వయమైన ఆత్మ అజ్ఞానముచేత గోచరించనందున దాని స్థానే అన్య వస్తువులను దర్శించుట జరుగుచున్నది. ఇదియే అధ్యాస లేదా ఆరోపణ. ఆరోపణ అసత్యమేగనుక ఆరోపించబడిన వస్తుగుణములు ఆధారమైన సత్యపదార్థమునందు వుండవు. ఆత్మకు సంబంధించిన జ్ఞానము లేకపోవుటచేత అజ్ఞానము తలెత్తినది. అజ్ఞాన దశలో ఆత్మయైన తాను జీవుడనని భ్రమించుట జరిగినది. జీవభ్రాంతి ఏర్పడగానే తాను దేహమని, ఇంద్రియములని, మనస్సని, బుద్ధియని విశ్వసించుట జరిగినది. దేహసంబంధముచేత దేహబాధలు, ఇంద్రియ సంబంధముచే కల్లోల జీవనము, మనోతాదాత్మ్యముచేత మానసిక సంఘర్షణలు, బుద్ధితో కలియుటచేత సంకల్ప వికల్పాదులు జీవునికి సంక్రమించి అనంత దుఃఖమును అందించినవి. ఆవేదనను ముందుంచినవి. ఆధారవస్తువును మరుగుపరచినవి.

అధిష్ఠానమైన ఆధారవస్తువు మరుగుపడుటకు గల కారణములను పరిశీలించినచో సత్యము తెలియగలదు. ఉన్నదానిని ఉన్నట్లుగా చూడలేక పోవుట మొదటికారణము. లేని దానిని ఉన్నదానిలో చూచుట రెండవ కారణము. ఇట్టి ఆరోపణ ద్వారా కలుగు భ్రాంతిలో దుఃఖము కలుగుచున్నది. ఆత్మ అద్వయమై నందున తనకన్యముగా మరొక వస్తువు మనుగడను సాగించలేదు. ఆత్మకన్యముగా మరొకవస్తువు వున్న యెడల తద్వారా ఆత్మ అనంతత్వమునకు భంగము వాటిల్లగలదు. ఆత్మ అనంతము, అద్వయము. సత్ పదార్థమైన ఆత్మను దర్శించలేక పోవుట మొదటి కారణము. ఇదియే ఆవరణ. సత్యము గోచరించనిస్థితి. అజ్ఞానముచేత ఆత్మకు ఆవరణ ఏర్పడింది. అంతమాత్రాన జీవునికి దుఃఖము కలుగుటలేదు. గాఢనిద్రలో అజ్ఞానమే యున్నది. ఆవరణయే యున్నది. కానీ ఆవేదనలేదు. సత్యమును దర్శించినంత మాత్రాన దుఃఖము కలుగదు. అసత్యవస్తువును సత్యవస్తువులో ఆరోపించుటచేత శోకము ప్రాప్తిస్తుంది. ఇదియే రెండవ కారణము. ఇదియే విక్షేపము. అసత్యము సత్యముగా

గోచరించుస్థితి. అజ్ఞానముచే ఆవరణ కలుగగా కల్పిత జ్ఞానముచే విక్షేపము జరిగింది. తద్వారా జీవభ్రాంతి కలిగి సంసారము, సంసార జనిత అనంత దుఃఖము జీవునికి ప్రాప్తించినది.

ఆత్మలో దుఃఖములేదు.మోహమురాదు. అనాత్మ సంబంధముతోనే శోక మోహాదులు కలుగుచున్నవి. దేహేంద్రియ మనోబుద్ధులను పరిణామ రహితమైన ఆత్మయందు ఆరోపించుట జరుగుచున్నది. నిష్క్రియమైన ఆత్మయందు కర్మల నారోపించుట జరుగుచున్నది. అవ్యయమైన ఆత్మ ఎలా పరిణామము చెందగలదు? పరిణామము చెందు దేహేంద్రియ మనోబుద్ధులు ఆత్మ అగుట ఎట్లు? జ్ఞాన స్వరూపమైన ఆత్మలో అజ్ఞానజనితమైన కర్మ లాచరించబడుట ఎట్లు? ఇవన్నియు సత్యదూరమైన విషయములు.అజ్ఞానియైన జీవుడు చేయు ఆరోపణయేగాని జ్ఞానదశలో నిరూపణకు అందెడి విషయము కాదు. అజ్ఞాన ఫలితమే ప్రవృత్తి. జ్ఞాన ప్రభావమే నివృత్తి.

సత్యము ఎఱుక పడగానే అసత్యజీవనము అంతరించును. అసత్యము అంతరించుట యనగా అధ్యాస అదృశ్యమగుట యని భావము. అధ్యాస అదృశ్యము కాగానే దేహేంద్రియ మనోబుద్ధులకు తాను విలక్షణుడనెడి జ్ఞాన ముదయించును. విలక్షణమైన ఆత్మ నశించేది కాదు గనుక సత్ స్వరూపము. ఉన్నవిఅలా ఉన్నట్లులేనివి అలా లేనట్లు తెలుసుకొనునది ఆత్మ యైనందున అది చిత్ స్వరూపము. సత్ చిత్ స్వరూపమైన ఆత్మ నిర్మలము, నిరంజనము. అది గ్రహించలేని అజ్ఞాని ఆత్మయందు దేహేంద్రియ గుణాది వ్యాపారములను ఆరోపించుచున్నాడని తెలియజేస్తూ ఈ విషయము సులభ గ్రాహ్యమగుటకు ఆకాశమువందు నీలాదివర్ణమును ఆరోపించుట యను ఉదాహరణను కరుణామయులైన ఆచార్యులు తెలియజేయుచున్నారు.

ఆకాశము నీలివర్ణమని తెలియజేయుదుము. ఆకాశము అలాగే గోచరించును. విచారణ చేయగా సత్యము ఎఱుకపడును. ఆకాశము నందు రంగుయున్నదా? రూపము రంగు, ఆకాశములో గాంచుటకు సాధ్యపడునా?



నీవు, నేను చరించుటకు అవకాశమిచ్చుటచేత తాను ఆకాశమైనది. పంచభూతములలో సూక్ష్మతరమైన ఆకాశతత్త్వము చర్మ చక్షువులకు ఎలా గోచరించగలదు? ఆకాశమనునది మానసిక భావన (Mental Concept) యై యున్నది. అనంతమైయున్న ఆకాశమును దర్శించుటకు మనము అశక్తులమై యున్నందున మనదృష్టికి ఆకాశము నీలివర్ణముగ గోచరించుచున్నది. అంతేగాని ఆకాశము నందు నీలివర్ణములేదు, రాదు. నిర్మలమైన ఆకాశము నందునీలివర్ణము నెలా ఆరోపించుచున్నామో, అవివేకముచేత సచ్చిదానంద స్వరూపమైన ఆత్మయందు దేహేంద్రియాది గుణములను ఆరోపించుచున్నాము. ఆకాశ తత్త్వము నెఱిగిన వానికి నీలాది వర్ణములు ఆరోపణయని తెలియును. ఆత్మతత్త్వము నెఱిగిన వానికి అనిత్యమైన దేహేంద్రియాది గుణములు ఆరోపితములని సుస్పష్టముగ తెలియును. అధ్యాసను తెలిసి అజ్ఞాన పరిధినుండి విడివడిన వ్యక్తి ఆత్మవిదుడై తరించ గలడు.



అవతారిక:- దేహేంద్రియ గుణాది వ్యాపారములను ఆత్మయందు ఆరోపించునట్లు, కర్తృత్వ భోక్తృత్వాది గుణములనుకూడా అవివేకులు ఆత్మయందు ఆరోపించుచున్నారని తరువాత శ్లోకము తెలుపుచున్నది.

అజ్ఞానా న్మానసో పాధేః
కర్తృత్వాదీని చాత్మని
కల్ప్యతేఽంబు గతే చంద్రే 22
చలనాది ర్యథాంభసః ॥

అజ్ఞానాత్ = అవిద్యవలన, మానసోపాధేః = మనోపాధివలన సంభవించు, కర్తృత్వాదీని = కర్తృత్వాభిమానము, ఆత్మని = ఆత్మయందు, కల్ప్యతే = కల్పింపబడుచున్నవి. అంబుగతే = నీటియందు ప్రతిఫలించిన, చంద్రే = చంద్రునియందు, అంభసః = జలముయొక్క , చలనాది = చలించుట మొదలగునవి వలె.

భావము:- నీటియొక్క కదలికలు నీటియందు ప్రతిబింబించిన చంద్రుని యందు ఆరోపించ బడినట్లు అజ్ఞానులు కర్తృత్వ భోక్తృత్వాది మనో ధర్మములను ఆత్మయందు ఆరోపించు చున్నారు.

## వ్యాఖ్య

మననుండి అసంఖ్యాకముగ కర్మలు కదులుచున్నవి. ఆనందమును వాంఛించియే వ్యక్తులు కర్మలాచరించెదరు. కర్మనాచరించునపుడు తాను ఆచరించుచున్నట్లు భావన యుండును. కర్మాచరణ జరిగిన తరువాత, ఆయా కర్మలకు సంబంధించిన ఫలితములు అందినపుడు తాను అనుభవించుచున్నట్లు భావన ఏర్పడును. మొదటిది కర్తృత్వ భావన అనబడుతుంది. రెండవది భోక్తృత్వ భావన అనబడుతుంది. ఈ కర్తృత్వ భోక్తృత్వ అభిమానములనెడి రెండు కట్టెలు శిలువగా ఏర్పడి మానవుని మృత్యుముఖంలో పడదోయుచున్నవి.

తాను కర్తనని జీవుడు భావించునంతవరకు తాను భోక్తయనెడి భావనకు దూరముకాలేడు. తాను కర్తయగునో కాదో, ఆత్మలో కర్మ కదులునో లేదో ముందుగా పరిశీలించవలెను. ఆ తరువాత కర్తృత్వ భోక్తృత్వములనెడి రెండును మనస్సుకు సంబంధించినవే గాని చైతన్య స్వరూపమైన తనకు సంబంధించినవి కావని తెలియ గలదు.

ఈ సత్యమును అవగతము చేసుకొని అనుభూతి నొందుటకు కొందరు కర్మలాచరించుచుందురు. ఇది చాల విడ్డూరమైన విషయము. మరి కొందరు అలాగాక కర్మలలో అసంపూర్ణతను అర్థంచేసుకొని కర్మ సన్యాసము చేయుదురు. ఇది మరీ వింత విషయము. కర్మాచరణగాని, కర్మసన్యాసము గాని బంధ రాహిత్యమునకే అని మనకు తెలుసు. బంధము కర్మలో లేదు. భావనలో మున్నది. భావాన్ని శుద్ధి చేసుకోవాలి. భావశుద్ధి లోపించినవాడు కర్మలాచరించి సాధించేదే ముంటుంది? అలాగని కర్మను సన్యసించుట మరీ భయంకరముగా తోచుచున్నది. కర్మను సన్యసించుటకు ఒకప్పుడు నీవు కర్మనాచరించితివా? ఆత్మయైన నీలో కర్మ కదులునా? అడుసు త్రొక్కిన వానికి



కాళ్ళు కడుగవలసిన అవసరమున్నది. కర్తవు నీవుకాదు. భోక్తవెలా కాగలవు? తప్పుచేసిన వానికే శిక్షపడుతుంది. కర్తృత్వమున్న వానికే భోక్తృత్వ భ్రాంతియున్నది. ఆలోచించు.

కనుక వదలవలసింది అభిమానమునే గాని కర్మనుకాదు. భార్యా పుత్రులను, గృహ వాహనాదులను, ధన ధాన్యాదులను, పదవీ బాధ్యతలను త్యాగం చేసి నీవు సాధించే దేమీ ఉండదు. అన్నిటిని త్యాగము చేసినను దేహాభిమానము ఒక్కటుంటే చాలు. దాని ఫలితముగా ప్రయత్నముతో దూరమయినవన్నీ అప్రయత్నంగా వచ్చి అతుక్కుంటాయి. అభిమానము అహంకారము వలన కలిగినది. అహంకారము అజ్ఞానముచేత ఏర్పడినది. తాను పరిమితుడైన జీవుడనని భావించడమే అజ్ఞానము.

అజ్ఞానావృతుడైన జీవునిలో అహంకారము కదిలి, కదిలిన అహంకారము అభిమానమును చిందించగా అభిమానముచేత కర్తృత్వ భోక్తృత్వాది భావములు అందించబడుచున్నవి. అవి భావములైనందున మనోపరిధిలోనే తెలియుచున్నవి. మనస్సు లయించిన గాఢనిద్రలో కర్తృత్వ భోక్తృత్వాది అభిమానములు కూడా అంతరించుచున్నవి. కనుక నేను కర్తననెడి కర్తృత్వాభిమానము, నేను భోక్తననెడి భోక్తృత్వాభిమానము రెండును మనస్సుకు సంబంధించినవేగాని ఆత్మకు సంబంధించినవి కావు.

మనోస్థాయిలో గోచరించు కర్తృత్వ భోక్తృత్వాది అభిమానములు మనస్సున్నంత వరకే యుండును. సమాధిలో మనస్సు నశించగనే సర్వము సమసిపోవును. ద్వైత భావనయే అంతరించుటచేత కర్తృత్వము ఉండదు. భోక్తృత్వము మిగలదు. మనస్సు నశించగనే గ్రహణము వీడిన సూర్యుడు ప్రకాశించునట్లు ఆత్మ స్వయంప్రకాశమై భాసిల్లును. నిర్మలమై భాసించు ఆత్మను గూర్చిన జ్ఞానము లేకపోవుటచేత మనోధర్మములైన కర్తృత్వ భోక్తృత్వాది గుణంబులను అవివేకులు ఆత్మయందు ఆరోపించుచున్నారు. ఈ విషయమును జలములో ప్రతిబింబించు చంద్రునిలో కదలికలు చూచుట అను ఉదాహరణ ద్వారా ఆచార్యులు తెలియజేయుచున్నారు.

నీటితో నింపబడిన తొట్టెయందు చంద్రుడు ప్రతిబింబించును. నీరు కదలక యుండుటచేత చంద్ర బింబము నీటియందు సుస్పష్టముగ గోచరించును. నీరు కదులుట ప్రారంభించగనే చంద్రుడు కూడా నీటిలో చరించునట్లు తెలియును. నీరు కదులుచున్నదని, ప్రతిబింబము కదలదని తెలియని పిల్లలు చంద్రుడు ముక్కలైనట్లు భావింతురు. నీటి కదలికలు ఆగగనే చంద్రుడు మళ్ళీ పూర్ణబింబమై కన్పట్టును. చంద్రుడు కదిలిందీలేదు, కలిసిందీ లేదు. ఆ కదలికలన్నీ నీటివే. నీటిలో ప్రతి బింబమును గాంచు చిత్తమునకు స్వస్తి చెప్పి ఆకసమున బింబమును చూచుటకు ప్రయత్నించగనే సత్యము తేటతెల్లమగును.

తొట్టిలో నీరు కదలగనే నీటికదలికలను చంద్రునికి ఆరోపించి నట్లు మనస్సులో కదులు కర్తృత్వ భోక్తృత్వాది ధర్మములను అవివేకులు ఆత్మయందు ఆరోపించుచున్నారు. నీరు కదలగనే చంద్రుడు చలించలేదు. మనస్సు చలించగనే ఆత్మ చలించడము లేదు. జాగ్రత్స్వప్నావస్థలయందు మాత్రమే మనస్సు పనిచేయును. మనస్సులేని సుషుప్త్యవస్థను కూడా ఆత్మ ప్రకాశింప చేయుచునే యున్నది. అట్టి అనంతాత్మను మనోసంకల్పాలు పట్టలేవు. ముట్టలేవు.

***

అవతారిక:- కర్తృత్వ భోక్తృత్వాది గుణంబులు మనోధర్మము లయినట్లే అనురాగము, కోరిక, సుఖదుఃఖాదులు బుద్ధి ధర్మంబులని తరునాత శ్లోకములో తెలియజేయబడుచున్నది.

రాగేచ్ఛా సుఖదుఃఖాది
బుద్ధౌ సత్యాం ప్రవర్తతే
సుషుప్తౌ నాస్తి తన్నాశే
తస్మాత్ బుద్ధేస్తు నాత్మనః ॥ 23

రాగః = రాగము, ఇచ్ఛా = కోరిక, సుఖదుఃఖాది = సుఖదుఃఖాదులు, బుద్ధౌ సత్యాం = బుద్ధి ప్రవర్తించువరకు, ప్రవర్తతే = తెలియగలవు, సుషుప్తౌ = గాఢ నిద్రయందు, తన్నాశే = బుద్ధి నశించుటచే, నాస్తి = ఉండుటలేదు.



తస్మాత్ = అందువలన, బుద్ధేస్తు = బుద్ధియందే గాని, ఆత్మనః = ఆత్మ యందు, న = లేవు.

భావము:- రాగము, కామము, సుఖదుఃఖాదులు బుద్ధి స్థాయిలోనే తెలియుచున్నవి. బుద్ధి లయించిన సుషుప్త్యవస్థలో అవి తెలియడము లేదు. కనుక అవి బుద్ధికి సంబంధించినవే గాని ఆత్మ ధర్మములు గావు.

## వ్యాఖ్య

దివ్యమైన ఆత్మానుభూతికి అడ్డు నిలచి ఆటంకపరచు అనిత్య విషయ ములను తెలియజేస్తూ, వాటిని అధిగమించి ఆత్మానందము ననుభవించమని ఈ శ్లోకముద్వారా ఆచార్యులు తెలియజేయుచున్నారు.

రాగమనగా సంగత్వము. సంగత్వమే మనిషిని సంసారమున బంధించు భయంకర పాశము. దేనియందును మనకు సంగత్వము లేనిచో అసలు పుట్టుకే రాదు. ఆసక్తియే ఆవిర్భావమునకు కారణమైంది. రాగమే రాకపోకలకు రహదారియైనది. మన అంతర్యములో తిష్టవేసియున్న సంగత్వము ననుభ వించుటకు భోగమైన దేహము, దేహము ప్రాప్తించినది. ప్రాప్తించిన దేహము సమాప్తి నొందేవరకు విషయ సంగత్వములోనే ఓలలాడుతూ ఉంటుంది. కనుక మొదట సంగత్వము శరీరముతో ప్రారంభమై ఆ తరువాత ఆ దేహముతో సంబంధము నేర్పరచుకొన్న బంధుమిత్రులపైక భార్యాపుత్రులమీదకి ప్రసరిస్తుంది.

అజ్ఞానము వలన రాగము ఏర్పడుతుంది. రాగము భయము నందిస్తుంది. రాగము అనేక రూపాలలో దర్శనమిస్తుంది. కొందరికి సంసారముపై రాగము దయిస్తుంది. అట్టివారు జీవిత గమ్యమైన దివ్యానందానుభూతిని విస్మరించి సంసారిక దుఃఖవలయంలో పరిభ్రమిస్తుంటారు. కొందరి రాగము ధనార్జనపై యుంటుంది. కొందరికి పేరు ప్రఖ్యాతుల నార్జించుటలో ఉంటుంది. కొందరు రాగము చెడ్డదని భావించి, సంసారములను త్యజించి సన్యాసమును స్వీకరిస్తారు. ఆశ్రమము మారిందేగాని ఆసక్తి అడుగంటలేదు. అందుచేత ఇంతవరకు గృహాలకు పరిమితమై యున్నవారు ఇప్పుడు ఆశ్రమముతో సంగత్వము కల్గి

కమండలము పోయినా ఇతరులు ఓదార్చుటకు వీలులేనంత దుఃఖాన్ని అనుభవిస్తుంటారు. ఇదంతయు సంగత్వ ప్రభావమే. రాగమహిమయే. దేహాత్మ భావనయే రాగము నకు పునాదియై యున్నది. ప్రపంచము నిత్యమనెడి అభిప్రాయము రాగకుడ్యమును నిర్మించుచున్నది. ఈ ప్రపంచములో కలుగు బాంధవ్యాలు శాశ్వత మనెడి సంకల్పమే రాగభవంతికి కప్పుయై నిలుచుచున్నది. ఇంద్రియ విషయాలు ఆనంద దాయకము లనెడి అసత్యపు అవగాహనయే తుదిరూపము నిచ్చి కళాకాంతులను అమర్చుచున్నది. ఇంతగా కష్టించి నిర్మించుకొన్న రాగభవంతి పేకమేడవలె ఒకనాడు కూలిపోతుందన్న నగ్నసత్యాన్ని మనిషి గుర్తించలేకున్నాడు. ఎంతో ఉత్సాహంతో ఊహించి కట్టుకొన్న సంగత్వ సదనము ఇసుకగూడువలె కదిలి పోతుందని గ్రహించలేక పోతున్నాడు.

మనస్సులో రాగము చోటు చేసుకొనగానే మనస్సు మోహమునకు గురియగును. ఏ విషయములందు రాగము పెనవేసుకొని యున్నదో ఆవిషయ ములను పొందుటకు మనస్సులో కోరిక జనించును. దానినే ఇచ్ఛా అని ఆచార్యులు తెలియజేయుచున్నారు. ఇదియే కామము లేక కోరిక. రాగము బంధమును కలిగించి కోరికను కదిలించును. అణచుటకు వీలులేని విధముగా కోరికలు విజృంభించును. కనుక ఆసక్తి లేకుండా, రాగరహితుడై కర్మలాచ రించినచో మనిషి బద్ధుడు కాడు. అందుచేతనే

'తస్మద సక్త స్సతతం కార్యం కర్మ సమాచర '

' సంగత్వము లేనివాడవై చేయదగిన కర్మలను నేర్పుగా చేయుచుండుము ' అని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీత-కర్మ యోగములో బోధించియున్నాడు.

రాగము, కామము అనునవి రజోగుణముచే పుట్టినవి. రాగము వలన భయము కలుగును. కామమువలన క్రోధము కలుగును. కామమనునది ఒక భయంకర రాక్షసి. మన మాచరించు సర్వపాపములకు మూలకారణమై యున్నది. అవిద్యా జనితమైన రజోగుణమువలన ప్రాప్తించిన ఈ కామము విద్యకు శత్రువుగా నిలిచి మోక్ష ప్రవేశము నడ్డగించు చున్నది. కోరిక కదలకనే యుండవలెను. కదిలినచో తీరినను దుఃఖమే, తీరకపోయినను శోకమే. కోరిక తీరినచో తద్వారా జనించు అనుభూతి పదే పదే అనుభవించమని ప్రేరేపిం



చును. తీరకపోయినచో హృదయములో అసంతృప్తి నిలిచిపోవును. మనలోని కోరికలు సదా సఫల మగునని భావించుట అసమంజసము. వస్తు ప్రపంచము నిరంతరము పరిణామశీలమై యున్నందున అట్టి వస్తువులతో మన మేర్పరచు కొను వాంఛలు సదా నెరవేరవు. అదియునుగాక వస్తువులను అనుభవించు ఇంద్రియములు ఎల్లప్పుడు ఒకే ఆవేశముతో పనిచేయవు. వస్తువులు ఇంద్రి యములు అనుభూతి నొందుటకు సిద్ధముగా యున్నను ఇంద్రియముల ద్వారా వస్తువులను అను భవించు మనస్సు అనుకూలముగా యుండదు. ఈ కారణములన్నిటిని పరిశీలించినచో కామ మెంత అనర్థదాయకమో బోధపడగలదు.

ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా

కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణానలేనచ ॥

' కుంతీకుమారా! నిప్పువలె సంతృప్తి చెందనిది, ఆశారూప మయినదియు, జ్ఞానికి ఎల్లప్పుడు శత్రువునగు ఈ కామముచేత జ్ఞానము కప్పబడియున్నది. ' అని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతయందు తెలిపియున్నాడు.

రాగముచే ప్రేరేపించబడిన కామమునకు బానిసయై మానవుడు కర్మలాచరించును. తాను ఏ ఫలితమును ఊహించి కర్మనాచరించునో ఆ ఫలితమే కలిగినపుడు దానిని సుఖముగా భావించును. తన ఊహకు అనుగుణ్యమైన ఫలితము రానిచో దానిని దుఃఖముగా భ్రమించి కలత చెందును. ఈ సుఖదుఃఖ తరంగముల ఆటుపోటులో జీవితమే హరించిపోతున్నది. అజ్ఞాన జనితమైన రాగము, కామము, సుఖదుఃఖాదులు మనోబుద్ధులకు సంబంధించినవే గాని మనోబుద్ధులు లయించిన సుషుప్తిలో తెలియడంలేదు. దీని నాధారముగా చేసుకొని ఆలోచించినచో జాగ్రత్స్వప్నా వస్థలలోనే రాగాది విషయంబులు తెలియుచున్నవి. సుషుప్తిలో అదృశ్య మగుచున్నందున అవి కేవలం మనోబుద్ధులకు సంబంధించినవియే యని బోధపడుచున్నది. మనోబుద్ధులు చైతన్యముచేత ప్రకాశించుచున్నవి. మనో బుద్ధులు లయించినంత మాత్రాన చైతన్యము మరుగుపడుటలేదు. కనుక

రాగాది విషయములు, సుఖదుఃఖాదులు ఆత్మ స్థాయిలో లేవని ఆచార్యులు తెలియ జేయుచున్నారు. మరి నీవు మనస్సా? ఆత్మయా? నీవు ఆత్మయే గాని మనస్సుకాదు. నీవు ఆత్మమైనచో మనోజనితమైన రాగాది విషయములు నిన్ను అంటలేవు. కదిలించలేవు. కలత చెందించలేవు. మనో ధర్మములను ఆత్మయందు ఆరోపించుటచేత, మనోజనిత వికారములన్నియు ఆత్మయందు కల్పించబడుచున్నవే గాని నిన్ను ఆత్మగా నీ వెరిగినచో కలతలు నిన్ను కదిలించలేవు. ఇదియే స్వరూప బోధ.

" స్వరూపావస్థానే వాసనా నామ నవకాశః "

'స్వరూప స్థితియందు వాసనలు కదిలే అవకాశములేదు' అని స్వరూప బోధోపనిషత్ తెలియజేయుచున్నది. కనుక ఏబాధలు తాకలేని, ఏ వ్యథలు ముట్టలేని నిర్వికల్ప సమాధియే నీ నిజరూపమై యున్నదని ఆచార్యులు సూచిస్తున్నారు.

అవతారిక:- సుఖ దుఃఖాదులు మనోధర్మములైనట్లు సచ్చిదానంద నిత్య నిర్మలాదులు ఆత్మకు స్వభావములై యున్నవి యనెడి విషయమును ఆచార్యులు 24వ శ్లోకములో తెలుపుచున్నారు.

ప్రకాశోఽర్కస్య తోయస్య
శైత్యమగ్నే ర్యథోష్ణతా
స్వభావః సచ్చిదానంద
నిత్య నిర్మల తాత్మనః ॥ 24

అర్కస్య = సూర్యునకు, ప్రకాశః = వెలుతురు, తోయస్య = నీటికి, శైత్యం = చల్లదనము, అగ్నేః = అగ్నికి, ఉష్ణతా = వేడి, యథా = ఎలాగో, ఆత్మనః = ఆత్మకు, సత్ = సదా ఉండునది, చిత్ = సర్వము తెలియునది, ఆనంద = నిరంతరము, సుఖముగ నుండునది, నిత్య = శాశ్వతత్వము, నిర్మలతా = శుద్ధత్వము, స్వభావః = సహజ లక్షణములు.

**భావము:-** సూర్యునకు తేజము, నీటికి చల్లదనము, అగ్నికి ఉష్ణము ఎలా సహజ ధర్మములో అలాగే సచ్చిదానంద నిత్య నిర్మలాదులు ఆత్మకు స్వభా వములై యున్నవి.



## వ్యాఖ్య

ఒక వస్తువు ఆ వస్తువుగా కొనసాగుటకు ఏది ముఖ్యకారణమై యున్నదో అది ఆ వస్తువు యొక్క సహజ ధర్మము. తియ్యదనము పంచదార స్వభావము. అది దాని ధర్మము. పంచదార పులుపుగా యుండుట మన మెచ్చటను గాంచలేదు. ఒకవేళ పంచదార పులుపుగా యున్నచో దానిని పంచదార అని పిలువరు. దాని స్వభావమును కోల్పోవగానే స్వరూపమే నశించిపోయింది. ఐతే పంచదార తెల్లగా యున్నది కదా! రేణువులవలె యున్నది కదా! అవి పంచదార ధర్మములు కావా? కావడానికి వీలులేదు. తెల్లగా రేణువులవలె ఉన్నంత మాత్రాన పంచదార అనేందుకు వీలులేదు. కొన్ని రసాయనిక ఎరువులు తెల్లగా రేణువులవలె యుండును. అంత మాత్రాన దానిని పంచదార అని యనగలమా? తియ్యదనము ముఖ్యధర్మము. మిగిలిన రంగు రూపములు అముఖ్య ధర్మములు. అముఖ్య ధర్మములు నశించినంత మాత్రాన వస్తు స్వరూపము చెడదు. ముఖ్యధర్మము నశించగనే స్వభావ స్వరూపాదులు నశించును.

సూర్యునికి తేజము సహజ ధర్మము. సూర్యునినుండి ప్రకాశమును దూరం చేయలేము. సూర్యుడస్తమించుట గౌణమేనని మనకు తెలుసు. భారతదేశమునకు గోచరించని సమయాన అమెరికాలో గోచరమగుచునే యున్నాడు. భూభ్రమణ ఫలితముగా మనము సూర్యుని గాంచలేకపోవుటయేగాని సూర్యుడు అస్తమించేదిలేదు. ఉదయించేది లేదు. నేత్రాలు లేని భగవంతుని లాలిపాటలతో నిద్రపుచ్చునట్లు, నిద్ర ఎఱుగని ఆదిదేవుని సుప్రభాతంతో మేల్కొల్పునట్లు నీవు నిద్ర నుండి లేచి సూర్యుడు ఉదయించాడని చెబుతావు. సూర్యునికి వెలుతురు సహజ ధర్మము. వెలుతురు లేని కుండలాగ, కొండలాగ సూర్యుని దర్శించుట సాధ్యపడదు.

సూర్యునకు ప్రకాశము సహజ ధర్మమైనట్లు నీటికి చల్లదనము సహజ ధర్మము. చల్లగానున్న నీటిని నీవు వేడిచేయవచ్చు. లేదా భాస్వరమున్న

కొండలనుండి ప్రవహించు జలము వేడిగ ఉండవచ్చు. కానీ నీటి సహజ లక్షణము చల్లదనమే. ఉదజని ప్రాణవాయువుల సంయోగముచే ఏర్పడిన జలము శైత్యముగాక మరోవిధంగా ఉండేందుకు వీలులేదు. కనుక చల్లదనము నీటి సహజ లక్షణము. అలాగే ఉష్ణము అగ్నియొక్క సహజ ధర్మము.

అగ్ని వేడిగా యుండును. ఉష్ణము అగ్నియొక్క సహజ ధర్మము. చల్లగా నున్న అగ్ని అలభ్యము. వేడిగా యున్నప్పుడే దానిని అగ్ని అందురు. చల్లబడగానే అది బొగ్గు యని పిలువబడును. కనుక వేడిమి అగ్నియొక్క సహజధర్మము. అగ్ని ఎఱ్ఱగా కన్పించవచ్చు. అగ్నిశిఖలు తలెత్తవచ్చు. అవి అన్నియు అముఖ్య ధర్మములు. ముఖ్యధర్మమైన ఉష్ణమున్నచో అందుండి ఎర్రదనము గోచరించవచ్చు. అగ్నిశిఖలు కదలవచ్చు. ముఖ్య ధర్మమైన ఉష్ణము అంతరించగనే అగ్ని తన సహజస్థితినే కోల్పోవును. స్వరూపమే నశించును. సూర్యునకు ప్రకాశము, నీటికి చల్లదనము, అగ్నికి ఉష్ణము ఎలా సహజ ధర్మములో ఆత్మకు సచ్చిదానంద నిత్య నిర్మలాదులు సహజ ధర్మములని ఆచార్యులు తెలియజేయుచున్నారు.

ఆత్మ ఉన్నది. కాదు, ఉన్నదే ఆత్మ. అనాత్మను దర్శించు వానికి ఆత్మ తెలియుటలేదు. అలా తెలియుటలేదు అనెడి జ్ఞానము కూడా ఆత్మ వలననే కలుగుచున్నది The Be-ing is the Self ఆత్మజాగ్రత్స్వప్నసుషుప్తులలో చక్కగా తెలియుచున్నది. జాగ్రదావస్థలో వస్తుప్రపంచమును ఏదయితే తెలుసుకొనుచున్నదో, స్వప్న ప్రపంచములో దృశ్యములను గాంచుచు స్వప్నానుభూతిని పొందుచున్నదో, మనోబుద్ధులు లయించి ఏమీ తెలియని సుషుప్త్యవస్థలో అలా తెలియుట లేదనెడి అజ్ఞానమును ఏదయితే ప్రకాశింపజేయుచున్నదో, దేహేంద్రియ మనోబుద్ధులు నడచుటకు కారణమై, అవి నశించినను తాను నిత్యమై భాసించుచున్నదో అదియే ఆత్మ. అలా త్రికాలములందుండి కాలాతీతముగా మనుగడను సాగించుట ఆత్మ సహజ ధర్మము. అదియే 'సత్' (Existence) అని తెలియబడినది.



ఆత్మ జ్ఞాన స్వరూపము. ఆత్మజ్ఞానముచేతనే వస్తుజ్ఞానము కలుగుచున్నది. ఉన్నది ఆత్మ యొక్కటే గనుక ఆత్మజ్ఞానముచేత సర్వజ్ఞత్వము లభించును. నాలోని ఆత్మయే సర్వాత్మమై యున్నదని తెలుసుకొనుటయే సమ్యక్ జ్ఞానము.

**ఏషోహ దేవః ప్రదిశోఽను సర్వాః**

' ఈ ఆత్మ సర్వదిక్కులను సంపూర్ణముగా వ్యాపించియున్నది. అని శ్వేతాశ్వతరోపనిషత్తు తెలియజేయుచున్నది. అదియే జ్ఞానము. ఆత్మకు మరియొక సహజధర్మము. ఇదియే 'చిత్' (Knowledge) అనబడును.

సదా వసించి సమస్తము నెరుగు ఆత్మలో దుఃఖము పొడసూపేందుకు వీలులేదు. అందుచేత ఆత్మ ఆనందస్వరూపము.

**సచ్చిదానందాత్మాఽహం భావనయా భావితః**

' నేను సచ్చిదానందస్వరూపమైన ఆత్మను అని సదా భావించుము " అని స్వరూపబోధోపనిషత్ తెలియజేయుచున్నది. కనుక సత్ చిత్ ఆత్మయొక్క సహజ ధర్మములైనట్లు ఆనందము (Bliss) కూడా ఆత్మ ధర్మమై యున్నది.

ఆనందస్వరూపమైన ఆత్మ నిత్యమై యుండవలెను. నిత్యమనగా దేశకాలవస్తువులచే అపరిచ్ఛిన్నమై యుండవలెను. అప్పుడే పరిణామ రహితమై యుండగలదు. పరిణామ రహితమైనదే నిత్యమై భాసించగలదు. పరిణామము చెందవలెనన్నచో పరిమితమై యుండవలెను. పరిమితమై యున్నచో నిత్యమై భాసించలేదు. కనుక ఆత్మ అపరిమితమై యున్నది. అరిమితమనగా అనంతమని భావము. అనంతమైన ఆత్మ అద్వయమై యున్నది. అద్వయమైన ఆత్మను మలిన పరచుటకు రెండవ వస్తువు లేనందున నిత్యమైన ఆత్మ నిర్మలమై యున్నదని ఆచార్యులు తెలియజేయుచున్నారు.

**అఖణ్డైకరస చిన్మాత్ర బ్రహ్మోహమస్మి !**
**నిర్విశేష చిన్మాత్ర బ్రహ్మోహమస్మి!**
**కేవల చిన్మాత్ర బ్రహ్మోహమస్మి!**
**కేవల సన్మాత్ర బ్రహ్మోహమస్మి!**

" నేను అఖండ ఏకరస చిన్మాత్ర బ్రహ్మమును. నేను నిర్విశేష జ్ఞానస్వరూపమైన బ్రహ్మమును. నేను కేవల చిత్స్వరూప బ్రహ్మమును. నేను కేవల సత్స్వ రూప బ్రహ్మమును " అని బ్రహ్మానుభవ ఉపనిషత్తు తెలియజేస్తున్నది. కనుక సచ్చిదానంద నిత్య నిర్మలాదులు ఆత్మయొక్క సహజ ధర్మములై యున్నవి.



అవతారిక:- ఆత్మ జ్ఞానస్వరూపము. మరి 'నేను తెలుసుకొనుచున్నాను' అని చెబుతున్న దెవరు? తరువాత శ్లోకమే సమాధానము.

ఆత్మనః సచ్చిదంశశ్చ
బుద్ధేర్వృత్తిరితి ద్వయం
సంయోజ్య చావివేకేన
జానామీతి ప్రవర్తతే ॥ 25

ఆత్మనః = ఆత్మయొక్క, సచ్చిదంశశ్చ = సత్ చిత్ అనెడి అంశ, బుద్ధేః = బుద్ధియొక్క, వృత్తిః = సంకల్ప తరంగము, ఇతి = అనెడి, ద్వయం = రెండును, సంయోజ్య = కలిపి, చ = మరియు, అవివేకేన =అజ్ఞానముచే, జానామీతి = తెలుసుకొనుచున్నాను అని, ప్రవర్తతే = వ్యవహరించుచున్నాడు.

**భావము:- ఆత్మయొక్క సత్,చిత్ అంశ బుద్ధిలోని సంకల్పముతో చేరుటచే ఏర్పడిన అవివేకపు భావనయే నేను తెలుసుకొను చున్నాను అనుదానిని కల్గించినది.**

## వ్యాఖ్య

ఆత్మ అద్వయమైనందున తాను తెలుసుకొనుటకు రెండవ వస్తువు లేదు. మనస్సు జడమైనందున తాను తెలుసుకొనలేదు. మరి నేను తెలుసు కొనుచున్నాను అనెడి భావము ఎలా కదులుచున్నది? ఈ విషయమును గూర్చి ప్రస్తుత శ్లోకములో ఆచార్యులు తెలియజేయుచున్నారు.

**మనశ్చాపి జడమ్ ! బ్రహ్మణో మూలభూతాత్ స్వప్రకాశమాదత్తే !**



మనస్సు కూడా జడమే. తనకు ఆధారమైన బ్రహ్మమునుండి ప్రకాశమును పొందుచున్నది' అని శివ జ్ఞానామృతోపనిషత్ తెలియజేయుచున్నది.

ఈ దృశ్యమాన ప్రపంచమును నేను గాంచుచున్నాను. వస్తువులు, విషయములు నాచేత తెలియబడుచున్నవి. నేను వస్తుజ్ఞానము పొందవల యునన్నచో నాలో ప్రకాశముండవలెను. ఆ ప్రకాశము ద్వారా నేను సకలమును తెలుసుకొనుచున్నాను. అనుభవములను గడించుచున్నాను. 'నేను తెలుసు కొనుచున్నాను. నేను తెలుసుకొనలేకున్నాను' అని చెబుతున్నాను. నాలో తెలుసుకొనుచున్నదెవరు? మనోవృత్తియే. మరి ఆ మనో సంకల్పము ఎచ్చటనుండి ఆవిర్భవించినది? మనస్సునుండి. మనస్సు తనకు తానుగా తెలుసుకొనలేదు. మనస్సును తెలుసుకొనగలదా? మనస్సు జడము గనుక తెలుసుకొనునని చెప్ప ప్రకాశింపజేయు ఆత్మ జ్ఞానస్వరూపము గనుక ఆత్మ తెలుసుకొనునని చెప్ప గలమా? అదియును అసమంజసమే. ఆత్మజ్ఞానములో రెండవ వస్తువు స్ఫురించే అవకాశము లేనందున నేను తెలుసుకొనుచున్నాను అనెడి భావము ఏర్పడేందుకు వీలులేదు. మరి అట్టి భావము ఎక్కడ స్ఫురించినది? ఎవరిలో స్ఫురించినది?

జ్ఞాన స్వరూపమైన ఆత్మ ప్రకాశము జడమైన మనస్సునందు ప్రతిబింబించగనే మనస్సులో వృత్తి బయలుదేరుతున్నది. ఆ వృత్తియే తెలుసు కొనునది. అదియే జీవత్వము. మనస్సులో జనించు వృత్తులను చైతన్యమే ప్రకాశింప చేస్తున్నది మనస్సులోపడిన చైతన్య ప్రతిబింబమే చిదాభాసుడని తెలియుచున్నాడు. కనుక నేను తెలుసుకొను చున్నాననెడి జ్ఞానము వృత్తి జ్ఞానమేగాని ఆత్మజ్ఞానము కాదు. ఆత్మ జ్ఞానమునందు వృత్తికదిలే అవకాశము లేదు. అది వృత్తి రహిత చైతన్యము. స్వయంప్రకాశము. అద్వయము. ఆత్మయొక్క చైతన్యకిరణము వృత్తితో చేరినపుడు వృత్తిసహిత చైతన్యమై వస్తుప్రపంచమును గాంచుచు, అలా గాంచుచున్నట్లు తెలియ జేయుచున్నది. వృత్తితో చైతన్యము కలియుట అనెడి ఫలవ్యాప్తివలన వృత్తివ్యాప్తి జరిగి విషయానుభూతి కలుగుచున్నది. విషయములతో తాదాత్మ్యము చెందిన వృత్తి తద్రూపమై విషయాకారవృత్తి అగుచున్నది. ఈ వృత్తియే బ్రహ్మభావనతో నిండినపుడు బ్రహ్మాకారవృత్తియై, అట్టి బ్రహ్మ భావమునకు వైకల్యము కలుగనిచో అఖండ బ్రహ్మాకారవృత్తి యగును. ఇచ్చటనే బ్రహ్మానుభూతి

కలుగుతుంది. బ్రహ్మమును తెలియగోరువాడు బ్రహ్మముగానే ఉంటాడు. ఇంతవరకు విషయముల మీదకి నడచిన వృత్తి విషయములను గ్రహించినది. బ్రహ్మముపైకి నడచిన వృత్తి బ్రహ్మజ్ఞానమును అనుభవించు తరుణములో అందు లయించునేగాని ప్రత్యేకముగా నిలబడి బ్రహ్మమును గాంచలేదు.

ఒక చీకటి గదిలో కుండ ఉన్నది. ఆ కుండలో ఒక బొమ్మను ఉంచడము జరిగినది. దానిపై మూతయున్నది. మూతను తొలగించినను చీకటి క్రమ్మియుండుటచే లోనున్న వస్తువేమిటో తెలియదు. వెలుగుతున్న దీపము ద్వారా తెలుసుకొనవలయును. అలాగాక బొమ్మకు బదులుగా ఆ కుండలో వెలుగుతున్న దీపము ఉండినచో మూత తొలగించగానే దీపము స్వయంప్రకాశమై గోచరించును. వెలుగుతున్న ఆ దీపమును గాంచుటకు వేరొక దీపము అవసరములేదు. అలాగే వృత్తినిప్రకాశింపచేయుటకు చైతన్యము అవసరము గావి చైతన్యమును ప్రకాశింపచేయుటకు మరియొక చైతన్యము అవసరములేదు. అది స్వయంప్రకాశమైయున్నది. స్వప్రకాశమై భాసించు చైతన్యము మనో వృత్తులతో కలిసినపుడు ఆ సంయోగముచేత కదిలెడి వృత్తి జ్ఞానముతో అవివేకులు నేను తెలుసుకొనుచున్నాను-జానామి-అని పలుకుచున్నారు. అహం పదార్థము స్వరూపత: ఆత్మయే అయియున్నది.' నేను తెలుసుకొనుచున్నాను-నేను అనుభవించుచున్నాను' అనెడి ప్రలాపము జీవభ్రాంతియే. చైతన్యము మనోవృత్తులతో కలియుటచేత జీవభ్రాంతి ఏర్పడినది. మనోవృత్తుల నుండి విడిపడి తనకు తాముగా ప్రకాశించినచో భ్రాంతి అంతమగుచున్నది.

※

అవతారిక:- కర్త ఎవరు? ద్రష్ట ఎవరు? అను విషయమును తరువాత శ్లోకములో ఆచార్యులు విపులీకరించుచున్నారు.

ఆత్మనో విక్రియా నాస్తి
బుద్ధేర్బోధో న జాత్వితి
జీవః సర్వమలం జ్ఞాత్వా
జ్ఞాతా ద్రష్టేతి ముహ్యతి ॥





ఆత్మన: = ఆత్మకు, విక్రియా = కర్తృత్వము, నాస్తి = లేదు, బుద్ధే: = బుద్ధికి, బోధ: = జ్ఞానము, న జాతు ఇతి = లేనేలేదు, జీవ: = జీవుడు, సర్వం = సమస్తమును, జ్ఞాత్వా = తెలుసుకొని, జ్ఞాతా = తెలుసుకొనువాడను, ద్రష్టా = చూచువాడను అని, అలం = మిక్కిలి, ముహ్యతి = భ్రమించు చున్నాడు.

భావము:- ఆత్మయందు కర్తృత్వములేదు. నేను తెలుసుకొనుచుంటిని అని బుద్ధి తనకు తానుగా చెప్పలేదు. మోహముతో కూడుకొన్న జీవుడు తానే కర్తనని, ద్రష్టనని భ్రాంతి చెందుచున్నాడు.

## వ్యాఖ్య

కర్మ నాచరించువానికి కర్తృత్వము మిగులును. కర్మ అజ్ఞానజనితము. అపరిపక్వ స్థితినుండి పరిపక్వస్థితికి, అపరిపూర్ణతనుండి పరిపూర్ణతను చేరుటకు చేయు ప్రయత్నమే కర్మాచరణ వెనుక అంతర్యమై యున్నది. ఆత్మ పూర్ణానంద స్వరూపమైనందున ఆత్మలో కర్మకు ఆస్కారములేదు. కర్మాచరణ లేనందున కర్తృత్వము తెలియదు. కర్తృత్వములేనపుడు భోక్తృత్వము వుండేందుకు వీలులేదు. అందుచేత ఆత్మ కర్తయూగాదు. ద్రష్టయూకాదు.

ఆత్మయందు కర్తృత్వ భోక్తృత్వములు లేనపుడు ఇకమిగిలింది బుద్ధి యొక్కటే. అభిమానము బుద్ధికి అంటగట్టాలి. బుద్ధి తనకు తానుగా ప్రకాశించగలదా? ప్రకాశించలేదు. బుద్ధి జడమా లేక చైతన్యమా? జడమే. జడమైన బుద్ధి కర్మ నెలా ఆచరించగలదు? కర్మ నాచరించలేనపుడు కర్తృత్వమెలా కల్గుతుంది? కర్తృత్వము లేని బుద్ధికి భోక్తృత్వమెలా ఆపా దించబడుతుంది? అందుచేత బుద్ధికికూడా కర్తృత్వ భోక్తృత్వములు లేవు. మరి 'నేను తెలుసుకొనుచుంటిని' అని తెలుపునదెవరు? ఈ విషయమునే ఆచార్యులు ప్రస్తుత శ్లోకముద్వారా చర్చించుచున్నారు.

పెట్రోలు తనకు తానుగా కదలలేదు. కదిలే కారు పెట్రోలు లేనిదే కదలలేదు. రెండిటి కలయికతో కారు చలించును. కారు క్షేమంగా చేరినా,

ప్రమాదమునకు గురి అయినా కారకులు పెట్రోలు కాదు. కారు కాదు. పెట్రోలు సహాయముతో కారును నడుపు డ్రైవరేనని వేరుగా చెప్పనవసరము లేదు.

కారులో డ్రైవరు ఎలాగో ఈ దేహమనెడి కారులో జీవుడు డ్రైవరై యున్నాడు. చైతన్యము బుద్ధిలో ప్రతిబింబించుటవలన జనించిన చిదాభాసుడే జీవుడు. కదిలిన జీవ భ్రాంతి, అందించిన విభ్రాంతి అజ్ఞాన సంసారమును తయారుచేసింది. దేహమునకు తాను పరిమితుడననెడి భావమును కల్పించింది. అజ్ఞానాన్ని తయారుచేసుకొన్నది. రాగద్వేషాలను ఏర్పరచుకొన్నది. జగత్తును సృష్టించింది. జగత్తును దర్శించే దృష్టిని కలవర పరచింది. కర్తృత్వమును ఆపాదించుకొన్నది. భోక్తృత్వమును అనుభవించుచున్నది. సుఖదుఃఖ తరంగాల మధ్య జీవుడు కలత చెందేలా చేయుచున్నది. ఈ జీవుడు తాను జ్ఞాతనని, ద్రష్టనని వ్యవహరిస్తున్నాడు.

బుద్ధివలననే జీవభ్రాంతి కలిగినది గాన బుద్ధిచేతనే భ్రాంతి నిర్మూలించ బడవలెను. బుద్ధిలో ప్రకాశించిన చైతన్యము జగత్తును వెంబడించి నడక సాగించుటవలన జీవభ్రాంతిని తయారుచేసుకొన్నది. అదే చైతన్యము అంతర్ముఖమైనచో ఆత్మశాంతిని పొందగలదు. జీవభ్రాంతి ద్వారా మిథ్యాజ్ఞానము కలుగగా ఆత్మజ్ఞానముద్వారా సమ్యక్ జ్ఞానము కలుగును. దానికి విచారణయే మార్గము. ప్రపంచముయొక్క 'అనిత్యత్వాన్ని అశాశ్వతమైన జీవితముయొక్క స్థితిని గూర్చి చక్కగా విచారణ జరిపి జీవభ్రాంతిని తొలగించుకొని బ్రహ్మైక్యమును పొంది తరించాలి.

" **ప్రపంచోఽయం మిథ్యా! స కేవలం ప్రాతి భాసికః** "

ఈ ప్రపంచము మిథ్య. కనపడుచున్నదేగాని సత్యముగాదు " అనెడి వేదాంతసారోపనిషత్ మంత్రమును చక్కగా అర్థంచేసుకోవాలి.

" **జీవితమిదం తృటి ద్వయస్య క్రీడా** "

" ఈ మానవజీవితము రెండు నిముషముల ఆట " ఆడాలనే భ్రాంతి తప్ప ఆటలో ఊరట లేదు.



" **శరీర మిదం నిమేష త్రయావస్థాయీ బుద్బుదః** "

" ఈ దేహము మూడుక్షణాలు ముచ్చటగా గోచరించే నీటిబుడగ." ఏక్షణాన చితికిపో నున్నదో తెలియదు. బాల్యము క్షణములా నడిచిపోతుంది. యవ్వనము రెండవ క్షణమై పరుగెడుతుంది. మూడవ క్షణంలో ముసలితనము మూలుగుతూ మృత్యువాత పడుతుంది. బుద్ధిలో విచారణను జరిపించాలి. ఆత్మ అనాత్మల తారతమ్యాన్ని గుర్తించే స్థితికి బుద్ధిని పెంచాలి. ఆత్మజ్ఞానము లేకపోవుటచేత "నేను దేహమును, మనస్సును, బుద్ధిని అని ఊహించి బాధపడటము జరిగినది. యదార్థానికి జీవుడనని కలతచెందే నీవు దేవుడవై యున్నావు. విచక్షణను పెంచుకో, వీక్షణములో దోషమును తొలగించుకో, జీవభ్రాంతిని తొలగించుకొని బ్రహ్మభావములో రమించు.

❋

అవతారిక:- జీవభ్రాంతియే అశాంతికి కారణము. బ్రహ్మ భావనయే శాంతికి సోపానము. ఈ విషయమును రాబోవు శ్లోకము విశదీకరించును.

రజ్జు సర్పవ దాత్మానం
జీవో జ్ఞాత్వా భయం వహేత్
నాహం జీవః పరాత్మేతి 27
జాతశ్చేత్ నిర్భయో భవేత్ ॥

రజ్జు సర్పవత్ = రజ్జువునందు సర్పమువలె, ఆత్మానం = ఆత్మను, జీవః = జీవునిగా, జ్ఞాత్వా = తెలిసికొని, భయం = భయమును, వహేత్ = వహించి యున్నాడు, జీవః = జీవుడను, నాహం = నేనుకాను, పరాత్మేతి = పరమాత్మనని, జ్ఞాతః = తెలుసుకొనిన, చేత్ = యెడల, నిర్భయః = భయములేని వాడుగ, భవేత్ = కాగలదు.

**భావము:-** **త్రాడును పామని భ్రమించుటవలన వ్యక్తి భయమును పొందు చున్నాడు. అలాగే తాను జీవుడని భావించుటచేత భయభ్రాంతులకు లోనగుచున్నాడు. తాను జీవుడుకాదని, సచ్చిదానంద స్వరూపమైన బ్రహ్మమని భావించగనే భయము అంతరించుచున్నది.**

## వ్యాఖ్య

అవిద్యచేత ఆత్మజ్ఞానము మరుగుపడినది. ఆత్మ మరుగుపడగానే భ్రాంతి నాట్యము చేయసాగింది. భ్రాంతి చిందించు కల్పిత విషయాలను సత్యముగా అంగీకరించ పనిలేదు. అవిద్య యున్నంతవరకే అది అందించు భ్రాంతి, తద్వారా కలుగు అశాంతి గోచరించును. జ్ఞానము కలుగగనే వెలుతురు చీకటిని పోగొట్టునట్లు, విద్య అవిద్యను రూపుమాపుటచేత భ్రాంతి అడుగంటును. సంసారము అదృశ్యమగును.

త్రాటిలో పామును దర్శించుటయే జీవత్వము. ఉన్నది త్రాడే గాని పాము కాదు. సర్పము త్రాటియందు ఆరోపించబడినది. రజ్జువుకు అన్యముగా సర్పమునకు మనుగడలేదు. ఉన్న రజ్జువులో లేని సర్పము తెలియవచ్చుట భ్రాంతి. రజ్జువునందు సర్పము ఏ సమయములోనూ లేదు. దర్శించి భీతిచెందు సమయములో కూడా సర్పము చూచువాని మనస్సులో యున్నదే గాని రజ్జువునందు లేదు. ఇలా లేని సర్పమును ఉన్నట్లుగా చూచు విపరీత భావన ఉన్నంతవరకు మనస్సులో భ్రాంతి నిండియున్నదని భావించాలి. భ్రాంతి ఉన్నంతవరకు జీవత్వం ఉంటుంది. జీవత్వం ఉన్నంతవరకు సత్యము ఎఱుకపడదు. భ్రాంతి మనస్సులో కనుపిస్తున్నందున మనస్సును శుద్ధిచేసి మనస్సులోని భ్రాంతిని తరిమివేసినచో సత్యము అనుభవమునకు అందును.

సత్యమును దర్శించలేని అయోమయ స్థితిలో అసత్యమును దర్శించుట జరిగినది. త్రాడును దర్శించలేక పోవుటచేత త్రాడు స్థానములో పాము గోచరించినది. పామును చూడగానే మెరుస్తున్న చర్మము, కదులుతున్న కోఱలు, మెదులుతున్న శరీరము, పైకిలేచిన శిరస్సు, ఆ శిరముపై చారలు, బుసలుకొడుతున్నట్లు శబ్దము అన్నీ ఒకదాని వెంబడి ఒకటి తెలియవచ్చినవి. ఇవన్నీ త్రాడులో ఎక్కడున్నవి? పాము మాత్రము ఎక్కడున్నది? లేని పామును కల్పించి చూపినట్లే ఇవన్నీకూడా కల్పించియే చూడబడినవి. పాము అనెడి అసత్యభావన ఎప్పుడయితే మనస్సులో స్థిరపడినదో, పాముకు సంబంధించిన



సమస్త లక్షణములు మనస్సులో గోచరించినవి. పామును దర్శించుటచే కలిగిన భయము ఎప్పుడు తీరును? రజ్జువును దర్శించినపుడే తొలగును. త్రాడును పామని భ్రమించుటచేత భయము కలిగినది. అలాగే తాను జీవుడని భావించుటచేత వ్యక్తి భయభ్రాంతులకు లోనగుచున్నాడని ఆచార్యులు తెలియజేయుచున్నారు.

త్రాడు తెలియకపోవుటచేత పాము తెలియునట్లు ఆత్మ తెలియక పోవుటచేత జీవత్వము ప్రాప్తించినది. వస్తు ప్రపంచముతో తాదాత్మ్యము చెంది కర్మ లాచరించుచు కర్తృత్వమును, మనోబుద్ధులతో తాదాత్మ్యము చెంది భోక్తృత్వమును కల్పించుకొని తద్వారా జనన మరణ సుడిగుండమునకు ఆహుతై, అనంత దుఃఖమును, భయమును అనుభవించుచున్నాడు. కార్య కారణత్వ భ్రమను చిత్రించుకున్నాడు. సర్పభ్రాంతిని తొలగించుకొను విధముగనే జీవభ్రాంతిని నివృత్తి చేసుకొనవలెను. రజ్జు జ్ఞానము చేత సర్పభ్రాంతి తొలగును. ఆత్మజ్ఞానము చేత అజ్ఞాన జనిత జీవత్వము అంతమగును.

**'యథా రజ్జు జ్ఞానాత్ సర్ప భ్రాన్తి నివర్తతే సహ తన్మూలేన భయేన**

**తథా బ్రహ్మ జ్ఞానా న్నివర్తతేవిద్యా సహైవ జనన మరణ భయేత్ '**

అని ఉపనిషత్తు తెలియజేయుచున్నది

భ్రాంతిని నిర్మూలించు ఆత్మజ్ఞానము కలుగవలెనన్నచో తాను సచ్చిదానంద స్వరూపమైన బ్రహ్మమని భావన చేయవలెనని ఆచార్యులు తెలియచేయుచున్నారు. అవిద్యా మోహితుడైన జీవుడు తాను దేహమని, ఇంద్రియములని, మనస్సని, బుద్ధియని ఒక్కొక్కసారి ఒక్కొక్క విధముగ ఆరోపించుకొంటూ భ్రాంతిని ధృవపరచుకొని రాబోవు జన్మలను తయారు చేసుకొనుచున్నాడు. అలాగాక బ్రహ్మ భావములో జీవించవలెను. నశించు దేహము తాను కాదనియు, చలించు ఇంద్రియములు తనకు సంబంధించినవి కాదనియు, చరించు మనస్సు తాను కాదనియు, సంచరించు బుద్ధి తన

స్వరూపము కాదని చింతన చేయవలెను. తాను నిత్యశుద్ధ బుద్ధ ముక్త స్వరూపమైన ఆత్మనని భావన చేసి, తత్త్వమసి వాక్యార్థము ద్వారా సత్యమును గ్రహించి జీవన్ముక్తుడై తరించవలెను.



అవతారిక:- ఇంద్రియ మనోబుద్ధులు ఆత్మ ప్రకాశమువలన చరించు చున్నవి. అవి స్వయం ప్రకాశములు కావు. ఈ విషయమును రాబోవు శ్లోకములో తెలుపుచున్నారు.

ఆత్మావ భాసయత్యేకో
బుద్ధ్యా దీనీంద్రి యాణ్యపి
దీపో ఘటాదివత్ స్వాత్మా
జడైస్తైర్నావ భాస్యతే ॥ 28

ఆత్మ = ఆత్మ, ఏకః = ఒక్కటియై, బుద్ధ్యాదీని = బుద్ధి మొదలగువానిని, ఇంద్రియాణ్యపి = ఇంద్రియములను కూడా, అవభాసయతి = ప్రకాశింపచేయు చున్నది, దీపః = దీపము, ఘటాదివత్ = కుండ మొదలగు వానిని, తైః =అట్టి, జడైః = జడములైన బుద్ధ్యాది ఇంద్రియములు, స్వాత్మ = తమకుతాముగా, నావభాస్యతే = ప్రకాశింపబడవు.

**భావము:- కుండ మొదలగు జడవస్తువులు దీపముచేత ప్రకాశింపబడినట్లు, ఇంద్రియ మనోబుద్ధులు ఆత్మచేత ప్రకాశింపబడుచున్నవి. జడములైన ఇంద్రియ మనోబుద్ధులు తమకు తాముగా ప్రకాశించలేవు.**

## వ్యాఖ్య

చైతన్యము లేనిచోట జ్ఞాన ముండదు. వస్తు ప్రపంచము నుండి విషయ జ్ఞానమును మనము పొందుచున్నాము. మనస్సు ఇంద్రియముల ద్వారా విషయ జ్ఞానము పొందుచున్నది. మరి ఇంద్రియ మనోబుద్ధులు చైతన్యవంతమైనవా? కావు. చైతన్యము కానపుడు జ్ఞానము నెలా పొందుచున్నవి? ఆత్మ చైతన్యము,



దేహేంద్రియ మనోబుద్ధులను ప్రకాశింపచేయుటచేత అవి విషయ జ్ఞానమును బడయుచున్నవి. చైతన్యమున్నచోటనే జ్ఞానము కలుగును. ఇటుకలో, పటికలో చైతన్యము లేనందున వానిలో జ్ఞానము తెలియుటలేదు.

దేహేంద్రియ మనోబుద్ధులు జడ స్వరూపము. వాటివెనుక చైతన్యము భాసించి సమస్తమును గ్రహించుచున్నది. ఆత్మలేనిచో బుద్ధ్యాది ఇంద్రియములు ప్రకాశించలేవు. చూచుట, వినుట, రుచిచూచుట మొదలగునవి చైతన్యమువలననే సాధ్యపడుచున్నవి. కనుక సమస్తమును గ్రహించుటకు జ్ఞాన స్వరూపమైన ఆత్మయే ఆధారమై యున్నది. ఆత్మ శక్తిపై ఆధారపడియే చెవి వింటున్నది. కన్ను చూస్తున్నది. మనస్సు ఆలోచిస్తున్నది. నాలుక మాట్లాడుచున్నది. బుద్ధి నిర్ణ యిస్తున్నది. ప్రాణాలు చరిస్తున్నాయి.

" శ్రోత్రస్య శ్రోతం మనసో మనోయద్
వాచోహవాచం స ఉ ప్రాణస్య ప్రాణః "

" చెవివెనుక చెవియై, మనస్సుకు మనసై, వాక్కుకు వాక్కుయై, ప్రాణానికి ప్రాణమై ఆత్మ భాసించుచున్నది " అని కేనోపనిషత్తు తెలియజేయుచున్నది.

కుండ మొదలగు జడవస్తువులు చీకటిగదిలో నున్నవి. దీపము ప్రకాశించుటచే ఆ వెలుగులో ఘటాది వస్తువులను గాంచుచున్నాము. దీపము వస్తువులను ప్రకాశింపచేయుటచేత మనకు వస్తువులు గోచరించుచున్నవి. జడమైన వస్తువులు తమకు తాముగా ప్రకాశించలేవు. అలాగే బుద్ధ్యాది ఇంద్రియములు ఘటాది వస్తువులవలె జడములు. జడమైన వస్తువులను దీపము ప్రకాశింపచేయునట్లు బుద్ధ్యాది ఇంద్రియములను ఆత్మ ప్రకాశింపచేయుచున్నది.

చైతన్యముచేత ప్రభావితమైన మనోబుద్ధులు బాహ్యజగత్తులో సకల వ్యవహారములను నడుపుచున్నవి. ప్రతిజీవియు తాను జీవించుటకు వలయు ప్రకాశమును ఆత్మనుండియే గ్రహించుచున్నది. గ్రహించిన తరువాత తమ వాసనల కనుగుణ్యముగా చరిస్తూ భిన్నమైన కర్మలాచరించుచున్నవి.

బల్బులు భిన్నరూపాలలో, రంగులలో ఉండవచ్చు. అన్నిటి ద్వారా పనిచేయు విద్యుచ్ఛక్తి ఒక్కటే గాని రెండు కానేరదు. బల్బుల ప్రకాశములో గోచరించు వ్యత్యాసమునకు బల్బుల స్థితియే కారణము గాని విద్యుచ్ఛక్తిలో మార్పులేదు. బుద్ధ్యాది ఇంద్రియములను ఆత్మ ప్రకాశింపచేయు చున్నదేగాని ఆయా స్థాయిలలో జరుగు కర్మలకు, ఆత్మకు సంబంధములేదు. బృందావనంలో శ్రీకృష్ణపరమాత్మ అచల సత్తా స్వరూపమై నిలబడి యుండ ఆ మహాత్ముని చుట్టు గోపికలు తిరుగుచు నృత్యము చేయునట్లు, ఆత్మ కదలిక లేనిదై యుండ, కదలికలేని, కదలిక తెలియని ఆత్మచుట్టూ బుద్ధ్యాదీంద్రియముల కదలికలు జరుగుచున్నవి. నీవు ఆత్మవు. ఈ సత్యము ఎఱుకపడితే చాలు. నిన్ను శోకమోహాదులు అంటలేవు. నీ మహా స్వరూపములో విశ్వము లేశమై మిగులుతుంది.

**మహోదధి రివాహం స ప్రపంచో వీచి సన్నిభః**

' నేనవెడి మహాసాగరములో ఈ ప్రపంచమొక తరంగమై యున్నది ' అని జనకమహారాజు అష్టావక్ర గీతలో తెలియజేస్తారు.



అవతారిక:- జ్ఞాన స్వరూపమైన ఆత్మను గ్రహించుటకు మరొక ప్రత్యేక జ్ఞానము అవసరములేదని తరువాత శ్లోకము తెలుపుచున్నది.

స్వబోధే నాన్యబోధేచ్ఛా
బోధరూపత యాత్మనః
న దీపస్యాన్య దీపేచ్ఛా
యథాస్వాత్మా ప్రకాశనే ॥ 29

బోధరూపతయా = జ్ఞానస్వరూపమగుటచే, ఆత్మనః = ఆత్మకు, స్వబోధే = తనను తెలిసికొనుటకు, అన్యబోధేచ్ఛా = మరియొక జ్ఞానావశ్యకము, న = అవసరములేదో, దీపస్య = దీపమునకు, స్వాత్మ ప్రకాశనే = తన ప్రకాశమును తెలుపుటకు, అన్యదీపేచ్ఛా = మరియొక దీపముయొక్క అవసరము, న = లేదో, యథా = ఏ ప్రకారము.



భావము:- దీపమును తెలిసికొనుటకు మరియొక దీపము అవసరము లేనట్లు, జ్ఞానస్వరూపమైన ఆత్మను తెలిసికొనుటకు మరొక జ్ఞానము అవసరములేదు.

## వ్యాఖ్య

సూర్యుని ప్రకాశము చేత ప్రపంచము మనము గాంచుచున్నాము. వస్తువులు కనబడుచున్నవి. వస్తువులను ప్రకాశింపచేయు ఆదిత్యుని గాంచుటకు మరొక ప్రకాశము అవసరములేదు. తానే స్వయంప్రకాశమై వెల్గొందుచున్నాడు. సూర్యుని ప్రకాశము కొరవడిన రాత్రి సమయములందు దీపముద్వారా మనము వస్తువులను దర్శించుచున్నాము. ఏ దీపకాంతి ద్వారా మనము వస్తువులను గాంచుచున్నామో ఆ దీపమును తెలుసుకొనుటకు మరియొక దీపము అవసరములేదు. దీపము తనకు తానుగా వెలుగుటచే దానిని గాంచుటకు రెండవ వెలుతురు అవసరము లేదు. అలాగే జ్ఞాన స్వరూపమైన ఆత్మను తెలుసుకొనుటకు మరియొక జ్ఞానము అవసరములేదని ఆచార్యులు తెలియ జేయుచున్నారు.

నేను నా నేత్రములద్వారా వస్తువులను గాంచుచున్నాను. సూర్య తేజముచేగాని లేదా చంద్రకాంతివలనగాని లేదా దీపపు వెలుతురుచే గాని వస్తువు ప్రకాశించుచున్నది. ప్రకాశించు ఆ వస్తువును దర్శించుటకు నా కనులలో ప్రకాశముండవలెనా; లేదా? అంధుడు దృశ్యములను గాంచగలడా? వస్తువు యున్ననూ, ఆ వస్తువు అలా వున్నదని గ్రహించుటకు నా కనులలో ప్రకాశముండవలెను. మరి చూచునది నేత్రములా? కాదు. చూచేందుకు నేత్రములున్నవి. మనస్సు నేత్రములద్వారా గాంచు చున్నది. జాగ్రదావస్థలో మనస్సు ఇంద్రియములద్వారా ఆయా విషయములను గ్రహించుచున్నది. స్వప్న మునందు బాహ్యాజగత్తుయొక్క ఎఱుకయే లేదు. స్థూలశరీరముముయొక్క అవసరమూ లేదు. సూక్ష్మ శరీరములో స్వప్నములు నడచుచున్నవి. మనోకల్పిత స్వప్నములను మనస్సే ద్రష్టయై గాంచుచున్నది. స్వప్నావస్థలో తెలియబడు

వస్తువులను ప్రకాశింపచేయు తేజస్సు ఏమిటి? సూర్యచంద్ర నక్షత్రాగ్నులు మాత్రము కాదు. ఆత్మ ప్రకాశము స్వప్నమును తేజోవంతము చేయుచున్నది. స్వప్నమును గాంచునది ఎవరు? మనస్సు. మరి మనస్సు జ్ఞానస్వరూపమా? కాదు. మనస్సు జడము. మనస్సుకు ప్రకాశము నిచ్చి నడిపించునది, మనస్సులో నడచు సంకల్ప వికల్పములను దర్శించునది చైతన్యమై యున్నది. మనోబుద్ధులు లయించిన అజ్ఞానదశలో అలా అజ్ఞానమున్నదని కూడా ఆత్మయే గ్రహించుచున్నది. దేహేంద్రియ మనో బుద్ధులద్వారా సర్వమును దర్శించునది ఆత్మయే అయియున్నది. దర్శించు తాను ద్రష్టయై యుండ దేహేంద్రియ మనోబుద్ధులు దృశ్యములై యున్నవి. దృశ్యములు నశించితీరును. దృక్చైతన్యము సత్యమై భాసించును. సత్యస్వరూపమైన ఆత్మ ప్రకాశమువలన దేహేంద్రియ మనోబుద్ధులలో జరుగు సకల వ్యాపారములు తెలియుచున్నది. ఏ ప్రకాశముచేత సకలము తెలియబడుచున్నదో అట్టి స్వప్రకాశ చైతన్యమును గాంచుటకు మరియొక చైతన్యదీపిక అవసరమా?

రాత్రులందు దీపము ఆరిపోగానే టార్చిలైటు వేయుదుము. టార్చిలైటు ద్వారా వస్తువులను తెలిసికొనెదము. అదే సమయానికి ఒక క్రొత్తవ్యక్తి వచ్చి నిన్ను పిలిచినచో మారు పలుకుదువేగాని, చీకటిలో నీ ఉనికిని శంకించి టార్చివేసి చూసుకొందువా? అన్యవస్తువులను చూచుటకు వెలుతురు కావలెనేగాని నిన్ను నీవు తెలుసుకొనుటకు మరియొక ప్రకాశము అవసరము లేదు. అలాగే ఆత్మ స్వప్రకాశ చైతన్యమై భాసించుటచేత ఆత్మను తెలుసుకొనుటకు మరియొక జ్ఞానము అవసరములేదు. అజ్ఞానముడి వీడితే చాలు. ఆత్మ అనుభవసిద్ధమై యున్నది. ఎప్పుడూ ఉన్నది. ఆది మధ్యాంతములు లేని అనుభవజ్ఞాన రూపమై యున్నది.

**అనాది మధ్యాన్తం సర్వగతం స్వయం ప్రకాశం బ్రహ్మైవేతి**

**ధృఢమతిః నిర్మలం జ్ఞానమ్ ॥**

'బ్రహ్మ మొక్కడే ఆదిమధ్యాంత రహితుడు, స్వయంప్రకాశుడని ఎవరికి ప్రగాఢ విశ్వాసమున్నదో అట్టిదియే స్వచ్ఛమైన జ్ఞానము' అని ఆనంద బిందు



ఉపనిషత్తు తెలుపుచున్నది. త్రికాలములందుండి, కాలాతీతమై మనుగడను సాగించునది ఆత్మ. అందుచే ఆత్మ సత్తు అని తెలియబడినది. మరి సర్వగతమైన ఆత్మ జ్ఞానస్వరూపమైనందున అది చిత్ అనికూడా తెలియబడుచున్నది. చిత్తు దేని లక్షణమై యున్నది? సత్పదార్థమైన ఆత్మకు సంబంధించినదై యున్నది. కనుక సత్తు చిత్తుకన్నా వేరుగా యున్నదా? అలా ఉండేందుకు వీలులేదు. మరి నీవెవరు? నీవు ఆత్మవైనందున సత్తు నీవై యున్నావు. చిత్కూడా నీవే అయియున్నావు. చిత్స్వరూపమైన నీవు జ్ఞానస్వరూపము. సకలమునకు ప్రకాశమును అందిం చువాడవు నీవే. నిన్ను నీవు గ్రహించుటకు మరియొక ప్రకాశము అవసరములేదు.

**' సత్త్వభాసికా చిత్క్వవేతరా**

**సత్తయాహి చిత్ చిత్తయాహ్యహం**

'సత్తును తెల్పుటకు చిత్తువేరుగా యున్నదా? సత్తుయే చిత్తు. చిత్తుయే నేను' అని శ్రీరమణమహర్షి తన ఉపదేశసార గ్రంథములో తెలియ జేశారు.

జ్ఞాన స్వరూపమైన ఆత్మ సత్తు అయినందున సర్వగతమై యున్నది. అవినాశియై యున్నది. దృశ్యములైన దేహాదులు నశించినను ఆత్మ సదా జ్ఞానస్వరూపమై భాసిస్తుంది. అట్టి అపూర్వ. అద్భుత, అనిర్వచనీయ అనంతాత్మ జ్ఞానమును పొందినవాడే బ్రహ్మజ్ఞాని.

**సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్**

**వినశ్యత్స్వ వినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి**

సర్వభూతములందు సమముగయున్న పరమేశ్వరుని, జీవుల దేహాదులు నశించినను నశింపనివానినిగ ఎవడు చూచుచున్నాడో అతడే నిజముగ చూచువాడగును' అని భగవద్గీత-క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగములో శ్రీకృష్ణపరమాత్మ తెలిపియున్నాడు.

అవతారిక:- స్వప్రకాశమైన ఆత్మజ్ఞానమును పొంది తరించవలెనన్నచో అందుకు అనుగుణ్యముగా చేయదగిన విచారణను రాబోవు శ్లోకములో తెలియ జేయుచున్నారు.

నిషిధ్య నిఖిలోపాధీన్
నేతినేతీతి వాక్యతః
విద్యాదైక్యం మహావాక్యైః
జీవాత్మ పరమాత్మనోః ॥ 30

నిఖిలోపాధీన్ = సర్వ ఉపాధులను, న ఇతి = ఇది కాదు, న ఇతి = ఇది కాదు, ఇతి = అని, వాక్యతః = శృతివాక్య విచారణచే, నిషిధ్య = త్రోసివేసి, జీవాత్మ = జీవాత్మ, పరమాత్మనోః = పరమాత్మ యొక్క, ఐక్యం = ఏకత్వము, మహావాక్యైః = మహావాక్యములచే, విద్యాత్ = గ్రహించవలెను.

**భావము:- నేతి-నేతి యను శాస్త్ర వాక్య సహాయముతో ఉపాధులను త్రోసిపుచ్చి, మహావాక్య ప్రతిపాదితమైన జీవ బ్రహ్మైక్యము నొంది తరించ వలయును.**

## వ్యాఖ్య

ఆత్మ హృదయగుహలో యున్నదని వేదాంతములో సాధారణముగా ఋషులు తెలియజేయుచుందురు. గుహలోయున్నది అనగానే గుహ వేరు అవి అర్థమగుచున్నది. ఆత్మను హృదయ గుహ కప్పి యున్నదని భావము. అదియే హృదయగ్రంధి. ఆత్మనుకప్పియున్న పొరలు అయిదున్నని. అవియే పంచ కోశములు. ఈ పంచ కోశములను విచారణతో వేరుచేసి మహావాక్య ప్రతిపాదితమైన జీవబ్రహ్మైక్యము నొందమని ఆచార్యులు ఈ శ్లోకంలో తెలియ జేయుచున్నారు.

అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములే పంచకోశములు.

అన్నమయ కోశమనగా స్థూల శరీరము. ఇందు కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు ఉండును.పాంచభౌతికమైన ఈ స్థూల శరీరమునకు ఆది,



అంత్యములున్నవి. అందుచే ఇది అనంతమైన ఆత్మ కానేరదు. శరీరము కార్య రూపములో గోచరమగుచున్నందున దీని వెనుక కారణముండాలి. కార్య రూపములో ఉండు శరీరములు అనేకములైనను, తద్వారా గలుగు అనుభూతులు భిన్నంగా యున్నను, కారణము దాని నంటియే యుండుటచేత భిన్న ఉపాధులలో కలుగు భిన్న అనుభవాలను గ్రహించుట జరుగుచున్నది. కనుక కార్యరూపమై, నశించు దేహము కారణరూపమైన చైతన్య మయ్యేందుకు వీలులేదు.

ప్రాణమయ కోశము శరీరముకన్నా సూక్ష్మమై, శరీరములో వ్యాపించి, ఇంద్రియములకు, దేహమునకు శక్తినిచ్చి అవి పనిచేయుటకు సహకరించును. ఈ ప్రాణమయ కోశము కూడ జడమైనందున, తెలుసుకొను ప్రజ్ఞ లేనందున ఇదికూడా ఆత్మ కానేరదు.

మూడవది మనోమయ కోశము. ఇందులో వృత్తులు కదులు చున్నవి. నేను-నాది అను అహంకార మమకారాదులు మనస్సు నందే కదులుచున్నవి. ఈ మనస్సు జాగ్రత్స్వప్నావస్థలయందే తెలియుచున్నది. సుషుప్తియందు గోచరించుట లేదు. అందుచేత మనస్సు పరిమితమై యున్నది. అలాగే బుద్ధికూడా సుషుప్తి నందు లయించిపోవుట చేత అదికూడా పరిమితమయ్యే యున్నది. మనోబుద్ధులు లయించినంత మాత్రాన మన మనుగడకు భంగం వాటిల్లుట లేదు. అందుచేత మనోమయ విజ్ఞానమయ కోశములు రెండూ ఆత్మ కానేరవు.

ఇక చివరిది ఆనందమయ కోశము. అదియే సుషుప్తి లేక కారణ శరీరము. ఈ స్థితిలో దుఃఖము లేదు. కానీ జ్ఞానము కూడా లేదు. అదియొక అజ్ఞానదశ. జ్ఞానములేని ఆనందమయ కోశము ప్రజ్ఞాన స్వరూపమైన ఆత్మ కానేరదు. సుషుప్త్యవస్థకు ఆద్యంతము లున్నందున ఇది పరిమితమై యున్నది. ఆనందమయ కోశమే ఆత్మమైనచో ఆత్మయొక్కఅనంతత్వమునకు భంగము వాటిల్లును. కనుక ఆనందమయ కోశము ఆత్మ కాదు.

పంచ కోశములను ఈ విధంగా విచారించి 'నేతి-నేతి' ఇది కాదు-ఇదికాదు అని త్రోసివేసినచో, ఇక మిగులున్న దేమిటో అదియే ఆత్మ యని

మహావాక్య విచారణ ద్వారా గ్రహించవలయునని ఆచార్యులు తెలియ జేయుచున్నారు.

మహావాక్యములు ఉపనిషత్తుల యందున్నవి. అవి నాలుగు మాత్రమే. 1. తత్త్వమసి 2. ప్రజ్ఞానం బ్రహ్మ 3. అహం బ్రహ్మాస్మి 4. అయమాత్మా బ్రహ్మ. ఈ నాలుగు వాక్యములలో ఏ వాక్యముపై విచారణను సాగించినను, ఉపాధులను త్రోసిపుచ్చి, ఉపాధిరహిత అభేద సత్తా స్వరూపములో ప్రవేశించి అమరులై తరించగలము.

మనస్సుతో మన మెంతగా ఆలోచించినను పంచకోశములకన్నా అన్యంగా మనకు ఏమీ గోచరించదు. గోచరించు పంచకోశములు సత్యము కాదు.అందుచేత మహావాక్య బోధద్వారా స్వరూపలక్షణ మెరిగి తరించాలి.

ఈ మహావాక్య చతుష్టయమునందు ఒక మహావాక్యమును గ్రహించి చర్చించెదము గాక!

## ' తత్త్వమసి '

ఈ మహావాక్యము ఛాందోగ్యోపనిషత్తు నందున్నది. ఉద్దాలక మహర్షి దీనిని తొమ్మిదిపార్లు ప్రవచించియున్నాడు. తన శిష్యుడైన శ్వేత కేతునకు ఆత్మబోధ చేయుచు ఈ మహావాక్యమును అందించినాడు.

'తత్త్వమసి' అను వాక్యములో 'తత్', 'త్వం', 'అసి' అను మూడు పదములున్నవి. "తత్" అనగా అది, "త్వం" అనగా నీవు, "అసి" అనగా అయియున్నావు అని అర్థము. ఈ వాక్యము జీవ బ్రహ్మల అభేద స్వరూపమును అందించు అమృత వాక్యమై అద్వైత సిద్ధాంతమును ప్రకాశింప చేయుటలో అమరదీపమై యున్నది.

"తత్త్వమసి" నీవే బ్రహ్మవు అనెడి వాక్యము ద్వైతులకు కర్ణ కఠోరముగా యుండును. జీవుడు బ్రహ్మము అయ్యేందుకు వీలులేదు అనేదే వారి పరిమితజ్ఞాన మందించు అపరిమిత వాదము.



భగవంతుడు సర్వజ్ఞుడు. జీవుడు అల్పజ్ఞుడు. జీవునకు జనన మరణాలు కలవు. భగవంతునికి లేవు. జీవుడు పరిమితుడు. భగవంతుడు అపరిమితుడు. జీవునకు ఉపాధి కలదు. భగవానుడు ఉపాధి రహితుడు. జీవుడు గుణసహితుడు. భగవంతుడు గుణరహితుడు. అందుచేత జీవుడు దేవుడయ్యేందుకు వీలులేదని వారి పిడివాదము.

## " సోయం దేవదత్తః "

' ఇతడే ఆ దేవదత్తుడు' అనెడి వాక్యముద్వారా మహర్షులు ఈ విషయాన్ని ఉపనిషత్తులలో చక్కగా పరిష్కరించారు.

"తత్-త్వం" అనునవి ఇద్దరిని సూచించుచున్నందున అద్వైతము పొసగదని ద్వైతుల సిద్ధాంతము. ఇతడే ఆ దేవదత్తుడు" అనెడి వాక్యము వారి సిద్ధాంతమును ఖండించుచున్నది.

"ఆ దేవదత్తుడు" అనగా ఆ కాలములో, ఆ ప్రదేశములో ఉన్నవాడని భావము. 'ఈ దేవదత్తుడు' అనగా ఈ కాలములో, ఈ ప్రదేశములో ఉన్నవాడని భావము. కాలము, ప్రదేశము ఇవియే అడ్డు నిలిచి అవగాహనను కుంటుపరచుచున్నవి. దేశ కాలాదులను తొలగించి చూసినచో ఇరువురు ఒక దేవదత్తుడే అయి యున్నారు. వీరిరువురికి సంబంధమున్నది. దీనినే సంబంధత్రయ మందురు.

మొదటి సంబంధము సమానాధికరణ్యము. 'ఇతడే ఆ దేవదత్తుడు' నందు "ఆ" అనగా గతములో ఉండినవాడని భావము. "ఇతడే" అనగా ఇప్పుడున్నవాడు అని అర్థము. ఈ రెండు ఒకే వ్యక్తిని సూచించుచున్నవి. అలాగే "తత్త్వమసి" వాక్యమునందు "తత్"అనగా ప్రాచీనమైనది. "త్వం" అనగా ప్రస్తుతమున్నది అని తెలియును. కానీ రెండును ఒకే చైతన్యమును సూచించుటచేత, రెండిటికి ఆధారము ఒకటే అయి యున్నందున సమానాధికరణ్యము " అను సంబంధము కలదు.

రెండవ సంబంధము "విశేషణ విశేష్యభావము". "సోయం దేవదత్తః" అను వాక్యమునందు 'స' 'అయం' అను రెండు పదములు గతానికి, వర్తమానానికి సంబంధించినవిమై పరస్పర వైరుధ్యము కలిగి యున్నవి. అయినను ఒకే వస్తువును సూచించుటలో సహకరించు కొనుచున్నవి. అలాగే "తత్త్వమసి" వాక్యములో 'తత్', 'త్వం' అనునవి గతంలోని, వర్తమానంలోని చైతన్యమును తెలియజేయుచున్నవి. వానికి పరస్పర వైరుధ్యమున్నది. అయినను ఒకే చైతన్యమును తెలియజేయుటలో ఈ రెండు పదములు పరస్పరము సహకరించుకొను చున్నవి. ఇదియే ' విశేషణ విశేష్య భావము.'

మూడవ సంబంధము 'లక్ష్య, లక్షణ భావము' 'సోయం' దేవదత్తః' అను వాక్యములో "స", 'అయం' మరియు వాని అర్థములలో గతము, వర్తమానమనెడి పరస్పర వైరుధ్యములను వేరుచేయగా మిగిలిన దేవదత్తుడు రెండింటికి సామాన్యమై యున్నాడు. అలాగే 'తత్త్వమసి" వాక్యార్థములో 'తత్', 'త్వం' మరియు వాని అర్థములలో గతము, వర్తమాన మనెడి పరస్పర వైరుధ్యములను వేరుచేయగా మిగిలిన 'అసి' రెండింటికి సామాన్యమై యున్నది. అదియే సత్తు.

జీవబ్రహ్మల సంబంధమును గుర్తించి, ఉపాధులను త్రోసిపుచ్చి లక్షణశాస్త్రము నెరిగి, భగత్యాగ లక్షణముద్వారా జీవబ్రహ్మైక్యము నొంది తరించవలయునని ఆచార్యులు తెలియజేయుచున్నారు.

అవతారిక:- దేహేంద్రియములు నీటిబుడగవలె అస్థిరమని; ఆత్మయే శాశ్వతమని రాబోవు శ్లోకములో తెలియజేయుచున్నారు.

**అవిద్యకం శరీరాది**
**దృశ్యం బుద్బుదవత్ క్షరమ్**
**ఏతద్విలక్షణం విద్యాత్**
**అహం బ్రహ్మేతి నిర్మలమ్ ॥**





శరీరాది = శరీరము మొదలగునవి, అవిద్యకం = కారణోపాధివరకు, దృశ్యం = దృశ్యములు, బుద్బుదవత్ = నీటిబుడగవలె, క్షరమ్ = నశించునని, అహం = నేను, నిర్మలం = పరిశుద్ధమైన, బ్రహ్మ = బ్రహ్మము, ఏతత్ = వానికి, విలక్షణం = వేరుయని, ఇతి = ఈ విధముగా, విద్యాత్ = తెలుసుకో;

**భావము:- అవిద్యచే ఆరోపించబడిన దేహేంద్రియాదులు నీటిబుడగ వలె నశించునవి. బ్రహ్మము వీటికి విలక్షణమైనది. అట్టి పరిశుద్ధ బ్రహ్మమును నేనే యని తెలుసుకో!**

## వ్యాఖ్య

సత్యమునకు సంబంధించిన అవగాహన కుదరగానే అసత్య జీవితమునకు స్వస్తి చెప్పడము జరుగుతుంది. సాధారణంగా శరీరము శాశ్వతమని భావించు వారలకు ఆత్మయొక్క నిత్యత్వము అర్థంకాదు. ఆత్మతత్త్వము అర్థం కాగానే శరీరత్రయము, తద్వారా పొందు అనుభవములు సర్వము అనిత్యమని బోధపడును.

ఆత్మయే సత్యము. జీవత్వము అజ్ఞానముచే ఆరోపించబడినది. జీవత్వ భ్రమ కలుగగానే స్థూల సూక్ష్మ కారణ శరీరములు అరుదెంచినవి.

కర్మేంద్రియములను, జ్ఞానేంద్రియములను పొంది జాగ్రదావస్థలో చరించు శరీరము స్థూలమనబడుతుంది. జాగ్రదావస్థలో స్థూలశరీరమును నడుపుతూ, స్థూలశరీరమును వదిలి స్వప్నావస్థలో తనలో తాను స్వాప్నిక జీవనమును సాగించు మనోబుద్ధులు సూక్ష్మ శరీర మనబడును. జాగ్రత్ప్రపంచములో చరించు స్థూలశరీరమునుండి, స్వప్నావస్థలో చరించు సూక్ష్మ శరీరమునుండి విడివడి ఏమీ తెలియని గాఢనిద్రలో అజ్ఞానముతో నిండియుండు సుషుప్త్యవస్థయే కారణ శరీరము.

స్థూల శరీరముద్వారా జాగ్రదనుభవములు పొందువాడు వైశ్వానరుడు. సూక్ష్మ శరీరముద్వారా స్వాప్నిక అనుభవములను పొందువాడు తైజసుడు. కారణశరీరము ద్వారా సుషుప్తిలో అజ్ఞానదశలో రమించువాడు ప్రాజ్ఞుడు. విశ్వతైజస ప్రాజ్ఞులకు ఆధారమైనది చైతన్యము. అదియే బ్రహ్మము.

అవస్థాత్రయములో ఏ అవస్థలో నున్నవానికి ఆ అవస్థకు సంబంధించిన జ్ఞానమే కలదు. చైతన్యమునకు అన్ని అవస్థలకు సంబంధించిన జ్ఞానమున్నది. కనుక తాను అన్యమై అవస్థాత్రయమును దర్శించుటచేత తాను విలక్షణమై యున్నది.

స్థూలశరీరము మొదలు కారణ శరీరమువరకు అవస్థాత్రయమును, తత్సంబంధిత పంచకోశములు ఆత్మచేత చూడబడునవియై యున్నందున దృశ్యములైనవి. ఏది దృశ్యమో అది నశించును గనుక స్థూలశరీరమునుండి కారణశరీరమువరకు తెలియబడు సంఘాతము, వాని అనుభవములు సర్వము నశించిపోయేవే యని గ్రహించాలి.అందుచేతనే ఆత్మకు అన్యమైన సమస్తము నీటిబుడగవలె నశించునని శ్రీ శంకరులు తెలియజేయుచున్నారు. ఈ విషయమును మననముచేసి దేహత్రయముపై భ్రాంతినివీడి నిర్మలమైన బ్రహ్మమును నేనే యని గ్రహించమని ఆచార్యులు హెచ్చరిస్తున్నారు.

అవస్థాత్రయము మారుచున్నందున దోషపూరితమై యున్నది. దీనికి విలక్షణమైనందున ఆత్మ పరిశుద్ధమై యున్నది. అహంకారము నశించగనే జీవత్వము తొలగి, బ్రహ్మభావము మదిని ఆవరించును.

**కళేబర మహంకార గృహస్థస్య మహాగృహమ్**
**లురత్వభ్యేతు వాస్థైర్యం కిమనేన గురోమమ ॥**

" ఈ శరీరమే గొప్ప భవనము. ఇందు అహంకారమనెడి గృహస్థు నివసించును. గురుదేవా! ఇది నశించనీ-లేదా చిరకాలముండనీ! నాకేమి సంబంధము?" అని విలక్షణమైన బ్రహ్మజ్ఞానమును గూర్చి మహోపనిషత్తు తెలియజేసింది.

♣

అవతారిక:- దేహేంద్రియములకు విలక్షణమైనదే ఆత్మ అని రాబోవు శ్లోకములో తెలియజేయుచున్నారు.

దేహాన్యత్వాన్నమే జన్మ
జరాకార్శ్యల యాదయః
శబ్దాది విషయస్సంగః
నిరింద్రియ తయానచ ॥



దేహాన్యత్వాత్ = శరీరమునకు అన్యమగుటచేత, మే = నాకు, జన్మ = పుట్టుక, జరా = ముసలితనము, కార్శ్య = పరిణామము చెందుట, లయాదయః = నశించుట, న = లేదు, నిరింద్రియతయా = ఇంద్రియములకు విలక్షణమగుటచేత, శబ్దాదివిషయైః = శబ్దాది విషయములతో, సంగః = సంగత్వము, న = లేదు, చ = మరియు,

భావము:- నేను దేహముకన్నా అన్యమగుటచేత పుట్టుట, విశీర్ణమగుట, పరిణా మము చెందుట, నశించుట మొదలగు వికారములు నన్ను అంటవు. నాకు ఇంద్రియములు లేనందున ఇంద్రియ విషయములతో నాకు సంగత్వము లేదు.

## వ్యాఖ్య

దేహము పుట్టింది కనుక పెరుగుతుంది. పెరుగుతుంది కనుక పరిణామము చెందుతుంది. పరిణామము చెందుతుంది కనుక క్షీణిస్తుంది. క్షీణిస్తుంది కనుక నశిస్తుంది. ఈ దేహమొక మలభాండము. స్వేద మూత్రాదులు నిండిన పాత్ర.

**నాస్తిదేహసమః శోచ్యో నీచో గుణ వివర్జితః**

' దేహమువంటి శోచనీయమైన, నీచమైన, గుణహీనమైన వస్తువు వేఱొండు లేదు' అని ఉపనిషత్తు ప్రవచించినది.

దేహాన్ని నేను చూస్తున్నాను. దేహంలో జరుగు మార్పులను గుర్తిస్తున్నాను. దేహము క్షీణించుచున్నట్లుకూడా నాకు తెలియుచున్నది. తెలుసుకొను నేను తెలియబడు వస్తువుకన్నా అన్యమైనవాడను. అందుచే నేను దేహమును కాను. నా దేహమే నేను కానపుడు నేను దేహము కానందున దేహబాధలు నావి కావు. కనుక వారి ఈ దేహమునకు సంబంధించినవారు నావారెలా అవుతారు? నేను దేహమునకు వృద్ధిక్షయాలు కూడా నాలో వికారమును కల్గించలేవు. దేహము నేను విలక్షణమైనందున శరీర గతులకు సాక్షినై యున్నాను. ఇంద్రియముల కానందున దేహము నందలి ఇంద్రియములు కూడా నేను కాను.

పనితనమును నేను గాంచుచున్నాను. ఇంద్రియములు మూగబోయినవనికూడా నేను గ్రహించుచున్నాను. నావల్ల దేహేంద్రియములు పనిచేయు చున్నవి. నా మనుగడకు అవి ఏవీ కారణముకావు. కాలేవు.

నేను ఇంద్రియములు నడచుటకు కారణమై యున్నాను. నాకు ఇంద్రియములు లేవు. నాకు ఇంద్రియములే లేనపుడు ఇంద్రియ విషయాలతో సంబంధమెలా వుంటుంది? కనుక విషయసుఖాలు నన్ను దరిచేర లేవు. శోకానికి నన్ను దరిచేర్ప లేవు.

ఈ విధముగా విచారణ సాగిన వ్యక్తిని మాయ మోసగించలేదు. మోహానికి గురిచేయనూలేదు. పూర్వము బృహద్రథుడను రాజుండెడివాడు. దేహము యొక్క, ఇంద్రియములయొక్క దోషములను చక్కగా మననము చేసినవాడై, తత్ఫలితముగా ఇంద్రియ సుఖాలనుండి విడిపడి తరించినట్లు మైత్రయనీయ ఉపనిషత్తు తెలియజేయుచున్నది.



అవతారిక:- దేహేంద్రియములు తాను కాదని గడచిన శ్లోకములో తెలియజేసిన ఆచార్యులు మనో ప్రాణములు కూడా తాను కాదని రాబోవు శ్లోకములో తెలియ జేయుచున్నారు.

అమనస్త్వాన్నమే దుఃఖ:  
రాగద్వేష భయాదయః  
అప్రాణోహ్యమనాః శుభ్ర  
ఇత్యాది శృతిశాసనాత్ ॥ 33

అమనస్త్వాత్ = మనస్సు కావందున, మే = నాకు, దుఃఖ = దుఃఖము, రాగ = అనురాగము, ద్వేష = ద్వేషము, భయాదయః = భయము మొదలగునవి, న = లేదు, అప్రాణః = ప్రాణములేదు, అమనాః = మనస్సు లేదు, శుభ్రః =శుద్ధము, ఇత్యాది = మొదలగునవి, హి = నిజముగా, శృతిశాసనాత్ = శృతులు చెబుతున్నవి.



భావము:- నేను మనస్సుకన్నా అన్యమగుటచేత దుఃఖము, అనురాగము, ద్వేషము, భయము మొదలగు వికారములు లేని వాడను. ఆత్మ ప్రాణ, మనస్సులకు విలక్షణమై, పరిశుద్ధమైనదని శృతి ప్రబోధము.

## వ్యాఖ్య

మనసొక మాయలమారి. ప్రపంచ ఇంద్రజాలమును సృష్టించినది మనస్సే. ద్వైత ప్రపంచమును సృష్టించినదీ, దైవభావమును చిత్రించినదీ మనస్సే. బంధమోక్షాలకు మనస్సే కారణమై యున్నది.

మనస్సుకు దూరముగా ప్రపంచము లేదు. మనము నిద్రించినపుడు మనలో స్వప్న జగత్తును సృష్టించిన దెవరు? మనస్సే. స్వప్న ద్రష్ట, స్వప్న దృశ్యము, స్వప్నానుభవము అంతా మనస్సే. మనసు కన్నా అన్యంగా ఏమియు లేదు. స్వప్నంలో ద్రష్ట, దృశ్యము, అనుభవము మనస్సే అయినచో జాగ్రత్త కూడా అంతే అందుచే ఈ ప్రపంచము మనోమాత్ర జగత్తని పిలువబడింది.

మనస్సు వికారములకు నిలయము. విచిత్రములకు ఆలయము. మనస్సెప్పుడూ ఊహల ఊయలలో సుఖదుఃఖ అంచులకు పయనిస్తూంటుంది. ఒక్కొక్కప్పుడు ఊహలు తారు కల్పనా పల్లకి ఎక్కి ఊరేగుతూంటుంది. ఒక్కొక్కప్పుడు ఊహలు తారు మారవుతుంటాయి. అనుకున్నవి జరుగకపోవడము, ఆశించనివి జరగడము జరుగుతుంది. అలాంటి సమయాలలో మనస్సు తీవ్ర ఆవేదనకు గురి అవుతుంది. అదియే దుఃఖము. మనస్సుకు ఇష్టా యిష్టములు వుంటాయి. ఇష్టమైన వస్తువు లేదా వ్యక్తి దగ్గరున్నచో రాగము, ఇష్టములేని వస్తువు లేదా వ్యక్తి దగ్గరైనచో ద్వేషము కలుగుతూ వుంటాయి. తాను ద్వేషించు వ్యక్తి వల్ల ప్రమాదము జరుగునేమో యనే భయముకూడా వెంటాడుతూనే ఉంటుంది.

మనస్సులో జరుగు వికారములను నేను చూచుచున్నందున నేను మనస్సుకన్నా అన్యమైనవాడను. గాఢనిద్రలో మనస్సు లయించింది. కానీ అధిష్ఠానమైన నేను లయించుట లేదు. నాచేత మనస్సు నడుపబడుచున్నది. మనస్సు నన్ను తెలుసుకోలేదు. మనో వికారములు నన్ను అంటవు. మనస్సు

వీక్షించునట్లే ప్రాణమునుకూడా వీక్షించు చున్నందున నేను ప్రాణము కూడా కాను. మనో ప్రాణములకు విలక్షణమైనవాడను. అవికార్య సత్తా స్వరూపమైనందున పరిశుద్ధమై యున్నాను.

మనస్సుతో తాదాత్మ్యము చెందుటచేతనే సమస్తమైన దు:ఖములు కల్గినవి. మనస్సును నిగ్రహించుట బహుకష్టము.

' మనో దుర్నిగ్రహం చలం '

అని భగవద్గీత ప్రవచించింది.

**ఇతశ్చేతశ్చ సువ్యగ్రం వ్యర్థమేవాభి ధావతి**
**మనోదూరతరం యాతి గ్రామే కాలేయకో యథా ॥**

' ఈ మనస్సు ఊరిలోని కుక్కవలె వ్యాకులతతో అటు ఇటు వ్యర్థముగ, దూరదూరముగా పరుగెత్తుచున్నది' అని ఉపనిషత్తు తెలియజేసినది.

కనుక బంధ హేతువైన ఈ మనస్సుతో తాదాత్మ్యము చెందక విచారణచేసి మనోప్రాణములకు విలక్షణమై, పరిశుద్ధమైన ఆత్మలో లయించి తరించవలెను.

❦

అవతారిక:- దేహేంద్రియాలకు మనోప్రాణాలకు ఆత్మ విలక్షణమైనదని గడచిన రెండుశ్లోకాలలో వివరించిన శ్రీశంకరులు రాబోవు శ్లోకములో ఆత్మను వివరించడానికి ప్రయత్నిస్తున్నారు.

నిర్గుణో నిష్క్రియో నిత్యో
నిర్వికల్పో నిరంజన:
నిర్వికారో నిరాకారో
నిత్యముక్తోఽస్మి నిర్మల: ॥ 34

నిర్గుణ: = గుణరహితుడు, నిష్క్రియ: = క్రియారహితుడు, నిత్య: = శాశ్వతుడు, నిర్వికల్ప: = వికల్పము లేనివాడు, నిరంజన: = నిర్మలుడు, నిర్వికార: = వికారములేనివాడు, నిరాకార: = ఆకారములేనివాడు, నిత్యముక్త: = శాశ్వతముక్తి నొందినవాడు, నిర్మల: = పరిశుద్ధుడు, అస్మి = నేనే.



భావము:- నేను నిర్గుణుడను. నిష్క్రియుడను. నిత్యుడను. నిర్వికల్పుడను. నిరంజనుడను. నిర్వికారుడను. నిరాకారుడను, నిత్యముక్తుడను. నిర్మలుడను.

## వ్యాఖ్య

ఆత్మయే నీవు. బహిర్ముఖమవుతున్న ఇంద్రియ మనోబుద్ధులను అంతర్ముఖంచేసి, ఆంతర్యములో ఉజ్జ్వలమై శోభించుచున్న ఆత్మను అనుభవమునకు తెచ్చుకొనవలెను. ఆత్మను గూర్చి ధ్యానము సాగించడము వలన ఆత్మకు సన్నిహితమై ఆత్మయే కాగలము. ఆత్మయొక్క లక్షణములను ఈ శ్లోకంలో తెలియజేసి, తద్వారా మనలను ధ్యాన జీవనములో దింపి, ఆత్మానందము నందించుటకు శంకరులు ప్రయత్నిస్తున్నారు.

' రసోవైస: '

ఆత్మ రసస్వరూపము. ఆనందస్వరూపము. ఈ రసానుభూతి నొందుటకు ఈ శ్లోకంలో తొమ్మిది మార్గములను శంకరులు తెలియజేస్తున్నారు. ఏ మార్గముగుండా పయనించినా తొమ్మిది మార్గములగుండా పయనించి పొందే ఫలము అందును. ఇదియే నవరసానుభూతి. యదార్థానికి ఇచ్చట తొమ్మిది రసాలులేవు. ఇది ఏకరసమే. పొందేమార్గాలు తొమ్మిది అని భావము.

ఆత్మ సర్వగతమైనది. అందుచేత దానికి గుణములు లేవు. మనస్సుతో తాదాత్మ్యము చెందుటవలన మనోధర్మాలు ఆత్మయందు ఆరోపించబడుటవలన ఆత్మ గుణసహితమని భ్రమ కలుగుచున్నది. మనస్సు ఆత్మ కానేరదు గనుక మనోజనితమైన త్రిగుణములు ఆత్మయందు లేవు. అందుచేత ఆత్మ నిర్గుణము (attributeless).

మనస్సులేనిదై గుణరహితమైనందున ఆత్మయందు కర్మాచరణకు ఆస్కారములేదు. ఆత్మ యొక్కటియే యున్నందున అది నిష్క్రియమై యున్నది. సూక్ష్మమైన ఆత్మలో కర్మ జరిగేందుకు వీలులేదు. ఆత్మవిదుడు

బాహ్యంలో కర్మలాచరించినట్లు గోచరించుచున్నను తనలో తాను ప్రశాంతాత్మమై నిష్క్రియుడై యున్నాడు. అందుచేత ఆత్మ నిష్క్రియము (Actionless).

నిర్గుణమై, నిష్క్రియమైన ఆత్మకన్నా రెండవ వస్తువు లేనందున అది నిత్యమై యున్నది. దేశ, కాల, వస్తు అపరిఛిన్నమై, మార్పు లేనిదై యున్నందున ఆత్మ నిత్యమైనది (Eternal).

ఆత్మ నిత్యమైనందున అందులో ఏవిధమైన వికల్పములు జరిగేందుకు వీలులేదు. మనోసంకల్పాలకు, ఆత్మకు సంబంధము లేనందున ఆత్మ నిర్వికల్పమై, ప్రశాంతమై యున్నది.

నిర్వికల్పమైన ఆత్మయందు ఏవిధమైన మాలిన్యము చేరే ప్రసక్తిలేదు. వాసనల పెనుగులాట ఆత్మలో కదలదు. అందుచే ఆత్మ పరిశుద్ధమై నిరంజనమై యున్నది (dirtless).

నిరంజనమైన ఆత్మ స్వరూపమునందు మార్పులు అవాంఛనీయ మైనందున, పరిణామరహితమైన ఆత్మ చైతన్యము నిర్వికారమై యున్నది.

నిత్యమై, సర్వగతమైన ఆత్మ వస్తువు కానేరదు. ఒక ప్రదేశానికి పరిమితంకాదు. వస్తువు కానందున నశించే ప్రసక్తి లేక నిత్యమైనది. నిత్యమైనందున సర్వగతము, సూక్ష్మము గనుక అరిమితమైనదియై నిరాకారమైనదియు (formless).

అట్టి ఆత్మ అఖండబోధస్వరూపము. ఏ జ్ఞానముచేత సకలమైన జ్ఞానములు తెలియుచున్నవో అదియే ఆత్మ. ఇది వస్తుజ్ఞానముకాదు, వస్తు రహిత చైతన్యము. ఇది సదా ఉండునదియే గాని వచ్చి పోవునది కాదు. అందుచేత ఆత్మ నిత్య ముక్త స్వరూపమై యున్నది (Ever-free).

నిత్య ముక్త స్వరూపమైనందున నిర్మలమైయున్నది (Pure) . ఈ విధమైన ఆత్మయే నేను. అదియే నీవు. ఇది నిర్విశేషము. నిరుపాధికము.



అవతారిక:- ఆత్మ యొక్క నిత్యత్వమును, సర్వవ్యాపకత్వమును రాబోవు శ్లోకములో కూడా తెలుపుచున్నారు.

అహ మాకాశవ త్సర్వం
బహి రంతర్గతోఽచ్యుతః
సదా సర్వ సమ స్సిద్ధః 35
నిస్సంగో నిర్మలోఽచలః ॥

అహం = నేను, ఆకాశవత్ = ఆకాశమువలె, సర్వం = అన్నిటిలో, బహిః = బయట, అంతః = లోపల, గతః = నిండియున్నాను, అచ్యుతః = నాశము లేని వాడను, సదా = నిరంతరము, సర్వసమః = సర్వత్ర సమముగా యుండు వాడను, శుద్ధః = పరిశుద్ధుడను, నిస్సంగః = సంగత్వము లేనివాడను, నిర్మలః = నిర్మలుడను, అచలః = చలనము లేనివాడను.

**భావము:-** నేను సమస్తమునందు ఆకాశమువలె లోపల బయట వ్యాపించి యున్నాను. నాశము లేనివాడను. సర్వత్ర సర్వ కాలములందు సమముగ యుండువాడను. సంగత్వము లేనివాడను. నిర్మలుడను. అచల స్వరూపుడను.

## వ్యాఖ్య

నేను ఆకాశమువలె అనంతుడను. ఆకాశము సమస్తమును తనలో ఇముడ్చుకొనును. తనను ఏదియు ఇముడ్చుకోలేదు. అది సూక్ష్మతరమైనందున అనంతమై ఉన్నది. సకలమును తనలో ఉంచుకొంటుంది. దేనికి అంటుకోదు. అందుచేత పంచభూతములలో సూక్ష్మమైన ఆకాశముతో ఆత్మను పోల్చుట వేదాంతములో తరచుగా గోచరిస్తుంటుంది.

**'ఆకాశం ఆత్మ'**

అని బృహదారణ్యకోపనిషత్తు తెలుపుచున్నది.

"ఆకాశాత్మా"

అని తైత్తిరీయోపనిషత్తు తెలియజేయుచున్నది.

" ఆకాశం బాహ్య శూన్యత్వాత్ "

' వెలుపలకు శూన్యమువలె ఉండుటవలన ఆకాశముతో ఆత్మను పోల్చిరి ' అని మహోపనిషత్తు తెలుపుచున్నది.

**యథాఽఽకాశస్థితో నిత్యం వాయు స్సర్వత్ర గో మహాన్**

**తథా సర్వాణి భూతాని మత్థానీత్యుపధారయ**

' సర్వత్ర సంచరించునదియు, గొప్పదియగు వాయువు సదా ఆకాశము నందున్నట్లు, సర్వభూతములు నాయందున్నవని గ్రహించు' అని శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీత-రాజవిద్యా రాజగుహ్య యోగమునందు తెలిపి యున్నారు.

"ఆకాశవ దనంతోఽహం "

వేను ఆకాశమువలె అనంతుడను' అని అష్టావక్రగీత తెలుపుచున్నది.

అయితే ఇక్కడ ఒక్క విషయమును గుర్తించాలి. ఆకాశము దృష్టాంతమే కానీ ఆకాశము ఆత్మ కానేరదు. ఈ విషయమును కూడా ఉపనిషత్తే తెలియజేసింది.

' అనాకాశంతు చిత్త్వతః '

"జ్ఞానస్వరూపమైనందున ఆత్మ ఆకాశముకంటే విలక్షణమైనది ' అని మహోప నిషత్తు నిర్ణయము.

కనుక ఆకాశమువలె ఆత్మ సర్వత్ర వ్యాపించియున్నది. సూక్ష్మమైన ఆకాశమునకు అంతములేదు. సూక్ష్మాతి సూక్ష్మమైన ఆత్మ కుండునా? అందుచే ఆత్మ అవినాశియై, అచ్యుతస్వరూపమై ఉన్నది.



అవినాశి గనుక సర్వగతమై ఉండవలెను. నిత్యమైనందున ఎల్లప్పుడు ఉండవలెను. అంతయు తనయందే యున్నందున దేనితోను దానికి ప్రత్యేక సంగత్వము లేదు. అందుచే నిస్సంగమై ఉన్నది కనుక నిర్మలమై ఉన్నది.

ఆత్మ సర్వగతమని తెలుసుకొన్నందున ఇక దీనిలో చలనము దర్శనీయము కాదు. చలించుటకు ఖాళీ ప్రదేశముండవలయును కదా! అంతయూ తానే వ్యాపించి, సమస్తములో నిండి నిబిడీకృతమైన ఆత్మ ఎక్కడికి కదలగలదు? ఎలా కదలగలదు? అందుచే అది అచలమై వున్నది.

అవతారిక:- అట్టి నిత్య, సర్వగతాత్మ నేనే అయి యున్నాను అని రాబోవు శ్లోకములో వివరించుచున్నారు.

నిత్యశుద్ధవిముక్తైం
అఖండానంద మద్వయం
సత్యం జ్ఞాన మనంతం యత్ 36
పరం బ్రహ్మోఽహమేవతత్ ॥

నిత్య = నిత్యమైనది, శుద్ధ = పరిశుద్ధమైనది, విముక్త = ముక్తమైనది, ఏకమ్ = ఒక్కటే అయినది, అఖండానందం = అఖండమైన సుఖము, అద్వయమ్ = రెండుకానిది, సత్యం = సత్యమైనది, జ్ఞానం = జ్ఞానస్వరూపమైనది, అనన్తం = అనంతమైనది, యత్పరం బ్రహ్మం = ఆ పరబ్రహ్మము, తత్ = అది, అహమేవ = నేనే.

**భావము:- నిత్యమై, శుద్ధమై, ముక్తమై, అఖండానందమై, ఏకమై, సత్యమై, జ్ఞానస్వరూపమై, అనంతమై భాసిల్లు పరబ్రహ్మము నేనై యున్నాను.**

## వ్యాఖ్య

మన స్వరూపమైన ఆత్మను ఈ శ్లోకంలోగూడా ఆచార్యులు వివరించుచున్నారు.కొందరికి ఈశ్లోకము పునరుక్తిగా గోచరించవచ్చు. There is no tautology in Vedanta. వేదాంతములో పునరుక్తి దోషములేదు.

దోషములేదు. అనంతమై, అనిర్వచనీయమైన అద్భుతాత్మను అనుభవమునకు తెచ్చుకొనుట సులభసాధ్యం కాదు. అద్వయమైన ఆత్మను గూర్చి పదేపదే శ్రవణము చేయుటయు, తదేకంగా మననము చేయుటయు అవసరమై యున్నది. అందుచేత ప్రేమమూర్తులైన శ్రీ శంకరులు అనేక దృక్పథములనుండి, అనేక కోణాలనుండి బోధ చేయుచున్నారు. బోధ స్వరూపమైన ఆత్మను గూర్చి బోధించుట సులభమైన పనికాదు.

అనిత్యమైన దృశ్యప్రపంచమునకు ఆధారమైనందున ఆత్మ నిత్యమై యున్నది. సంకల్ప వికల్పాదులు సాగించు మనస్సును సాక్షీభూతమై చూచుచున్నందున దేహేంద్రియ మనోబుద్ధులతో సంబంధం లేనిదై శుద్ధమై యున్నది. పంచ కోశాదులనుండి, దేహత్రయమునుండి విడిపడి యున్నందున ముక్తమైయున్నది. ఆనంద స్వరూపమైన ఆత్మ పరిణామరహితమై నిత్యమైయు న్నందున అఖండానందమై యున్నది. రెండవ వస్తువులేని నిరంజన స్వరూపమై యున్నందున అద్వయమై యున్నది. అద్వయ సత్తాస్వరూపము గనుక సత్యమై యున్నది. సత్యమైన ఆత్మచైతన్యమైనందున జ్ఞానమై యున్నది. సత్య జ్ఞానము లతో శోభించు ఆత్మ ఆనందమై యుండవలెను. అదియే పరబ్రహ్మ. నేను ఆ పరబ్రహ్మమునే అయియున్నాను అని ఆచార్యులు అద్భుతముగా నిర్వ చించారు.

**'దృక్ స్వరూపం గగనోపమం పరం**
**సకృద్విభాతం త్వజమేక మక్షరం**
**అలేపకం సర్వగతం యదద్వయం**
**తదేవ చాహం సతతం విముక్తం '**

**జ్ఞాన స్వరూపము, పరమం, ఆకాశమువలె నిరాకారము, నిత్య ప్రకాశము, అనాదియు, అద్వయము, సంగరహితము, సర్వగతము, ముక్తమునైన పరబ్రహ్మము నేనే" అని శ్రీ శంకరులు తన "ఉపదేశ సాహస్రి" అను గ్రంథమునందు తెలిపియున్నారు.**



అవతారిక:- నిరంతర బ్రహ్మభావనయే అజ్ఞానమును నిర్మూలించగలదని రాబోవు శ్లోకములో తెలియజేయుచున్నారు.

ఏవం నిరంతరభ్య స్తా
బ్రహ్మై వాస్మీతి వాసనా
హరత్య విద్యా విక్షేపాన్ 37
రోగానివ రసాయనం ॥

బ్రహ్మై = వాస్మి = నేనే బ్రహ్మమును, ఏవమ్ = ఈ విధముగా, నిరంతరభ్యస్తా = సదా అభ్యసించుటవలన, వాసనా = సంస్కారము, రోగాన్ = రోగమును రసాయనమ్ = ఔషధమ్, ఇవ = వలె, అవిద్యా విక్షేపాన్ = అవిద్యా విక్షేపములను హరతి = హరించును.

**భావము:- ఔషధముచే వ్యాధి నిర్మూలించబడినట్లు, నేనే బ్రహ్మమును అని సదా అనుసంధాన మొనర్చుటచే కల్గిన సంస్కారము అజ్ఞానమును నశింపజేయును.**

## వ్యాఖ్య

జీవభ్రాంతి మనలను బాధించుచున్నది. అనాదిగా అలవాటు పడిన ఈ జీవభ్రాంతి ఒక్కసారి ఉన్నపళంగా పొమ్మంటేపోదు. ప్రపంచము, యదార్థమని. శరీరము శాశ్వతమని భావించు జీవుడు వస్తుప్రపంచముతో నిర్విరామంగా రమిస్తూ సుఖదుఃఖాలనుభవిస్తుంటాడు. వస్తు ప్రపంచములో మనము ఎంతగా రమించుచుందుమో, అంతగా ప్రాపంచిక వ్యామోహములచే ఆకర్షితులగుదుము. ఇలా ఆచరించేకొద్ది చపలత్వము పెరుగుటయేగాని స్థిరత్వము లభించదు.

ఈ ప్రపంచ వ్యామోహములనుండి విడిపడినపుడే జీవికి శాశ్వతానందము లభించును. వ్యామోహములనుండి విడిపడవలెననిన, వ్యామోహములను కల్గించిన మనస్సునుండి విడిపడవలెను. మనస్సునుండి విడిపడగానే మనోజనిత వికారములు, అహంకార మమకారాదులు, రాగద్వేషాలు, సుఖదుఃఖాలు మనకు దూరమగును. ద్వంద్వములు ఆగిపోగానే, కోరికలు నిర్వీర్యంకాగానే, మనస్సులో

సంకల్పాలు అదృశ్యమై మనస్సు నిర్మలమగును. నిర్మలమగు మనస్సులో నిర్విషయానందము గోచరించును.

కనుక మనస్సులో వాసనలు లేకుండా చూచుకోవాలి. ఆలోచనలు కదలకుండా మనస్సును అరికట్టాలి. ఆలోచించునదియే మనస్సు. దానిలో ఆలోచనలు అదృశ్యమగునా? అసంభవము. అందుచేత మనస్సును దివ్యాలోచనలతో నింపాలి. బ్రహ్మభావన కలిగియుండాలి. అనాత్మ సంబంధమైన ఆలోచనలను దూరంచేసి, ఆత్మసంబంధమైన ఆలోచనలతో మదిని నింపాలి. అందుకు మార్గము 'నిరంతర బ్రహ్మధ్యానమే' నని ఆచార్యులు తెలియ జేయుచున్నారు.

సదాజీవత్వ భావన కలిగియుండుచేత మనము జీవులమే యనెడి నిశ్చయము నిర్ణయమైనది. అలాగే నిరంతర బ్రహ్మోపాసన చేత మనము బ్రహ్మమేయను ధృడభావనఏర్పడి, తరువాత ఆ భావన కూడా అనంతమైన బ్రహ్మ చైతన్యములో లయించిపోవును.

ఔషధ సేవనముచే దీర్ఘ వ్యాధులు కూడా నయమగునట్లు, నిరంతర బ్రహ్మ చింతనచే అనాదిగా వచ్చుచున్న అజ్ఞానము హరించిపోవునని శ్రీశంకరులు తెలియజేయుచున్నారు.

అవతారిక:- బ్రహ్మానుసంధానము చేయు పద్ధతిని రాబోవు శ్లోకములో తెలియ జేయుచున్నారు.

**వివిక్తదేశ ఆసీనో**
**విరాగో విజితేంద్రియ:**
**భావయే దేక మాత్మానం**
**తమనన్త మనన్య ధీ:** 38

**వివిక్తదేశే** = ఏకాంతమునందు, **ఆసీన:** = ఆసీనుడై, **విరాగ:** = రాగరహితుడనై, **విజితేంద్రియ:** = ఇంద్రియములను నిగ్రహించి, **తం** = అది, **ఏకం** = ఏకము,



**అనంతం** = అనంతమైన, **ఆత్మానం** = ఆత్మను, **అనన్యధీ:** = అనన్య చిత్తముతో, **భావయేత్** = ధ్యానించవలెను.

**భావము:- ఏకాంతమునందాసీనుడవై, విరాగివియై, ఇంద్రియములను అరికట్టినవాడవై, అనంతము, అద్వయమునైన ఆత్మను గూర్చి నిర్మలావధానముతో ధ్యానించవలెను.**

## వ్యాఖ్య

అసంఖ్యాకమైన ఆలోచనలతో చెదరగొట్టబడు మానవుడు బ్రహ్మాను సంధానము చేయుట బహు కష్టము. అందుచేత తాను కొన్ని నియమములను పాటించవలెను. నిర్ణయములను పాలించవలెను.

ఆత్మధ్యానము చేయుసాధకుడు ఏకాంతమునందు సాధన సాగించవలెను. ఏకాంతమనగా ఒంటరితనము అని భావముకాదు. ఏకాంతమనగా తనలో తాను ఉండుట. ఒంటరితనమనగా ఎవ్వరూ లేనిచోట ఉండుట. ఎవ్వరూ లేని నిర్జన ప్రదేశములో మనమున్నను, మనస్సు నిగ్రహించబడనిచో, ప్రతిసంకల్పమూ ఒకవ్యక్తియై మన అవధానమును కుంటుపరచును. అనురక్తిని అదృశ్యము చేయును. ఆసక్తిని మంటగలుపును. ప్రారంభదశలో ఉన్న సాధకునికి బాహ్య ఏకాంతము అవసరమై యున్నను, కాలక్రమేణ సాధన పురోగతిని నొందించి ఆంతరంగిక ఏకాంతమును అలవరచుకోక తప్పదు

ఏకాంత ప్రదేశమునందున్నంత మాత్రాన ధ్యానము జరుగదు. మనస్సులోని రాగములు త్రాచుపాముపలె బుసలు కొడుతూ విజృంభించి మనలను కార్యోన్ముఖులను చేయును. అందుచేత మనస్సులోని రాగములను అరికట్టి, రాగరహితుడై యుండవలెను.

బహిర్ముఖమగు ఇంద్రియములను దారి మళ్ళించి అంతర్ముఖము చేయవలెను. ఇంద్రియములను జయించినవానికే అతీంద్రియ జ్ఞానము కలుగును. ఇలా ఏకాంతమునందాసీనుడై, రాగరహితుడై ఇంద్రియ నిగ్రహము కలిగి ధ్యానమాచరించు ముముక్షువు అనంతము, అద్వయమునైన ఆత్మపై ధ్యానించవలెను. ఆత్మ ఒకటియేగాని రెండుకానిది.అందుచే అద్వయమైయున్నది.

అద్వయము గనుక అనంతమై యున్నది. అనంతమైన ఆత్మను ధ్యానించు మనస్సు అనంతమే కాగలదు. అనంతమును ధ్యానించు సాధకుడుకూడా అనంతమే యగును. అనంతము, అద్వయముయైన ఆత్మ అమరము గనుక తానూ అమరుడగును.

**"ఈశం తంజ్ఞాత్వాఽమృతా భవంతి "**

" ఆ ఈశ్వరుని తెలుసుకొని అమృతస్వరూపులగుదురు" అని శ్వేతాశ్వతరోపనిషత్తు తెలియజేయుచున్నది.

ఆత్మధ్యానము చేయువాడు ఆత్మయే కాగలడు గాన ఈ ఆత్మ ధ్యానమును నిర్మలావధానముతో కొనసాగించమని శ్రీశంకరులు తెలియజేయుచున్నారు. వికల్పములేని ధ్యానమై యుండునటుల చూచుకొనవలెను. బ్రహ్మభావన తప్ప అన్యసంకల్పాలు కదలకుండా సాధకులు జాగరూకులై యుండవలెను.

**" తైలధారవత్ సన్తతో అవిచ్ఛిన్న ప్రత్యయో ధ్యానమ్ "**

" తైలధారవలె, అవిచ్ఛిన్నముగా నడచు భావనయే ధ్యానము "అని శ్రీశంకరులు తన గీతాభాష్యంలో తెలియజేసియున్నారు.



అవతారిక:- దృశ్య ప్రపంచమును బుద్ధిద్వారా దూరంచేసి ఆత్మయందు రమించు ప్రక్రియను రాబోవు శ్లోకములో తెలుపుచున్నారు.

**ఆత్మన్యేవాఖిలం దృశ్యం**
**ప్రవిలాప్య ధియా సుధీః**
**భావయేదేకమాత్మానం**
**నిర్మలాకాశవత్సదా ॥** 39

**సుధీః = బుద్ధిమంతుడు, అఖిలం = సమస్తమైన, దృశ్యం = దృశ్యప్రపంచమును, ధియా = బుద్ధిచేత, ఆత్మనిఏవ = ఆత్మయందే, ప్రవిలాప్య = లయింపజేసి,**



ఏకం = ఏకమైన, ఆత్మానం = ఆత్మను, నిర్మలాకాశవత్ = నిర్మలాకాశము వలె, సదా = ఎల్లప్పుడు, భావయేత్ = ధ్యానించవలెను.

**భావము:- నిర్మలమైన బుద్ధిచేత దృశ్యప్రపంచమును అద్వయమైన ఆత్మయందు లయింపజేసి, నిర్మలాకాశమువలె ఆత్మను బుద్ధిమంతుడు సదా ధ్యానించవలెను.**

## వ్యాఖ్య

అనాత్మపై ఆసక్తి అంతరించినపుడే ఆత్మధ్యానము కొనసాగ గలదు. మనకు గోచరించు ఈ దృశ్యమాన జగత్తుకూడా అనాత్మయే. మనకు అనుభవముల నందించి మనకు ఆవేశమును, ప్రేరణను కల్పించు ఈ దృశ్య ప్రపంచము ఎండమావిలోని జలము వంటిది. ఈ జగత్తుకు ఒక ప్రత్యేక మనుగడలేదు. జగత్తు యదార్థమని భావించినంతవరకు అందలి వస్తువులు, వ్యక్తులు, అవి కల్పించు ఆనందము, ఆ ఆనందము నందుకొని అనుభవించు మన శరీరము అన్నియు నిత్యములై కన్పట్టును. జగద్భావమే భ్రాంతి. దానిని సాధకుడు విచారణతో తొలగించుకొని అద్వయమైన ఆత్మపై అఖండ ధ్యానమును కొనసాగించవలెను.

జగత్తుయొక్క అస్థిత్వము బయటలేదు. మనస్సులో యున్నది. అద్దము సందలి ప్రతిబింబములు అద్దముకన్నా అన్యముగా లేవు. అద్దము అదృశ్యము కాగానే అందలి ప్రతిబింబములు కూడా అంతమగును. అలాగే ప్రపంచము మనస్సులోనే యున్నది. మనస్సు లయించగానే ప్రపంచమూ లయిస్తుంది.

అయితే ఇక్కడొక పూర్వపక్షము అడ్డు నిలుచును. అద్దములో ప్రతిబింబము గోచరించుటకు, దానికి అన్యముగా బయట బింబమున్నది కదా? అలాగే మనోదర్పణములో విశ్వము ప్రతిబింబించినచో, ఆవిశ్వము మనస్సుకన్నా అన్యమనుగడను సాగించుచున్నట్లే కదా? అలాంటప్పుడు మనస్సు నశించినంత మాత్రాన విశ్వమెలా నశిస్తుంది?

ఈ పూర్వపక్షము స్వప్న దృష్టాంతముచేత నివృత్తి చేయబడుచున్నది. మనస్సులో స్వప్నమే గోచరించినది. మనస్సులో గోచరించిన స్వప్న దృశ్యము మనస్సుకన్నా అన్యమా? కాదు. మరి స్వప్న కాలంలో బయట గోచరించుచున్నట్లే తెలియుచున్నది కదా? స్వప్న జగత్తు మనసుకు బాహ్యంలో జరుగుచున్నట్లు గోచరించినా అది యదార్థానికి మనస్సులోనే జరుగుచున్నది. దృశ్యమైన స్వప్నము ఎలాగైతే మనస్సుకన్నా అన్యముగా లేదో, దృశ్యమైన జాగ్రత్ప్రపంచము కూడా మనస్సు కన్నా వేరుకాదు. నిద్రనుండి మేల్కొనగానే స్వాప్నిక జగత్తు మనోకల్పితమని తెలియులాగున, ఆత్మ సాక్షాత్కారము పొందగానే ఈ దృశ్యమాన జగత్తుకూడా మనోకల్పితమేనని, ఉన్నది అద్వయమైన ఆత్మ ఒక్కటియేనని తెలియగలదు.

**విశ్వం దర్పణ దృశ్యమాన నగరీ తుల్యం నిజాంతర్గతం**
**పశ్యన్నాత్మని మాయ యా బహిరివో ద్భూతం యథా నిద్రయా**
**యస్సాక్షాత్కురుతే ప్రబోధ సమయే స్వాత్మాన మేవాద్వయం**

" ఈ విశ్వమంతయు అద్దమునందు గోచరించు పట్టణమువలె ఆత్మయందే గోచరించుచున్నను, మాయచేత ఈ విశ్వము వెలుపల నున్నట్లు తెలియుచున్నది. నిద్రయందు కల్పించబడిన స్వప్న ప్రపంచమును మనము వేరుగా గాంచుచున్నట్లు తెలియుచున్నది. జ్ఞానోదయము కలుగగానే అభేద స్వరూపమైన ఆత్మ సాక్షాత్కరింపబడుచున్నది.' అని శ్రీ శంకరులు తన దక్షిణామూర్తి స్తోత్రములో తెలియజేసి యున్నారు.

ద్వైత ప్రపంచము సృష్టించు మనస్సును శుద్ధి చేయగనే బాహ్య జగత్తు అదృశ్యమగును. ఆ తరువాత అద్వయము అనంతమైన ఆత్మను గూర్చి విశాలముగా చింతించి, ఆకాశమువలె సర్వగతమైన ఆత్మలో మనస్సును లయింపచేసి, అఖండానంద చిన్మాత్ర స్వరూపమై తరించాలి.



అవతారిక:- నామ రూపాత్మకమగు ప్రపంచ బంధమును తొలగించుకొని ఆత్మానుభూతి నొందినవానికే శాంతి లభించునని రాబోవు శ్లోకములో తెలియజేయుచున్నారు.

రూప వర్ణాదికం సర్వం
విహాయ పరమార్థవిత్
పరిపూర్ణ చిదానంద 40
స్వరూపేణావ తిష్ఠతే ॥

రూపవర్ణాదికం = రూపము, రంగు మొదలగునవి, సర్వం = సకలమును, విహాయ = వదలిపెట్టి, పరమార్థవిత్ = పరమార్థమును గ్రహించినవాడు, పరిపూర్ణ = పరిపూర్ణమైన, చిదానంద స్వరూపేణ = చిదానంద స్వరూపమై విరాజిల్లును, అవతిష్ఠతే = ప్రకాశించును.

**భావము:- రూప వర్ణాదికములైన ప్రపంచ బంధమును త్రెంచుకొని, ఎవ్వడయితే పరతత్త్వము ననుభవించునో అట్టివాడు పరిపూర్ణ చిదానంద స్వరూపమె**

## వ్యాఖ్య

ఒక వస్తువు అయిదు లక్షణములను కలిగియుంటుంది. అవియే అస్తి, భాతి, ప్రియ, నామ, రూపములు. మొదటి మూడు అయిన అస్తి, భాతి, ప్రియాలు సత్యమైనవి. వీనినే సత్ చిత్ ఆనందమని అందురు. మిగత నామరూపములు రెండును కల్పిత జగత్తునకు సంబంధించినవి.

అస్తి అనగా ఉనికి. ఈ జగత్తులో ప్రతి వస్తువు మనుగడను పొగించుటలో బ్రహ్మయొక్క 'సత్' లక్షణమును తెలియజేయుచున్నది. తెలియచేయుటచే, 'చిత్' లక్షణమును కలిగియున్నది. ప్రతి వస్తువు ఎవరికో ఒకరికి సుఖమును అందించగలిగి యుండుటచేత 'ఆనంద' లక్షణమును కలిగి యున్నది. ఈ సచ్చిదానంద స్వరూపము సత్యము. నామరూపములు కల్పితములై అసత్య ములగుచున్నవి.

**'యదేతన్నామ రూపాత్మకం జగత్ తదాభాస మాత్రమ్'**

' నామరూపాత్మకమైన ఈ ప్రపంచము కేవలము అభాసయే' నని శివజ్ఞానామృతోపనిషత్తు తెలియజేయుచున్నది.

సముద్రమును గాంచినచో గంభీరముగా, ప్రశాంతముగా యుండును. అలలను దర్శించినచో అలజడి కలుగును. సచ్చిదానంద సాగరములో అగుపించి అదృశ్యమయ్యే అలలే నామరూపాలు. అలలను చూచు దృష్టికి స్వస్తిచెప్పి, సాగరమును దర్శించగనే శాంతి కలుగుతుంది. అలాగే ఏ వస్తువును వీక్షించినా దానిని పరిశీలనాత్మకముగా విశ్లేషించి నామరూపములను విసర్జించి, అస్తి, భాతి, ప్రియములను దర్శించగలిగితే అద్వైతానుభూతి కలుగుతుంది. ఈ విధముగా నామరూపములను విస్మరించగనే నామరూపాత్మకమైన జగత్తు మనస్సులో తొలగుతుంది. జగత్తు తొలగితే జగద్భ్రాంతి అంతరించిందని భావము. బంధములు సమూలంగా త్రెంచబడ్డాయి. ప్రపంచ బంధములు దూరము కాగానే ఇక మిగిలియున్న పరతత్త్వము తానే అయి పరిపూర్ణ చిదానంద స్వరూపమై భాసిల్లును. ఆత్మ ఆనందమైనందున తాను పరమానంద స్వరూపుడై ప్రకాశించును.

**ఆనంద స్వరూపం బ్రహ్మ! ఆనందమయం !**
**ఆనందఘనం! ఆనందమూర్తిం! ఆనంద విగ్రహం!**
**ఆనంద సాగరం! నిరతిశయానందం! పరమానందం!**
**అనన్తసుఖం! నిత్య సుఖం! అఖండ సుఖం !**

అని ఆనందబిన్దూపనిషత్ ఆత్మస్వరూపమును వివరించినది.

శ్రీ

అవతారిక:- పరమాత్మ చిదానంద స్వరూపము గనుక అందు త్రిపుటి దర్శనీయం కాదు అని తెలియజేయుచున్నారు.

జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ భేదః
పరేనాత్మని విద్యతే
చిదానందై క రూపత్వాత్
దీప్యతే స్వయమేవహి ॥





పరే = పరమమైన, ఆత్మని = ఆత్మయందు, జ్ఞాతృ = జ్ఞాత, జ్ఞాన = జ్ఞానము, జ్ఞేయ = జ్ఞేయము, భేద = భేదములు, నవిద్యతే = లేవు, చిదానందైక రూపత్వాత్ = చిదానంద స్వరూపమగుటచేత, హి = నిజముగా, స్వయమేవ = స్వతస్సిద్ధముగ, దీప్యతే = ప్రకాశించుచున్నది.

**భావము:- పరమాత్మ స్వరూపమునందు జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయములను భేదములు లేవు. చిదానంద స్వరూపమై వెల్గొందుటచే ఏ విధమైన భేదముల నంగీకరించక స్వతస్సిద్ధముగ భాసిల్లును. విరాజిల్లును.**

## వ్యాఖ్య

మనో బుద్ధులలో ప్రతిఫలించిన చైతన్యమే దృశ్యమైన జగత్తును తయారుచేసినది. జగత్తు తెలియబడుచున్నందున జ్ఞేయమైనది. తెలియబడు జగత్తును తెలుసుకొను మనస్సు జ్ఞాత. జ్ఞేయమును తెలుసుకొనుటకు జ్ఞాత కుపకరించునది జ్ఞానము. ఈ జ్ఞాతృజ్ఞేయ జ్ఞానములు మనోస్థాయిలో తెలియుచున్నవే గాని ఆత్మస్థాయిలో లేవు. దృగ్దృశ్యములు రెండూ భ్రాంతియే. శుద్ధ చైతన్యము మనస్సులో ప్రతిఫలించుటచేత కదులు మాయాచిత్రములే. గాఢ నిద్రయందు మనోబుద్ధులు లయించుటచేత ఈ త్రిపుటి లేదు. త్రిపుటి దృగ్దృశ్యభ్రమలో తెలియవచ్చు త్రిపుటి స్వప్నమువలె అసత్యము. త్రిపుటి మనోబుద్ధులలోనే తెలియవచ్చుచున్నది.మనోబుద్ధులు మనుగడను సాగించినను, లేదా లయించినను ఈ రెండు స్థితులను ప్రకాశింపచేయు చైతన్యము త్రిపుటిలో చేరక, ప్రకాశైక చైతన్యమై అలరారుచున్నది.

చైతన్యమునందు వస్తువులు లేవు. లోకములు లేవు. అది రెండుగాని ఒకటియై యున్నది. ఇదియే వస్తురహిత చైతన్యము. త్రిపుటి ప్రవేశించలేని పరంధామము. ఈ స్థితిని జాగ్రదావస్థలో కూడా అనుభవించ గలగాలి. మేలుకొన్న జాగ్రదావస్థలో కూడా నామరూపములను విస్మరించి అస్తి, భాతి, ప్రియమైన వస్తురహిత చైతన్యమును దర్శించ గలిగినచో అదియే జ్ఞానము. దీనినే 'జాగ్రత్ సుషుప్తి ' అందురు. ఇదియే జీవన్ముక్తుని జ్ఞానానుభూతి.

ఆత్మ వస్తురహిత చైతన్యమైనందున ఏ భేదములను అంగీకరించక స్వతస్సిద్ధమై భాసిల్లును. ఆత్మ, మనోబుద్ధులవలె ఆధారపడి ప్రకాశించునది కాదు అని తెలియజేయుటకు 'దీప్యతే స్వయమేవహి' స్వతస్సిద్ధముగా ప్రకాశించును అని ఆచార్యులు తెలియజేయుచున్నారు.

' స్వయం ప్రకాశమాన త్వాన్నాభాస ఉపయుజ్యతే'

'ఆత్మ స్వప్రకాశమైనందున తన ప్రకాశమునకు అన్యమైన దానిపై ఆధారపడ నవసరములేదు' అని శ్రీ విద్యారణ్యులవారు పంచదశిలో తెలియజేసిరి.



అవతారిక:- ఆత్మానుభూతి కలుగుటకు జ్ఞాన నిర్మథనాభ్యాస మను సాధనను తెలియ జేయుచున్నారు.

ఏవమాత్మారణౌ ధ్యాన
మథనే సతతం కృతే
ఉదితావ గతిర్జ్వాలా
సర్వాజ్ఞానేం ధనం దహేత్ ॥ 42

ఏవం = ఈ విధముగా, ఆత్మారణౌ = ఆత్మయనెడి అరణిలో, సతతం = సదా, ధ్యాన మథనే = ధ్యాన నిర్మథనము, కృతే = జరిగినచో, ఉదితావగతిః = జనించిన జ్ఞానమనెడి, జ్వాలా = అగ్ని, సర్వాజ్ఞానేంధనం = అజ్ఞానమనెడి సమస్త కట్టెలను, దహేత్ = దహించును.

భావము:- అంతఃకరణను అధరారణిగను, ఆత్మధ్యానమును ఉత్తరారణిగను ఉంచి మథనము కొనసాగించిన జ్ఞానాగ్ని పుట్టును. అట్టి జ్ఞానాగ్నియందు మనలోని అజ్ఞాన మనెడి కట్టెలు దగ్ధమగును.

## వ్యాఖ్య

ఆత్మధ్యానము ద్వారా బ్రహ్మానుభూతి పొందు ధ్యాన ప్రక్రియను ఒక చక్కటి ఉపమానము ద్వారా ఆచార్యులు తెలియజేయుచున్నారు. ఈ ధ్యాన ప్రక్రియ అధర్వణవేదము నందలి జ్ఞానకాండలో తెలియజేయబడి యున్నది.



ప్రాచీన కాలములో ఋషులు యజ్ఞయాగాదులు నిర్వహించెడి వారు. యజ్ఞకాలములో హోమవిధికి అవసరమగు అగ్నిహోత్రమును ఒక నిర్ణీతపద్ధతి ద్వారా పొందెడివారు. అదియే అగ్నిర్మథనము. అధరారణి యందు దూదిని ఉంచి ఉత్తరారణిని అధరారణిపై నుంచి మథనము జరుపగనే అగ్ని రగుల్కొని దూదిని అంటుకొనును. ఆ అగ్నితో హోమగుండములో అగ్నిని ప్రతిష్ఠించెదరు.

ఇచ్చట అంతఃకరణను అధరారణిగాయుంచి, ఆత్మధ్యానమును ఉత్తరా రణిగా యుంచి, ధ్యాన నిర్మథనాభ్యాసము గావించుమని శంకరులు తెలియ జేయుచున్నారు. ఈ ధ్యాన నిర్మథనాభ్యాసము వలన కలిగే అగ్నియే జ్ఞానము. ఈ జ్ఞానము అజ్ఞాన కట్టెలను దహించువేయునని, శ్రీ శంకరులు ధ్యానావశ్యకతను తెలియజేయుచున్నారు.

' జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం '

"జ్ఞాన మను అగ్నిచేత కర్మలు దహించబడును ' అని శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీత-జ్ఞాన యోగములో తెలియజేసిరి.

అవతారిక:- జ్ఞాన ప్రకాశముచే అజ్ఞానాంధకారము నశించునని తెలియ జేయుచున్నారు.

అరుణే నేవ బోధేన
పూర్వ సంత మసే హృత్
తత ఆవిర్భవేదాత్మ
స్వయమే వాంశు మానివ ॥ 43

అరుణేన = అరుణినిచే, పూర్వం = ముందే, సన్తమసే = సమస్త చీకటి, హృతే = నశించగా, అంశుమాన్ = సూర్యుడు, ఆవిర్భవేత్ = ఉదయించును, బోధేన = జ్ఞానముచే, ఆత్మా = ఆత్మ, స్వయమేవ = స్వయముగనే.

భావము:- అరుణోదయ కాంతిపుంజములచే అంతవరకున్న అంధకార మదృశ్యముకాగా తదనంతరము స్వచ్ఛమగు సూర్యకాంతి ప్రకాశించునట్లు జ్ఞానోదయం కాంతికిరణములచే అంతవరకున్న అజ్ఞానాంధకారము నశించగా, తరువాత ఆత్మ స్వప్రకాశమై రాజిల్లును.

## వ్యాఖ్య

అజ్ఞాన నివృత్తి-జ్ఞానప్రాప్తి కలుగు విధానమును ఆచార్యులు ఈ శ్లోకంలో చక్కగా వివరిస్తున్నారు. రాత్రి అంతయు చీకటిమయంగా యుండును. ఉషః కాలములో అంధకారము మెల్లగా అదృశ్యమగును. సూర్యుని కాంతిచేత చీకట్లు చెదరిపోవును. అయితే సూర్యుడు ఉన్నపళంగా ఉదయించడము, చీకట్లు ఒక్కసారి చెదరిపోవడము జరుగునా? అలాజరుగదు. చీకట్లు నెమ్మదిగా తొలగును. సూర్యోదయము కాకముందే అరుణోదయము కలుగును. అరుణోదయ కాంతి పుంజములచే అంతవరకున్న అంధకారము మెల్లమెల్లగా అదృశ్య మవుతూరాగా, సూర్యోదయంతో సంపూర్ణంగా చీకట్లు చెదిరి ప్రకాశము వెల్లివిరియును.

అలాగే ధ్యానజీవనము కొనసాగించువానిలో జ్ఞానోదయ కాంతి కిరణములు అంతవరకున్న అజ్ఞానమును అంతముచేయగా, తరువాత ఆత్మ స్వతస్సిద్ధముగా భాసిల్లును. ఆత్మ సాక్షాత్కారము కలుగక ముందే వ్యక్తిలో జ్ఞాన కిరణములు బయలుదేరును. ఈ జ్ఞాన కిరణములు అజ్ఞానాంధకార పొరలను మెల్లమెల్లగా తొలగించుచు రాగా, చివరగా దేదీప్యమానమై ఆత్మ ప్రకాశించును.

ధ్యానము పరిపక్వదశకు రాగానే ప్రశాంత జీవనము అలవడును. కోరికలు అంతరించును. రాగద్వేషాలు సమరసమగును. అభిమానము అదృశ్యమగును. అహంకారము అంతరించును. దేహభ్రాంతి సన్నగిల్లును. మనోవికారములు చెదరిపోవును. వెనుక రాజు వచ్చుచున్నాడని తెలియజేయుచు ముందు పరివారము వచ్చులాగున, ఆత్మసార్వభౌముడు అరుదెంచుటకు ముందు సద్గుణములు, శాంతి జీవనము మొదలగు పైన తెలిపినవన్నియు సమకూరును. ఇవియే అజ్ఞాన చీకట్లను పారద్రోలు తొలి ఉషస్సులోని జ్ఞానకిరణములు. ఆ తరువాత ఆత్మ సూర్యునివలె భాసించును.



అవతారిక:- జ్ఞానము స్వస్వరూపమేననియు, దానిని బాహ్యంలో వెతక వలసిన అవసరము లేదని రాబోవు శ్లోకములో వివరించుచున్నారు.

ఆత్మాతు సతతం ప్రాప్తోపి
అప్రాప్త వ ద విద్యయా
తన్నాశే ప్రాప్త వద్భాతి
స్వకంఠాభరణం యథా ॥ 44

ఆత్మా = ఆత్మకు, తు = నిజానికి, సతతం = ఎల్లప్పుడు, ప్రాప్తం = ప్రాప్తము, అపి = అయినను, అవిద్యయా = అవిద్యచే, అప్రాప్తవత్ = ప్రాప్తించనదిమై యున్నది, తన్నాశే = ఆ అవిద్య నశించగనే, స్వకంఠాభరణం = కంఠము నందలి ఆభరణము, యథా = వలె, ప్రాప్తవత్ = ప్రాప్తించినదిగా, భాతి = గోచరించుచున్నది.

**భావము:- ఆత్మ సదా ప్రాప్తమై యున్నది. అజ్ఞానముచే గోచరింపబడక యున్నది. అజ్ఞాన నివృత్తిచే కంఠము నందలి ఆభరణమువలె ఆత్మ సాక్షాత్కరింప బడుచున్నది.**

## వ్యాఖ్య

దేనిచే సర్వము పరివ్యాప్తమై యున్నదో, ఏది మరియొక దాని చేత పరిమితము చేయబడదో అదియే ఆత్మ అద్వయ సత్తాస్వరూపము. ఇదియే జ్ఞానస్వరూపమై యున్నది. తెలియబడు వస్తువులను ప్రకాశింపచేయు జ్ఞాన చైతన్యమై యున్నది. అది వస్తువులను తెలుసుకొనుచున్నందున వస్తుజ్ఞానము అని తెలుసుకొనుచున్నాము. వస్తుజ్ఞానము నుండి వస్తువు తొలగించబడినచో ఇక మిగిలియున్నది శుద్ధ చైతన్యము. అదియే ఆత్మ లేదా వస్తురహిత చైతన్యము (objectless awareness). ఈ జ్ఞానము మనకుండుటచేతనే వస్తుప్రపంచమును తెలుసుకొనుచున్నాము. ఈ జ్ఞానమే మన స్వరూపమై యున్నది. ఇది మరియొక జ్ఞానముచే తెలియబడదు. తన ప్రకాశమునకై మరియొక ప్రకాశముపై ఆధారపడి లేదు. తనపై తాను ఆధారపడియున్నది.

దీనినే 'వస్తుతంత్రము' అందురు. కనుక ఆత్మజ్ఞానము స్వతస్సిద్ధమై యున్నందున, పురుషుని ప్రయత్నముచేత పొందబడదు. దీనిని 'వస్తు తంత్రము' అందురు. ఆత్మ వస్తుతంత్రమేగాని, పురుషతంత్రముపై ఆధారపడిలేదు.

ఆత్మజ్ఞానమనగా ఉన్నదానిని తెలుసుకొనుటయేగాని అన్యమైన వానిని, మనముకాని వానిని తెలుసుకొనుట కాదు. ఆత్మ ప్రాప్త వస్తువుయేగాని, అప్రాప్తము కాదు. ఆత్మ అప్రాప్తమైనచో ప్రయత్నించి కర్మద్వారా పొందవచ్చు. ఆత్మ ప్రాప్తవస్తువైనపుడు పొందవలసినది ప్రయత్నముతో కాదు; జ్ఞానముతో. ఏ కారణముచేతనో మరచిన విషయమును జ్ఞాపకము చేసుకొనుటయే ఆత్మ జ్ఞానమును పొందుటలో కేంద్ర విషయమై యున్నది.

ఆత్మ ప్రాప్తవస్తువైనను, అప్రాప్తమైనట్లు తెలియుటచేత దానిని పొందుటకు ప్రయత్నము, సాధన చేయవలసి వస్తున్నది. ఇదియే అజ్ఞానము. ఉన్నది ఉన్నట్లుగా తెలియకపోవుటయే అవిద్య. అజ్ఞానము అంతరించగనే తెర తొలగించగా వస్తువు గోచరించినట్లు ఆత్మ స్వప్రకాశమై భాసిస్తుంది. ఇచ్చట మాతనముగా పొంది నదేమియూ లేదు. ఉన్నదానిని ఉన్నట్లుగా గ్రహించడమే జరిగినది. ఈ విషయమును ఒక చక్కని ఉపమానము ద్వారా శ్రీ శంకరులు ప్రస్ఫుట మొనరించినారు.

ఆత్మ మెడలోని ఆభరణమువలె, ప్రాప్తవస్తువు అని తెలియజేయుచున్నారు. మెడలో నగ యున్నది. పొరపాటున నగ పోయిందని భ్రమించడము జరిగింది. ఆ క్షణమునుండి నగను తిరిగిపొందేందుకు తీవ్ర ప్రయత్నములు సాగినవి. చిందులు త్రొక్కినా, గగ్గోలు పెట్టినా, యావత్ప్రపంచము తిరిగినా పోకనే పోయినట్లు తెలియుచున్న నగ లభ్యంకాదు. నగను కంఠమునందే ధరించి, బాహ్యంలో ఎన్ని కర్మలాచరించినా ఫలితం శూన్యము. ఇచ్చట కావలసింది జ్ఞానము. ఇది మరొకరు తెలియజేయుటచేత కలగాలి. ఆ తెలియజేయువాడు సద్గురువు.సద్గురు బోధతో అజ్ఞానము అంతమై, మెడలోనున్న నగ అలా ఉన్నదని తెలిపినట్లు, ఆత్మ ప్రాప్తమయ్యే యున్నదని గ్రహించ గల్గెదము. ఆత్మను గ్రహించుట యనగా ఆత్మయే తానగుట యని భావము. తాను ఆత్మ కాగానే సర్వమూ తన స్వరూపముగానే గోచరిస్తుంది. అదియే పరిపూర్ణ జ్ఞానవైభవము.



**సర్వభూతాంతరస్థాయ నిత్యముక్త చిదాత్మనే**

**ప్రత్యక్ చైతన్యరూపాయ మహ్యమేవ నమోనమః**

'సర్వభూతాంతరాత్ముడును, నిత్యముక్తుడును, జ్ఞాన చైతన్యుడును, అంతర్జ్యోతియును, ఆత్మయును నగు నాకు, నేను నమస్కరించుకొనుచున్నాను' అని వరాహోపనిషత్తు తెలిపినది.

❦

అవతారిక:- బ్రహ్మము అజ్ఞానముచే జీవుడుగా తెలియుచున్నాడు. జ్ఞానముతో బ్రహ్మను భూతి కలుగును అని తెలుపుచున్నారు.

స్థాణౌ పురుషవద్ భ్రాంత్యా
కృతా బ్రహ్మణి జీవతా
జీవస్య తాత్త్వికే రూపే
తస్మిన్ దృష్టే నివర్తతే ॥ 45

స్థాణౌ = స్థాణువునందు, పురుషవద్ = పురుషునివలె, భ్రాంత్యా = మాయచే, బ్రహ్మణి = బ్రహ్మలో, జీవతా = జీవత్వము, కృతా = కల్పించబడినది, జీవస్య = జీవునియొక్క, తాత్త్వికేరూపే = నిజరూపము, తస్మిన్ = ఆత్మలో, దృష్టే = దర్శించినపుడు, నివర్తతే = తొలగించబడుచున్నది.

**భావము:-** **స్థాణువులో పురుషుడు గోచరించు విధమున అజ్ఞానముచే బ్రహ్మము జీవుడుగా కనబడుచున్నాడు. బ్రహ్మమును తన నిజ స్వరూపముగా దర్శించగనే జీవత్వము తొలగించబడి బ్రహ్మము ఎఱుకపడును.**

## వ్యాఖ్య

సత్యమును దర్శించలేకపోవుటచేత ఏర్పడిన అజ్ఞానావరణ అసత్యమైన విక్షేపమును కల్పించి అద్వయమైన బ్రహ్మమునందు జీవత్వ భ్రాంతిని కల్గించినది. స్థాణువులో పురుషుని దర్శించుట జరిగినది. అచ్చట యున్నది స్థాణువేకాని పురుషుడు లేడు. స్థాణువులో పురుషుని దర్శించుట భ్రాంతి.

పురుషుడు స్థాణువులో త్రికాలములందును లేడు. పైగా స్థాణువు పురుషుడుగా మార్పుచెందుటయూ జరుగలేదు. స్థాణువు స్థాణువుగానే యున్నది.ఆధేయము గోచరించినంత మాత్రాన ఆధారము నందు మార్పులేదు.

స్థాణువులో పురుషుడు ఎంతవరకు గోచరించును? కొంతభాగము పురుషుడు, కొంతభాగము స్థాణువు గోచరించునా? అలా గోచరించేందుకు వీలులేదు. నిద్ర, మెలుకువ ఒకే కాలములో జరిగేందుకు వీలు లేదు. మేలుకొంటే నిద్రలేదు. నిద్రపోతే మేలుకొనుట యనునదుండదు. స్థాణువు అర్థమయితే పురుషుడు లేడు. పురుషుడు గోచరిస్తున్నంతవరకు స్థాణువు అర్థంకాదు. కనుక పురుషుడు తెలియునపుడు పురుషుని వ్యాపకత్వము స్థాణువు యొక్క వ్యాపకతయే అయియున్నది.

స్థాణువు పూర్ణమైతే పురుషుడు కూడా పూర్ణమే. ఇప్పుడు స్థాణువు వర్థము చేసుకొనవలెనని పురుషుని మార్చవలసిన పనిలేదు. మనస్సును మార్చితే చాలు. చూసే దృష్టిని శుద్ధిపరచితే చాలు. పురుష భ్రాంతి మనస్సులో తిష్ఠవేసి యున్నది. మనస్సులో భ్రాంతి తొలగితే స్థాణుదర్శన మవుతుంది.

" పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే "

' పూర్ణమునుండి పూర్ణమును తీసివేసినచో ఇక మిగిలినది పూర్ణమే కాగలదు' అని వేదములో శాంతిపాఠము నందున్నది. పూర్ణమైన స్థాణువు నుండి పూర్ణమైన పురుషుని తీసివేయగా ఇక మిగిలినది పూర్ణమైన స్థాణువే.

అలాగే అజ్ఞానముచేత బ్రహ్మము జీవుడుగా కన్పించుచున్నాడు. విచారణ ద్వారా స్థాణువువలె బ్రహ్మమును దర్శించినపుడు, జీవత్వము పురుషునివలె అదృశ్యమగును.



అవతారిక:- అజ్ఞానముచే దారితప్పిన మానవుని జ్ఞానము సక్రమ మార్గములో నడిపించునని రాబోవు శ్లోకము విశదపరచుచున్నది.

తత్త్వ స్వరూపాను భవా
దుత్పన్నం జ్ఞాన మంజసా
అహం మమేతి చా జ్ఞానం
బాధతే దిగ్భ్ర మాదివత్ 46



తత్త్వ స్వరూపానుభవాత్ = ఆత్మ స్వరూపానుభవముచే, ఉత్పన్నం = జనించిన, జ్ఞానం = జ్ఞానము. అహం = నేను, మమ = నాది, చ = మరియు, అజ్ఞానం = అజ్ఞానమును, బాధతే = నశింపచేయును, దిగ్భ్రమాదివత్ = దిక్కులు తెలియని అజ్ఞానమువలె.

**భావము:- దిక్కులు తెలియక పరిభ్రమించు మానవుడు విషయమును గ్రహించగనే పెడదారిని వదలి వేయునట్లు, ఆత్మజ్ఞానము నేను-నాది యను భ్రాంతిని అంతమొందించుచున్నది.**

## వ్యాఖ్య

అనాత్మను నిషేధించి, ఆత్మను సాక్షాత్కరింప జేసుకొనుటయే మానవుడు తన జీవితములో సాధించదగిన ఏకైక లక్ష్యము. స్వేచ్ఛ, శాంతి, ప్రేమలనెడి సచ్చిదానంద త్రివర్ణములతో కూడిన మోక్షపతాకమునే విశ్వపౌరుడైన మానవుడు ఎగురవేయాలి.

మోక్షము మన స్వరూపము అని గ్రహించాము. జీవభ్రాంతిలో ఈ సత్యము అర్థం చేసుకోలేని మానవుడు అక్రమ మార్గాలలో సంచరించి అశాంతికి గురియవుతున్నాడు.

మానవునికి సుఖశాంతులు కావాలి. సుఖాన్వేషణయే జీవి కర్మలకు ప్రేరణ, పునాదియై యున్నది తాను వాంఛించు ఆనందము ఆత్మపరమని గ్రహించలేక దు:ఖమయ ప్రపంచములో అన్వేషిస్తూ నిరాశాగాలుల మధ్య చెదర గొట్టబడుచున్నాడు. ఘ్రాణేంద్రియమును తృప్తిపరచవలెననెడి కోరికతో తుమ్మెద పుష్పములను చేరుతున్నది.

అలాగే చంపక కుసుమమును కూడా అఘ్రాణిస్తుంది. అక్కడే ప్రాణాలను వదులుతుంది. సువాసన కావాలి. మకరందము కావాలి. మంచిదే. అయితే చంపక పుష్పమువద్ద కాదు. అలాగే మానవునికి ఆనందం కావాలి. మంచిదే. అది నీ స్వరూపంకూడా. ఆత్మలో అన్వేషించు. అంతేగాని ప్రపంచమనే చంపక పుష్పమువద్ద కాదు.

ఆత్మజ్ఞానము కొరవడి, అజ్ఞానము ప్రాప్తించగనే అవిద్యా ప్రేరితుడైన జీవుడు దేహముతో తాదాత్మ్యము చెంది 'నేను' అనెడి అహంకారమును, ఆ దేహమునకు సంబంధించిన వ్యక్తులతో, వస్తువులతో తాదాత్మ్యము చెంది 'నాది' అనెడి మమకారమును తయారుచేసుకొను చున్నాడు. ఈ అహంకార మమకారాలే అభిమానమును అందించి, తద్వారా రాగద్వేషములను ముందుంచి, వీడని సంసారమును తగిలించుచున్నది. ఇదియే అజ్ఞానము. అజ్ఞానము ఆత్మజ్ఞాన ముతోనే అదృశ్యమగును.

దిక్కులు తెలియక పరిభ్రమించు మానవుడు సరియైన విషయమును అందుకోగానే పెడదారిని వదలిపెట్టునట్లు, ఆత్మజ్ఞానము ద్వారా అజ్ఞానజనిత అక్రమ సంచారము ఆగిపోవును అని ఆచార్యులు తెలుపుచున్నారు.

నూతనముగా ఒకవ్యక్తి పయనించునపుడు తాను చేరవలసిన స్థానమునకు మార్గము తెలియనపుడు, అతడు గమ్యము తెలియక పెడదారిని పడవచ్చు. అతనికి మరియొక వ్యక్తి ద్వారా సరియైన మార్గము సూచించబడినప్పుడు అతడు పెడదారిని వీడి సరియైన మార్గములో పయనించును. అలాగే అజ్ఞానముచే దారితప్పి నడక సాగించు మానవునికి గురుబోధ అందగనే నేను-నాది అనే అక్రమ మార్గాలలో పయనించు భ్రాంతి ప్రయాణమునకు స్వస్తి చెప్పి, ఆత్మజ్ఞాన పల్లకీలో అమరుడై ఊరేగును.



అవతారిక:- ఆత్మజ్ఞానము కలిగినచో సర్వము తనయందే గాంచగలడని తెలియ జేయుచున్నారు.

సమ్యక్ విజ్ఞానవాన్ యోగీ
స్వాత్మన్యే వాఖిలం జగత్
ఏకంచ సర్వమాత్మాన
మీక్షతే జ్ఞాన చక్షుషా ॥ 47

సమ్యక్ విజ్ఞానవాన్ = సమ్యక్ జ్ఞానము కలిగినవాడు, యోగి = యోగి, అఖిలం = సమస్తమైన, జగత్ = విశ్వమును, స్వాత్మన్యేవ = తన ఆత్మయందే, చ = మరియు, సర్వం = సమస్తమును, ఏకం = ఏకమును, ఆత్మానం = తన ఆత్మగా, జ్ఞాన చక్షుషా = జ్ఞాన నేత్రముచే, ఈక్షతే = దర్శించును.

భావము:- జ్ఞానవంతుడైన యోగి సమస్త ప్రపంచమును తన యందున్న దానినిగాను, సమస్తమును తన యాత్మగా జ్ఞాన దృష్టిచే దర్శించును.



## వ్యాఖ్య

సర్వము చైతన్యముచే పరివ్యాప్తమై యున్నది. ఈ జగత్తు ఉనికి చైతన్యముపై ఆధారపడియున్నది.

**'చైతన్యం వినా కించిన్నాస్తి'**

'చైతన్యము తప్ప రెండవ వస్తువు లేదు' అని నిరాలంబోపనిషత్తు తెలుపుచున్నది.

జగత్తును మనము గాంచుచున్నాము. జగత్తును గాంచుటకు మనలో వలయు శక్తి చైతన్యమై యున్నది. చైతన్యమునకు అవధి లేదు. పరిధి లేదు. చైతన్యము అద్వయము. ఉపాధులు వేరైనను చైతన్యము వేరు కాదు. కుక్క చైతన్యము, నక్క చైతన్యము, పండితుని చైతన్యము, పామరుని చైతన్యము అని ఇన్ని లేవు. తాను ఉపాధికి పరిమితుడు కాడని, పంచకోశములకు విలక్షణుడని తెలియగానే తాను చైతన్యమనెడి ఎఱుక కలుగును. తాను చైతన్యమైనందున, చైతన్యముచే పరివ్యాప్తమైన జగత్తును తన స్వరూపముగా దర్శించును. సమస్త ప్రపంచమును తనయందు దర్శించును. తనకు అన్యముగా రెండవ వస్తువును దర్శించలేడు. ఇదియే జ్ఞానదృష్టి.

**సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని**
**ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః**

"యోగయుక్తుడైనవాడు సమస్తమునందు సమదృష్టిగలవాడై తనను సర్వభూతము లందును, సర్వభూతములను తనయందున్న వానినిగా దర్శించును'

' అవి శ్రీకృష్ణపరమాత్మ, భగవద్గీత-ఆత్మ పంయమ యోగమునందు తెలిపి 'యున్నారు.

అవతారిక:- గోచరించు ఈ విశ్వము ఆత్మకన్నా అన్యముకాదని తెలియజేయుచున్నారు.

ఆత్మై వేదం జగత్సర్వం
ఆత్మనోఽన్యత్ న కించన
మృదో యద్వత్ ఘటాదీని
స్వాత్మానం సర్వమీక్షతే ॥ 48

ఇదం = ఈ, సర్వం = సమస్తమైన, జగత్ = విశ్వము, ఆత్మాఏవ = ఆత్మమే, ఆత్మనోఽన్యత్ = ఆత్మకన్నా వేరుగా, నవిద్యతే = లేదు, ఘటాదీని = కుండలు మొదలగునవి, మృద: = మట్టిమండి, యద్వత్ = అలాగే, సర్వం = సమస్తమును, ఈక్షతే = చూడబడుచున్నది, స్వాత్మానం = తన ఆత్మమే.

భావము:- కుండలు మొదలగునవి మట్టికంటెను వేరుకానట్లు, ఈ దృశ్యమాన జగత్తు ఆత్మకంటే అన్యంగాలేదు. ఉన్న దంతయూ ఆత్మయే.

## వ్యాఖ్య

కారణమునకు సంబంధించిన జ్ఞానము సమకూరినచో, కార్యముల యొక్క జ్ఞానము చక్కగా బోధపడును. బంగారుకు సంబంధించిన జ్ఞానమున్నచో, ఆభరణములు బంగారుకన్నా అన్యము కావని తెలియును. కారణమునకు సంబంధించిన జ్ఞానములో, కార్యములు కారణముగా గోచరించి అదృశ్యమగును. నామరూపములు అదృశ్యమై, అస్తి, భాతి,ప్రియములు . భాసిల్లును. కొన్ని సందర్భాలలో నామరూపములు అదృశ్యము కాకపోవచ్చు. రజ్జు సర్పన్యాయమునందు కారణమైన రజ్జువును తెలియగనే కార్యరూపమైన సర్పము నశించింది. కుండ విషయములో అలా లేదు. కారణమైన మట్టి అర్థమైనను, కార్యమైన కుండలో నామరూపములు సర్పమువలె అదృశ్యము కాలేదు.



రజ్జు సర్పభ్రాంతినందు అజ్ఞానమే ప్రధానమై యున్నది. రజ్జువుకు సంబంధించిన అజ్ఞానము ఆంతర్యములో ఏర్పడుటయేగాని, బాహ్యములో దానిపై ఏవిధమైన ప్రభావము లేదు. అది"నిరుపాధిక భ్రమ" అయినది. అందుచేతనే ఆంతర్యంలో అజ్ఞానము అదృశ్యము కాగానే బాహ్యంలో కార్యము అదృశ్యమై కారణము మిగిలింది. మరి ఈ కుండ విషయంలో ఆంతర్యములో కదిలిన నామరూప భ్రాంతియే గాక, బాహ్యంలో కుండకు నిమిత్తకారణమైన కులాలుడు ఉన్నాడు. ఇది "సోపాధిక భ్రమ" . అందుచేత కారణము తెలిసినను కార్యము నామరూపములతో కొనసాగుచునే యున్నది. అంతమాత్రాన మనకు నష్టము వాటిల్లదు. కార్యము గోచరించినంత మాత్రాన మన జ్ఞానమునకు భంగము వాటిల్లదు. బాహ్యంలో గోచరించు కార్యము కాదు మనలను బంధించునది; దానికి సంబంధించిన అక్రమ అవగాహన. అవగాహన శుద్ధిపడినపుడు కార్యము నామరూపములతో గోచరించినా, అదృశ్యమైనా మనకు బాధలేదు. రాదు.

మరియొక విషయమును పరిశీలింతము. రజ్జు సర్పన్యాయము "నిరుపాధిక భ్రమ" యైనందున కార్యము అదృశ్యమైనది. మృత్తికా ఘటము "సోపాధిక భ్రమ" యైనందున కార్యము అదృశ్యము కాలేదు. మరి "మరుమరీచికా" న్యాయ విషయమేమిటి? మృగతృష్ణలో నీరు యుండుట. ఈ భ్రాంతికి బాహ్యంలో కారణము లేనందున ఇది నిరుపాధిక బ్రమయే అగుచున్నది. కానీ భ్రమయేమో నిరుపాధికమై సర్పమువలె మృగతృష్ణ అదృశ్యం కావడములేదు. అయితే ఒక్క విషయమును మరువరాదు. ఎండమావి అను జ్ఞానము కలిగినచో అందులో జలపానము చేయుటకు వెళ్ళము. కనుక కార్యము ఉన్నదా? అదృశ్యమైనదా? అనేదికాదు సమస్య. చెడిన అవగాహన సరిపడినదా? లేదా? భ్రాంతి తొలగినదా? లేదా? అంతే.

కనుక మట్టి జ్ఞానమువలన కుండలయొక్క జ్ఞానము తెలిసినట్లు, ఆత్మజ్ఞానముచేత కార్యరూపమైన విశ్వము తెలియును. కుండలు మట్టికన్నా అన్యము కానట్లు, విశ్వము ఆత్మకన్నా అన్యముకాదు.

అవతారిక:- బ్రహ్మ చింతనము చేయువాడు బ్రహ్మమే కాగలడని తెలుపుచున్నాడు.

జీవన్ముక్తస్తు తద్విద్వా
న్పూర్వోపాధిగుణాన్ త్యజేత్
సచ్చిదానంద రూపత్వాత్
భవేద్భ్రమర కీటవత్ ॥ 49

జీవన్ముక్త: = జీవన్ముక్తుడు, తద్విద్వాన్ = ఆత్మజ్ఞానము కల్గి, పూర్వోపాది గుణాన్ = పూర్వ ఉపాధులను, గుణములను, త్యజేత్ = వదలిపెట్టి, సచ్చిదానంద రూపత్వాత్ = సచ్చిదానంద రూపమగుటచే, భ్రమరకీటవత్ = కీటకము తుమ్మెదగా మారునట్లు, భవేత్ = అగుచున్నాడు.

**భావము:- ఉపాధులను, గుణాలను విస్మరించిన ఆత్మజ్ఞాని జీవన్ముక్తుడగు చున్నాడు. తుమ్మెద యొక్క శబ్ద సంసర్గముచే కీటకము తుమ్మెదగా మారునట్లు, జీవుడు నిరంతర బ్రహ్మ చింతనచే బ్రహ్మముగా మారుచున్నాడు.**

## వ్యాఖ్య

ఉపాధికి తాను పరిమితుడనని భావించుటయే జీవత్వభ్రమకు కారణము. ఉపాధులను, గుణాలను విస్మరించినచో అట్టి నిర్మలాత్ముడు జ్ఞానమును పొంది బ్రహ్మజ్ఞాని యగుచున్నాడు. పరిణామశీలమైన ఉపాధులను తిలకించు తాను పరిణామరహితమైన చైతన్యమై యున్నాడు. గుణాలను ప్రదీపింప చేయుచున్నం దున, గదిని ప్రకాశింపచేయు దీపము గదికన్నను అన్యమైనట్లు, గుణాలను ప్రకాశింపచేయు తాను గుణములకు విలక్షణమై యున్నాడు.

నిరంతరము సదా సద్విలక్షణమైన బ్రహ్మమునుగూర్చి తదేకముగా చింతించుటవలన తాను బ్రహ్మమే కాగలడని ఆచార్యులు తెలియజేయ చున్నారు. అందులకు భ్రమరకీటక న్యాయమును ఉదహరించుచున్నారు.

తుమ్మెద కీటకమును తెచ్చి తాను నిర్మించిన మట్టి గూటిలో వుంచును. దానికి ద్వారముగా ఒక రంధ్రము ఒక వైపువనే యుండును. ఆ ద్వారముచెంత తుమ్మెద కూర్చొని కీటకమును పొడుచుచుండును. తుమ్మెదచేత



కుట్టించుకోలేక, అలాగని బయల్వెడలుటకు వేరొక మార్గము లేనందున లోపలనే భయకంపితమై, తుమ్మెదను గూర్చియే కీటకము తదేకముగా చింతించుచుండును. తుమ్మెదనుగూర్చి తదేకంగా చింతించుటచేత కీటకము తుమ్మెదగా మారిపోవును. ఇదియే భ్రమర కీటక న్యాయము. జీవుడుకూడా నిరంతరము బ్రహ్మచింతన చేయుట చేత తాను బ్రహ్మమే కాగలడు.

ఇక్కడ ఒక సంశయము బయలుదేరును. కీటకము భ్రమరమును గూర్చి భయముతో చింతించినది. జీవుడుకూడా భయకంపితుడై బ్రహ్మను చింతిం చవలెనా? ఇది కేవలము దృష్టాంతమే యని ముముక్షువులు మరువ కూడదు.

'నహి దృష్టాంతే సర్వసామ్యం'

ఉపమాన మనునది ఎప్పుడూ ఏకదేశమే. నిరంతర బ్రహ్మ చింతనము అను విషయమునకే మన మిక్కడ ప్రాధాన్య మివ్వవలెను.

అవతారిక:- మోహ సాగరమును దాటి, శాంతిని పొంది తరించు విధమును వివరించు చున్నారు.

తీర్త్వా మోహార్ణవం హత్వా
రాగద్వేషాది రాక్షసాన్
యోగీ శాంతి సమాయుక్తః 50
ఆత్మా రామో విరాజతే ॥

మోహార్ణవం = మోహ సముద్రమును, తీర్త్వా = దాటి, రాగద్వేషాది = రాగ ద్వేషములనెడి, రాక్షసాన్ = రాక్షసులను, హత్వా = చంపి, యోగి = జ్ఞాన యోగి, శాంతి సమాయుక్త: = శాంతితోకూడిన వాడై, ఆత్మారామ: = ఆత్మా రాముడై, విరాజతే = ప్రకాశిస్తాడు.

**భావము:- ఆత్మజ్ఞాని మోహ సాగరమునుదాటి, రాగద్వేషాది రాక్షసులను సంహరించి, అటు పిమ్మట శాంతిని పొంది ఆత్మారాముడై వెల్గొందుచున్నాడు.**

## వ్యాఖ్య

ఆత్మయైన తాను జీవుడని భ్రమ చెందుటయే మోహము. మోహము పాలైనవాడు సత్యమును అసత్యముగా దర్శించును. ఇదియే భ్రాంతి. వేదాంత పరిభాషలో దీనిని అధ్యాస అందురు.

' అతస్మిం స్త ద్బుద్ధి రధ్యాసః '

'అది కాని దానియందు దాని బుద్ధి 'అధ్యాస' యనబడుతుంది. అనగా స్థాణువునందు పురుషుని గాంచిన బుద్ధి.

మనస్సులో మోహ ముదయించగనే ప్రశాంతత ననుభవించు చుండిన అంతఃకరణ అశాంతికి నిలయమగును. మోహపూరితుడగు వాని మనస్సు రాగ ద్వేషములతో నిండియుండును. ఇవి సుఖదుఃఖములనెడి ద్వంద్వములను కల్పించి అనంత దుఃఖమును, అసంఖ్యాకమైన జన్మలను అందించును.

మోహము సాగరము వంటిది. అందుచే మోహార్ణవమని శ్రీ శంకరులు తెలియజేసినారు. ఈ మోహము సాగరమువలె అనంతము, అగాధము అని భావము. రాగ ద్వేషాదులు రాక్షసుల వంటివి. రాక్షసుల ముందు జీవించువానికి ప్రాణభయం తప్పదు. రాగద్వేషాల మధ్య కొనసాగువానికి ప్రతిక్షణమూ మరణమే. ప్రతిక్షణము జననమే. విచారణ ద్వారా మోహసాగరమును దాటి, రాగద్వేషాది రాక్షసులను హతమార్చిన వానికి శాంతి లభించును. శాంత స్వరూపుడైనవాడు ఆత్మవిదుడై, ఆప్తకాముడై, ఆత్మారాముడై వెల్గొందును.

ఈ శ్లోకమును చదువగానే దీని అంతరార్థము సామాన్యునికి కూడా అనాలోచితముగా అర్థమగును. ఆదికవి, అమరకవి, అమృత కవియైన వాల్మీకి మహర్షి యొక్క అద్భుత అపూర్వ సృష్టియైన రామాయణ వైభవము కనులకు కట్టినట్లు కన్పించుచున్నది.

రామునికి దూరమై సీత లంకలో వున్నది. సీతలేని రాముడు శాంతిలేని జీవుడు. రాముడు దాటిన సాగరమే జీవుడు దాటవలసిన మోహమహార్ణవము



రామునిచేత వధించబడిన రావణ కుంభకర్ణాది రాక్షసులే, జీవునిచేత వధించబడవలసిన రాగ ద్వేషాదులు. సీత రాముని చేరినట్లు, శాంతి జీవుని సమీపించాలి. పట్టాభిషిక్తుడైన రాముడు అయోధ్యరాముడు. సాక్షాత్కారము నొందిన జీవుడు ఆత్మారాముడు.

' సర్వేషు రమన్తే ఇతిరామః '

' అందరిలో రమించు దివ్య చైతన్యమే శ్రీరామచంద్రమూర్తి' ప్రతి ఒక్కరూ ఆత్మారాములై తరించాలనేదే వేదాంతాశయము.

అవతారిక:- ఆత్మారాముడైనవాడు అంతర్యములో అమరదీపమై వెల్గొందునని తెలుపుచున్నారు.

బాహ్యేఽనిత్య సుఖాసక్తిం
హిత్వాత్మ సుఖ నిర్వృతః
ఘటస్థ దీపవ త్స్వస్థః
స్వాన్త రేవ ప్రకాశతే ॥ 51

బాహ్యే = బాహ్యమునందలి, అనిత్య = అశాశ్వతములైన, సుఖాసక్తిం = విషయ సుఖానురక్తిని, హిత్వా = విడిచి, ఆత్మసుఖ నిర్వృత్తః = ఆత్మానందములో ఓలలాడుచు, ఘటస్థ = కుండయందలి, దీపవత్ -- దీపమువలె, స్వస్థ = స్వస్థతనొంది, స్వాతం రేవ = తనలోనే, ప్రకాశతే = ప్రకాశించును.

భావము:- సకల విషయానురక్తిని విడిచి, ఆత్మానందములో ఓలలాడు జీవన్ముక్తుడు కుండయందలి దీపమువలె అంతర్యములో ప్రకాశించును.

## వ్యాఖ్య

ఆత్మకన్నా అన్యవస్తువును నీవు ప్రేమించినను, ఆరాధించినను, దానిని నీవు పోగొట్టుకొనుట సత్యము. అది నిన్ను ఘోరముగా విలపింపజేయుట

అంతకన్నా సత్యము. ప్రాపంచిక విషయములయందు, వస్తువుల యందు భ్రాంతిని కలిగి, అవి ఆనంద ప్రదములని భావించి, వాటిని పొందుటకు ప్రయత్నిం చుదుము. కానీ అవి దుఃఖస్వరూపములని గ్రహించలేము. విషయములు, వస్తువులు తమకు తాముగా ఆనందమును పంచలేవు. ఉంచలేవు. సుఖదుఃఖాలనేవి మన మనస్సుపై ఆధారపడి ఉంటాయి. వస్తువుపై మనస్సు మారగనే ఆ వస్తువు నిర్వీర్యమై నిలబడుతుంది.

అనిత్యమై, ఆవేదన పూరితమైన విషయసుఖాల యందలి ఆసక్తిని విడచి జీవన్ముక్తుడై కుండయందలి దీపమువలె ప్రకాశించమని ఆచార్యులు తెలియ జేయుచున్నారు.

చైతన్యము సర్వత్ర వ్యాపించియున్నది. చైతన్యమునకు బయట లోపల అనేది ఉండదు. ఇది ఉపాధి స్థాయినుండి జరిగిన నిర్ణయము. అయితే ఇక్కడ ఒక్క విషయమును జాగ్రత్తగా పరిశీలించి అవగతము చేసుకొనవలెను. విద్యుత్తు ప్రకాశము నివ్వగలదు. అయితే పరికరమైన బల్బు ఉండాలి. టార్చ్‌లైటును చీకటిగదిలో వేసినపుడు గదిగోడలు, గదిలోని వస్తువులు తెలియగలవు. అదే టార్చిని రాత్రులందు ఆకాశములో వేసినచో కాంతి కన్పించదు.అంత మాత్రాన కాంతిలేదని చెప్పేందుకు వీలులేదు. చైతన్యము సర్వత్ర ఉన్నది. అలాగే ఈ దేహమనే కుండలోనూ. ఉన్నది. మరి లోపల అని ఎందుకు చెప్పవలెను? తెలుసుకొను బుద్ధి లోపల యున్నందువ లోపల అని చెప్పబడినది.

మనలోని ఇంద్రియములను, దేహమును, మనోబుద్ధులను, జ్ఞానమును, అజ్ఞానమును నీదయితే ప్రకాశింపచేయుచున్నదో అదియే ఆత్మ. విశ్వ వెలుగునకు సైతము ఈ ఆత్మయే కారణమై ప్రకాశైకస్వరూపమై యున్నది.

'నానాచ్ఛిద్ర ఘటోదర స్థితమహా దీప ప్రభా భాస్వరం
జ్ఞానం యస్యతు చక్షురాది కరణ ద్వారా బహిస్స్పందతే
జానామీతి తమేవ భాంత మనుభాత్యేతత్ సమస్తం జగత్'



'అనేక రంధ్రములు గల (నవరంధ్రములు) ఒక కుండయందుంచిన పెద్ద దీపముయొక్క ప్రకాశమువలె ఏ జ్ఞానము జ్ఞానేంద్రియముల ద్వారా వెలుపల వ్యాపించుచున్నదో అట్టి స్వయంప్రకాశమై వెల్గొందు ఆత్మవలననే ఈ విశ్వమంతయు ప్రకాశించుచున్నది' అని ఆచార్యులవారు దక్షిణామూర్తి స్తోత్ర ములో తెలిపియున్నారు.



అవతారిక:- ఆత్మజ్ఞాని సకలమునకు విలక్షణుడని రాబోవు శ్లోకములో వివరించుచున్నారు.

ఉపాధి స్థోపి తద్ధర్మై
రలిప్తో వ్యోమ వన్మునిః
సర్వ విన్మూఢ వత్తిష్ఠే
దసక్తో వాయు వచ్చరేత్ ॥ 52

ఉపాధి స్థోపి = ఉపాధులలో ఉండినను, వ్యోమవత్ = ఆకాశమువలె, తద్ధర్మైః = వాటిధర్మములచే, అలిప్తః = అంటకుండును, ముని: = మననశీలుడు, సర్వవిత్ = సర్వవిదుడు, మూఢవత్ = మూర్ఖునివలె, తిష్ఠేత్ = మెలగును, వాయువత్ = వాయువువలె, అసక్త = నిస్సంగుడై, చరేత్ = సంచరించును.

భావము:- ఉపాధులలో వసించుచున్నను ఆత్మజ్ఞాని ఆకాశమువలె ఉపాధి ధర్మములకు అంటకుండును. సకలము తెలిసినను ఏమియు తెలియని వానివలె మెలగును. నిస్సంగుడై గాలివలె సంచరించును.

## వ్యాఖ్య

జ్ఞానికి ఉపాధి యనునది లేదు. అది చూచువారికి మాత్రమే యున్నది. ఘటములో ఘటాకాశము అందును. ఆకాశానికి ఘటము ఉపాధియా? ఘటము కూడా ఆకాశములోనే తయారైనది. ఆకాశమును ఉంచిన దెవరు? ఘటము కూడా ఆకాశములోనే తయారైనది. అలాగే జ్ఞానికి ఉపాధిలేదు. ఉపాధులు కూడా జ్ఞానియందే ఉన్నవి. అందుచేత ఉపాధి ధర్మములు జ్ఞానిలో అగుపించవు.

సకలము తెలిసినను ఏమియు తెలియని వానివలె మెలగును. సకలము తెలియుట అనగా సకలము ఆత్మగా తెలియుట అని భావము. ఆత్మ దర్శనము చేయువాడు ఆత్మయే అయినందున, ఆత్మలో హెచ్చు తగ్గులు, జ్ఞానాజ్ఞానములు లేనందున, తాను తెలియనివానివలె యుండును. అదియును గాక తనకు తెలిసిన ఆత్మజ్ఞానము అనిర్దేశ్యమైనందున తెలియనివానివలె యుండును.

గాలివలె నిస్సంగుడై యుండును. గాలి సుగంధముపై వాలును. సకలమును స్పృశించును. కానీ దేనికి అంటదు. జ్ఞాని అలాగే గాలివలె నిస్సంగుడై సంచరించును. ఎవనినైతే వస్తువులు ప్రేరేపించలేవో, ఉద్రేకములు రెచ్చగొట్టలేవో, సంకల్పాలు కదిలించలేవో అతడే ఆత్మ జ్ఞాని. అతడే స్థితప్రజ్ఞుడు. అతనిలోని ఆనందము పెరిగేదికాదు. తరిగేదికాదు. ఆత్మను అనుభవించిన వాడైనందున అతనికి శక్తి తేజము ఉన్నవి.

**'ఆత్మనా విన్దతె వీర్యం విద్యయా విన్దతేఽమృతమ్'**

'ఆత్మజ్ఞాని ఆత్మద్వారా ఆత్మబలాన్ని పొందుతాడు. విద్య ద్వారా అమృతత్వమును పొందుతాడు' అని కేనోపనిషత్తు తెలియజేయుచున్నది.

**అవతారిక:-** ఉపాధి అంతరించగనే ఆత్మజ్ఞాని సర్వవ్యాపిమైన చైతన్యములో లయిం చును అని తెలుపుచున్నారు.

ఉపాధి విలయా ద్విష్ణౌ
నిర్విశేషం విశేన్మునిః
జలే జలం వియద్వ్యోమ్ని
తేజస్తేజసి వాయథా ॥ 53

**మునిః** = ఆత్మజ్ఞాని, **ఉపాధి విలయాత్** =ఉపాధులు నశించగనే, **విష్ణౌ** = సర్వగత చైతన్యములో, **నిర్విశేషం** = పూర్ణంగా, **విశేత్** = కలియును, **జలే** = జలములోకి, **జలం** = జలము, **వియత్** = ఆకాశము, **వ్యోమ్ని** = ఆకాశము లోకి, **తేజః** = వెలుతురు, **తేజసి** = తేజములోకి, **వా** = మరియు, **యథా** = వలె.



**భావము:-** జలము జలమునందును, ఆకాశము ఆకాశమునందును, అగ్ని అగ్నియందును కలిసిపోవు విధముగా ఉపాధులు నశించగనే ఆత్మజ్ఞాని సర్వగతమైన చైతన్యములో ఐక్యమగును.

## వ్యాఖ్య

యదార్థానికి ఆత్మజ్ఞానికి ఉపాధి లేకున్నను చూచువారికి యున్నట్లు గోచరించుచుండును. ఉపాధి అంటూ వుంటే అది ప్రారబ్ధాధీనమై యుంటుంది. ప్రారబ్ధం తీరిపోగానే రాలిపోతుంది. మరి ఆత్మజ్ఞాని శరీరమా? ఆత్మజ్ఞానికి శరీరము లేదు. జలమునందు జలము, ఆకాశమునందు ఆకాశము, అగ్నియందు అగ్ని ఎలాగైతే కలిసిపోవు చున్నవో అలాగే ఆత్మజ్ఞాని సర్వగతమైన బ్రహ్మలో ఐక్యమగును.

ఇచ్చట ఐక్యమగుటయని తెలుపుటకూడా సంబంధిత సత్యమే. కుండ ఉన్నప్పుడు, కుండలోని ఆకాశము అనుట అలవాటు. కుండ పగిలిపోయినపుడు కుండలోని ఆకాశముకదిలి అనంతాకాశములో కలియుచున్నదా? కుండను గొనిపోవునపుడు కుండవచ్చునేగాని కుండలోని ఆకాశము రాదు కదా? కుండపగిలిపోగానే కుండలోని ఆకాశము అనంతాకాశములో కలిసినదని తెలుపుట ఎలాగో, ఉపాధులు నశించగనే బ్రహ్మజ్ఞాని సర్వగతమైన చైతన్యములో లయించుటకూడా అలాగుననే అవుతుంది.

కనుక ఆత్మజ్ఞాని బ్రహ్మమయ్యే ఉన్నాడు. కలియుటలేదు. విడిపోవుటలేదు. ఇదంతయూ ఉపాధిస్థాయినుండి జరిపిన చర్చయని గ్రహించాలి.

**అవతారిక:-** బ్రహ్మమును పొందినచో మరియొకటి వాంఛించ నవసరం లేదని ఈ శ్లోకములో తెలుపుచున్నారు.

యల్లాభాన్నాపరో లాభః
యత్సుఖాన్నా పరం సుఖం
యత్ జ్ఞానాన్నా పరం జ్ఞానం
తద్బ్రహ్మేత్యవ ధారయేత్ ॥ 54

యల్లాభాత్ = ఏది లభించగా, అపర: = అన్యమైన, లాభ: = లాభము, న = లేదు, యత్సుఖాత్ = ఏ సుఖము అందగా, అపరం = అన్యమైన, సుఖం = ఆనందము, న = లేదు, యత్ జ్ఞాత్వా = ఏ జ్ఞానమువలన, అపరం = అన్యమైన, జ్ఞానం = జ్ఞానము, న = లేదు, తత్ = అది, బ్రహ్మ = బ్రహ్మము, ఇతి = అని, అవధారయేత్ = ధ్యానించవలెను.

**భావము:- ఏది లభించినపిదప అంతకు మించి పొందవలసిన లాబము మరియొకటి లేదో, ఏసుఖము అనుభవించినపిదవ అంతకు మించి వాంఛించ వలసినసుఖము మరియొకటిలేదో, ఏ జ్ఞానమును పొందిన పిదప అంతకు మించి పొంద దగిన జ్ఞానము మరియొకటి ఉండదో, అట్టి బ్రహ్మమును తెలిసికొనుము.**

## వ్యాఖ్య

ఏది లభించిన తరువాత మరియొకటి పొందనవసరము లేదో అదియే బ్రహ్మము. వస్తువులను లేదా వ్యక్తులను పొందుట వస్తువుల కొరకు, వ్యక్తులకొరకు కాదు. ఆనందము కొరకు.

**'ఆత్మానస్తు కామాయ సర్వం ప్రియం భవతి'**

అని బృహదారణ్యకోపనిషత్తు నందు యాజ్ఞవల్క్యమహర్షి తెలియజేస్తాడు.

కొన్ని వస్తువులు లభించినపుడు మనకు సుఖం కలుగుతుంది. వస్తువులతో వచ్చిన సుఖం వస్తువులపై మోజు తీరగానే అదృశ్య మవుతుంది. లేదా మన దృష్టి మరొక వస్తువుమీదికి వెళ్ళినా మొదటి వస్తువు నిస్సారమవుతుంది. ఒక చక్రవర్తి యున్నాడు. అతనికి రాజ్యముంది. అందమైన అర్థాంగి ఉంది. ప్రజామన్నన లున్నాయి. చక్కని యవ్వనముంది. కావలసినంత భాగ్యముంది. గుణవంతులైన బిడ్డలున్నారు. అతను చాలా తృప్తిగా యున్నాడు. తనకేవిధమైన వాంఛలు లేవు.

అలాగే మరియొక సాధుపురుషుడున్నాడు. తనకు పైన తెలిపిన చక్రవర్తిగారివలె సుఖాన్నిచ్చునవేమీ లేవు. అయినా అతనూ చాలా సంతృప్తిగా యున్నాడు. తనకేవిధమైన కోరికలు లేవు.



చక్రవర్తికి కోరికలు లేనందున తృప్తిగా యున్నాడు. సాధుమహాత్మునికి కోరికలు లేనందున అతడు తృప్తిగా యున్నాడు. కానీ ఇద్దరూ ఆనందముగనే గోచరించినను ఇద్దరి ఆనందములో ఎంతో తేడావుంది.

తనకు అన్నీ ఉన్నవని భావించుటచేత చక్రవర్తికి తాత్కాలికంగా ఆనందము కలిగింది. అతని ఆనందము అనేక బాహ్యపరిస్థితులపై ఆధా రపడియున్నది. తనకున్న రాజ్యసుఖము మరియొకరిచేత అపహరించ బడుతుందేమోననే భయం వున్నది. ఈ క్షణంలో చక్రవర్తి సుఖంగా గోచరించినా మరుక్షణం మరికొన్ని సుఖాలను మనస్సు వాంఛించుటచే తాను దు:ఖవలయంలో తగుల్కొనును.

కానీసాధువు పరిస్థితి అదికాదు. ఏది పొందిన పిదప మరియొకటి పొందనవసరము లేదో అట్టి ఆత్మను పొందుటచేత తనకు శాశ్వతానందము లభించింది. తన ఆనందము బాహ్యపరిస్థితులపై ఆధారపడిలేదు. తన సర్వమునకు సంబంధించిన విషయమై యున్నది. తన ఆనందము ఇతరులచే అపహరించ బడేదికాదు. మనస్సులో కోరికలు కదలవు గనుక ఆప్తకాముడై సదానందస్వరూపుడై యున్నాడు.

ఇట్టి ఆత్మయే పరమలాభము, పరమసుఖము, పరమజ్ఞానమై యున్నదని, అట్టి బ్రహ్మమును తెలిసికొని తరించమని ఆచార్యులు తెలియజేయుచున్నారు.

అవతారిక:- ఏది తెలిసిన పిదప మరియొకదానిని తెలియ నవసరములేదో దానిని తెలుపుచున్నారు.

**యద్దృష్ట్వానాపరం దృశ్యం**
**యద్భూత్వా న పునర్భవ:**
**యత్ జ్ఞాత్వా నాపరం జ్ఞేయం** 55
**తద్బ్రహ్మేత్యవ ధారయేత్ ॥**

యద్దృష్ట్వా = ఏదిగాంచగా, అపరం = అన్యము, దృశ్యం = గాంచదగినది, న = లేదు, యద్భూత్వా = ఏది అనుభవించగా, పునర్భవ: = మరల జనించుట,

న = లేదు, యద్ జ్ఞాత్వా = ఏది తెలిసిన పిదప , అపరం = అన్యమైనది, జ్ఞేయం = తెలియదగినది, న = లేదు, తత్ = అది, బ్రహ్మ = బ్రహ్మము, ఇతి = అని, అవధారయేత్ = తెలుసుకొనవలెను.

**భావము:-** దేనిని దర్శించిన పిదప మరియొకటి దర్శించనవసరము లేదో, దేని ననుభవించిన పిదప మరల భూమియందు పుట్టుక వుండదో, దేనిని తెలుసుకొనిన పిదప మరియొక దానిని తెలుసుకొన నవసరములేదో అదియే బ్రహ్మమని తెలుసుకో.

## వ్యాఖ్య

కార్యములో యున్నది కారణమే అయినందున కారణమును దర్శించగనే కార్యములన్నియు దర్శించినట్లగును. చైతన్యము నందే సర్వము యున్నందున చైతన్యమును తెలుసుకొనిన జ్ఞానికి దానికి అన్యముగా తెలుసుకొన దగినది, దర్శించదగినది మరియొకటి లేదు. సకలము తనయందే ఇమిడి యున్నవి. తాను పూర్ణమై యున్నాడు. అందుచే తనలో ఏవిధమైన కోరికలు కదలవు. తాను ఆనందస్వరూపుడై యున్నాడు. అందుచే ఆనందము కొరకు అన్యవస్తువుల నాశించ పనిలేదు. తాను సర్వమైయుండి, సర్వమును తనలోనే గాంచ గల్గును.

**'యస్తు సర్వాణి భూతాని**
**ఆత్మన్యే వానుపశ్యతి'**

'ఆత్మజ్ఞాని సమస్త ప్రాణులను తన ఆత్మయందే గాంచునని' ఈశావాస్యోపనిషత్తు తెలుపుచున్నది. కనుక ఆత్మకన్నను అన్యమైనదేదియు లేదు. ఆత్మను తెలుసుకొనిన వానికి మరొకటి తెలియ నవసరములేదు.

ఆత్మజ్ఞానము కలుగుట యనగా అజ్ఞానము అంతరించినదని భావము. అజ్ఞానము అంతరించిన వ్యక్తికి వాసనలు లేవు. కర్మలు లేవు. అందుచేత అతడు మరల పుట్టవలసిన అవసరము లేక, జన్మరాహిత్యమును పొంది నిరంతరానంద స్వరూపుడై తరించును.



**అవతారిక:-** బ్రహ్మయొక్క అఖండ విభూతులను రాబోవు శ్లోకములో వివరించుచున్నది.

తిర్య గూర్ధ్వ మధః పూర్ణం
సచ్చిదానంద మద్వయం
అనంతం నిత్యమేకం యత్త
ద్బ్రహ్మే త్యవధారయేత్ ॥ 56

ఊర్ధ్వం = పైన, అధః = క్రింద, తిర్యక్ = అన్ని దిక్కుల, పూర్ణం = నిండినదియు, సచ్చిదానందం = అస్తిభాతిప్రియమై భాసించునదియు, అద్వయం = రెండు కానిదియు, అనంతం = అనంతమైనదియు, నిత్యం = నిత్యమైనదియు, ఏకం = ఏకమైనదియు, యత్ = ఏదున్నదో, తత్ = అది, బ్రహ్మ = బ్రహ్మము, ఇతి = అని, అవధారయేత్ = తెలుసుకొనవలెను.,

**భావము:-** అంతట నిండియున్నదియు. నచ్చిదానంద స్వరూపమై నదియు, రెండుకానిదియు, అనంతమైనదియు, నిత్యమైనదియు, ఏకమైనదియు- అదియే బ్రహ్మమని తెలుసుకొనుము.

## వ్యాఖ్య

రెండవ వస్తువును గాంచుటకు ముందే మనలో చైతన్యమున్నది. ద్వైతమును గుర్తించునది కూడా చైతన్యమయ్యే యున్నది. చైతన్యములో ద్వైతమును గాంచలేము. అందుచేత చైతన్యము అద్వయమై యున్నది. బాహ్య పరిస్థితులను, వాటినిగాంచు అంతఃకరణను రెండింటిని ప్రకాశింపచేయుటచే ఆత్మ ఏకమైయున్నది. ఏకమై, రెండవ వస్తువు లేనిదై నందున ఆత్మ అనంతమై యుండవలెను. అనంతమైనది వస్తువు కానేరదు. పరిమితమైనది కాదు. అందుచేత దానికి దిక్కులు, పైన, క్రింద, కుడి, ఎడమ అనునవి లేవు. అదియే బ్రహ్మమని ఆచార్యులు తెలుపుచున్నారు. అట్టి అద్వయ స్వరూపమైన బ్రహ్మను తెలుసుకొనగనే సంసారము సమూలంగా మాయమగును.

**భ్రాంతి ప్రత్యయ నిమిత్తమేవాయం సంసార భ్రమో**

**న తు పరమార్థః ఇతి సమ్యగ్దర్శనా దత్యన్త**

**మేవోపరమ్ ఇతి సిద్ధమ్**

'సంసారభ్రమ యనునది కల్పిత భ్రాంతియేగాని పారమార్థికంగా లేదు. కనుక సమ్యక్ జ్ఞానమనునది సంసారమును సమూలంగా నశింపజేయునది అని నిర్ణయమగుచున్నది' అని ఆచార్యులు తన గీతా భాష్యంలో తెలియజేసియున్నారు.

అవతారిక:- అనిత్యమైన జగద్భ్రాంతిని వదలి నిత్యమైన బ్రహ్మమును పొందుమని తెలుపుచున్నారు.

అతద్వ్యా వృత్తిరూపేణ
వాదాం తైః లక్ష్యతేఽద్వయం
అఖండానంద మేకం యత్త
ద్బ్రహ్మే త్యవ ధారయేత్ ॥ 57

వ్యావృత్తి రూపేణ = (నిషిద్ధ) ప్రక్రియచేత, అతత్ = ఇదికాదు, వేదాంతైః = వేదముచేత, లక్ష్యతే = తెలుపబడిన, అద్వయం = అద్వయము, అఖండానందం = పరానంద స్వరూపము, ఏకం = ఏకము, యత్ = ఏదో, తత్ = అది, బ్రహ్మ = బ్రహ్మము, ఇతి = అని, అవధారయేత్ = తెలుసుకొనవలెను.

భావము:- అసద్వస్తువులను నిషేధించి, అవ్యయమై, ఏకమై, ఆనంద స్వరూపమైన అధిష్ఠాన వస్తువే బ్రహ్మమని గ్రహించుము.

## వ్యాఖ్య

ఆత్మయే సత్తు. ఆత్మ కన్యముగా తెలియునదంతయూ అసత్తే. అది అధ్యాసజనితమై యున్నది. విచారణద్వారా అసద్వస్తువును నిషేధించి, ఆత్మాను భూతి పొందమని ఈ శ్లోకంలో ఆచార్యులు తెలియజేయుచున్నారు.

దేహము మొదలు కారణ శరీరమువరకు దృశ్యమాన జగత్తుతో కూడి సర్వమూ అనిత్యమే; అసత్తుయే. నశించు దేహము, చలించు ఇంద్రియాలు,



మారే మనస్సు, పరిణామము చెందు బుద్ధి, ఆద్యంతములున్న సుషుప్తి, అంతరించిపోవు అజ్ఞానము ఇవి యేవియు తానుకాదని తెలుసుకొని నిషేధించవలెను. సర్పమును నిషేధించి, రజ్జువును గ్రహించులాగున అసత్తును నిషేధించి సద్వస్తువును తెలియవలెను.

**జ్ఞాన నేత్రం సమాధాయ చోద్ధరే ద్వహ్ని సత్పరమ్**

**నిష్కలం నిశ్చలం శాంతం తద్బ్రహ్మాహ మితి స్మృతమ్**

"జ్ఞాననేత్రమును పొంది, అగ్నివలె, నిష్కలము, నిశ్చలము, శాంత స్వరూపమునగు బ్రహ్మమును నేనే నని స్మరించి తన్ను తాను ఉద్ధరించుకొనవలెను" అని అమృత బిన్దూపనిషత్ తెలుపుచున్నది.

అజ్ఞానజనితమై అసద్వస్తువులను నిషేధించగనే నశించనిదై ఆనంద స్వరూపమైన అధిష్ఠాన బ్రహ్మము అనుభవమునకు అందును. ఆ ఆత్మయే నీవు.

**యత్పరం బ్రహ్మ సర్వాత్మా విశ్వస్యాయతనం మహత్**

**సూక్ష్మాత్సూక్ష్మ తరం నిత్యం తత్త్వమేవ త్వమేవతత్**

ఏది పరబ్రహ్మముగను, అందరిలో భాసించు ఆత్మగను, విశ్వాధారముగను, సూక్ష్మముకంటె సూక్ష్మముగను నిత్యముగను యున్నదో అదియే నీవు, నీవే అది, అని కైవల్యోపనిషత్తు తెలుపుచున్నది.

అవతారిక:- అఖండ బ్రహ్మానంద స్వరూపమును తరతమ భేదముల ననుసరించి దేవతలు అనుభవించిన విధమును తెలియజేయుచున్నారు.

అఖండానంద రూపస్య
తస్యానందలవాశ్రితాః
బ్రహ్మాద్యా స్తారతమ్యేన
భవన్త్యా నన్దినోఽఖిలాః ॥ 58

బ్రహ్మాద్యాః = బ్రహ్మాది దేవతలు, అఖిలాః సర్వులు,. తారతమ్యేన = తరతమ భేదములను బట్టి, తస్య = అతని, అఖండానంద రూపస్య = అఖండానంద స్వరూపములో, ఆనందలవాశ్రితాః = స్వల్పమగు ఆనందమును, ఆనందినః = ఆనందించినవారు, భవంతి = అగుచున్నారు.

**భావము:- బ్రహ్మాది దేవతలు అట్టి అఖండానంద బ్రహ్మరసమును స్వల్పముగా వారివారి తరతమ భేదముల ననుసరించి రుచిచూసి యున్నారు.**

## వ్యాఖ్య

ప్రతివ్యక్తి ఆనందమును వాంఛించియే ప్రపంచములో కర్మలాచరించు చుండును. ఆనందమును కొన్ని పరిస్థితులలో పొందును. కొన్ని పరిస్థితులలో వ్యతిరిక్తమగు శోకమునుకూడా అనుభవించును. ఆనందము పొందినపుడుకూడా అందరి ఆనందము ఒకేరీతిలో లేదు. ఈ వ్యత్యాసములన్నియు మన కోరికలపై, కోరిన వస్తువులపై, వాటిని పొందు స్థితిగతులపై ఆధారపడి ఉంటాయి. ఈ లోకములో మనము ఆనందించు సుఖములో వ్యత్యాసమున్నట్లే, బ్రహ్మాదిదేవతలు కూడా వారు పొందు ఆనందమునందు వ్యత్యాసములను కలిగియే యున్నారు. ఈ విషయము తైత్తిరీయోపనిషత్తునందు తెలియజేయ బడియున్నది.

భూమండలాధిపత్యమును వహించు చక్రవర్తి సామాన్యులకంటే శతరెట్లు ఆనందము ననుభవించును. పుణ్యకర్మాచరణచే పొందిన తమ పదవులవలన మర్త్యగంధర్వులు చక్రవర్తి ఆనందముకంటే వందరెట్లు ఎక్కువ ఆనందమును కలిగియున్నారు. వారికన్నను వందరెట్లు ఆనందమును దేవగంధర్వులు పొందియున్నారు. పితృదేవతలు దేవగంధర్వుల కన్నా వందరెట్లు ఆనందమును కలిగియున్నారు. పితృదేవతల కన్నా వందరెట్లు ఆనందమును అజనదేవతలు కలిగియున్నారు. కర్మదేవతలు అజనదేవతలకన్నా వందరెట్లు ఆనందమును కలిగియున్నారు.యమ, అగ్ని, వాయుదేవతలు కర్మదేవతలకన్నను వందరెట్లు ఆనందమును కల్గియున్నారు. ఇంద్రుని ఆనందము యమాది దేవతలకన్నా



వందరెట్లు అధిక్యము. ఇంద్రునికన్నా బృహస్పతివందరెట్లు ఆనందమును అధికముగా కల్గియున్నాడు. ఇలాగే విరాట్, హిరణ్యగర్భ, ఈశ్వరాదులు. అయితే వీరు పొందు ఆనందములో వ్యత్యాసమున్నను ఇదంతయు ఆత్మానంద సాగరమునుండి వెలువడిన అమృతానంద ధారయేనని మరువకూడదు.

అవతారిక:- క్షీరమునందు వెన్నవలె బ్రహ్మము సర్వవ్యాపకమని నిర్ణయించుచున్నారు.

తద్యుక్త మఖిలం వస్తు
వ్యవహారస్త దన్వితః
తస్మా త్సర్వగతం బ్రహ్మ
క్షీరే సర్పిరి వాఖిలే ॥ 59

అఖిలం = సమస్తమైన వస్తు = వస్తువులు, తత్ = దానిచేత, యుక్తం = పరివ్యాప్తమైయున్నవి, తదన్వితః = దానివలననే, వ్యవహారః = కర్మములు, తస్మాత్ = అందుచేత, బ్రహ్మ = బ్రహ్మము, సర్వగతం = సర్వగతమైనది, క్షీరే = పాలయందు సర్పిః = వెన్న, ఇవ = వలె.

**భావము:- సమస్తమైన వస్తు ప్రపంచము బ్రహ్మముచే పరివ్యాప్తమై యున్నది. బ్రహ్మము వలననే సమస్త కర్మలు జరుగుచున్నవి. కనుక క్షీరములో వెన్నవలె బ్రహ్మము సర్వ వ్యాపకమై యున్నది.**

## వ్యాఖ్య

స్థావర జంగమాత్మకమగు సమస్త ప్రపంచమునందు బ్రహ్మము వ్యాప్తమై, దాగియున్నది. ఈ విషయమునే ఆచార్యులు ఈ శ్లోకములో తెలియజేయు చున్నారు. వస్తు ప్రపంచమంతయు బ్రహ్మముచే పరివ్యాప్తమై యున్నదని తెలుపు చున్నారు. కార్యమైన విశ్వమునందు కారణమైన బ్రహ్మాను తొలగించేందుకు వీలులేదు. ఆభరణమునందే బంగారును తొలగించినచో ఏమి మిగులును? అలాగే బ్రహ్మముచే పరివ్యాప్తమైన జగత్తులో బ్రహ్మముమ తొలగించ వీలుపడదు. కనుక జగత్తు బ్రహ్మమే అయియున్నది.

**' ఈశావాస్యం ఇదం సర్వం యత్ కించ జగత్యాం జగత్ "**

"సమస్తమైన ఈ విశ్వము భగవానునిచే పరివ్యాప్తమై యున్నది" అని ఈశావాస్యోపనిషత్తు తెలుపుచున్నది.

బ్రహ్మమువలననే సకల కర్మలు జరుగుచున్నవి అని తెలుపుచున్నారు. కర్మలు కదులుటకు ఆలోచనలు కారణమైయున్నవి. ఆలోచనలను కదిలించునది, కర్మలాచరించునట్లు చేయునది బ్రహ్మమే యని దాని భావము. అనగా బ్రహ్మము సమిష్టిలో వ్యాపించియున్నట్లే, వ్యష్టిలోనూ వ్యాపించియున్నాడని తెలియజేయు చున్నాడు.

అంతటా బాహ్యాభ్యంతరాలలో బ్రహ్మమే యున్నప్పుడు మనకెందుకని తెలియుట లేదు? అనే సందేహము రావచ్చును. ఈవిషయమును పాలలోని వెన్నవలె అనెడి చక్కని ఉపమానముతో ఆచార్యులు వివరించుచున్నారు. పాలలో వెన్న యున్నది. అది మనకు గోచరించు చున్నదా? లేదు. పాలు పెరుగు చేయాలి పెరుగులో కవ్వమువేసి చిలికినచో వెన్న వచ్చును. అలాగే పాలవలెయున్న మనస్సును శ్రవణమనెడి అగ్నితో కాచవలెను. మనన మనెడి తోడువేసి పెరుగు చేయవలెను. కవ్వముతో మథించుటవలె నిదిధ్యాస జరిపినచో అట్టి ధ్యాన నిర్మథనాభ్యాసములో పాలనుండి వెన్న వచ్చినట్లు బాహ్యాభ్యంతరాలలో బ్రహ్మము గోచరించును.

అవతారిక:- బ్రహ్మమునందు భాగములు, భేదములు దర్శనీయము కావని తెలియ జేయుచున్నారు.

అనణు మస్థూల మహ్రస్వ
మదీర్ఘ మజ మవ్యయం
అరూప గుణ వర్ణాఖ్యం
తద్బ్రహ్మే త్యవధారయేత్ ॥ 60



అనణు: = సూక్ష్మముకానిది, అస్థూలం = స్థూలము కానిది, అహ్రస్వం = పొట్టిది కానిది, అదీర్ఘం = పొడవుకానిది, అజం = పుట్టుకలేనిది, అవ్యయం = మార్పులేనిది, అరూప గుణ వర్ణాఖ్యం = రూపములేనిది, గుణము లేనిది, వర్ణము లేనిది, నామము లేనిది, తత్ = అది, బ్రహ్మ = బ్రహ్మము, ఇతి = అని, అవధార యేత్ = ధ్యానించుము.

**భావము:- సూక్ష్మముకానిది, స్థూలముకానిది, పొట్టిదిగానిది, పొడవు కానిది, పుట్టుకలేనిది, మార్పులేనిది, రూప గుణ, వర్ణ రహితమైనది ఏదియో అదియే బ్రహ్మమని ధ్యానించుము.**

## వ్యాఖ్య

బ్రహ్మము నిర్వికార సత్తా స్వరూపము. నిర్వికల్ప నిరంజన స్వరూపమై యున్నది. అది వస్తువు కాదు. అందుచేత రూపము లేదు. రూపరహిత చైతన్యము. రూపమైన శరీరము తాను కానందువలన అది స్థూలము కానిది. అయితే సూక్ష్మమైన ఆనందమయకోశము అది అని భ్రాంతి చెందవచ్చును. అది సూక్ష్మమూ కాదు. వస్తువు కానందున పొడుగు పొట్టిలేదు. అద్వయ సత్తా స్వరూపమైనందున నశించనిదియై అవ్యయమైనది. అవ్యయమైనందున రూపములేదు. మనస్సు కానందున గుణములేదు. పుట్టుక లేనందున వర్ణము లేదు. నామము లేదు అదియే బ్రహ్మము.

**నతస్య కశ్చిత్ పతిరస్తిలోకే**
**న చేశితా నై వ చ తస్య లింగమ్**
**స కారణం కారణాధి పాధిపో**
**న చాస్య కశ్చి జ్జనితా న చాధిపః**

ఈ లోకమునందు అతనికి పతిలేడు. అతనిపై ఎవ్వరికి ఆధిపత్యం లేదు. అతనిని గుర్తించుటకు ఏ గుర్తూ లేదు. అన్నింటికీ కారణం అతడే. జీవపాలకుడతడే. అతనికి తండ్రిలేడు, ప్రభువులేడు' అని శ్వేతాశ్వతరోపనిషత్తు అత్యద్భుతంగా నిర్వచించినది.

అవతారిక:- స్వప్రకాశ సత్తా స్వరూపము బ్రహ్మ అని వివరించుచున్నారు.

యద్భాసా భాస్యతే ఒర్కాది
భాస్యై ర్యత్తు న భాస్యతే
యేన సర్వమిదం భాతి
తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥ 61

యద్భాసా = దేని ప్రకాశముచేత, అర్కాది = సూర్యాదులు, భాస్యతే = ప్రకాశించుచున్నారో, యస్యై: = ఆ సూర్యాదులచే, యః = అది, తు = నిజానికి నభాస్యతే = ప్రకాశించుటలేదు, యేన = దేనిచేత, సర్వం = సమస్తమును, ఇదం = ఇది, భాతి = ప్రకాశించునో, తత్ = అది, బ్రహ్మ = బ్రహ్మము, ఇతి = అని, అవధారయేత్ = గ్రహించుము.

**భావము:-** ఏ దివ్య ప్రకాశముచే సూర్య చంద్రాదులు ప్రకాశించు చున్నారో, దేనిని సూర్య చంద్రాదులు ప్రకాశింపచేయలేరో, దేనిచేత ఈ దృశ్యమాన జగత్తంతయు శోభించుచున్నదో అదియే బ్రహ్మమని తెలుసుకొనుము.

## వ్యాఖ్య

ఆత్మ ప్రకాశైక స్వరూపము. బాహ్య జగత్తును సూర్యచంద్ర నక్షత్రాదులు ప్రకాశింపచేయుచున్నవి. సూర్యచంద్రాదులు స్వయం ప్రకాశితులు కారు. ప్రళయమునందు కొడిగట్టిన దీపమువలె అంతరించు చున్నారు. తమయందలి ప్రకాశము చైతన్యమునుండి అరువు తెచ్చుకొన్నదే. కనుక ఏ దివ్య ప్రకాశముచేత సూర్యచంద్రాదులు ప్రకాశించు చున్నారో అదియే బ్రహ్మము. బ్రహ్మమును అవి ప్రకాశింపచేయలేవు. ఏ చైతన్యప్రకాశము చేత తాము వెల్గొందుచున్నారో అట్టి సూర్య చంద్రాదులు తమ ప్రకాశమునకు ప్రకాశమైన కారణ ప్రకాశమును ప్రకాశింపచేయలేరు.

సూర్యచంద్రులను ప్రకాశింపచేయు శుద్ధచైతన్యమే జగత్తును ప్రకాశింపచేయుచున్నది. ఆ చైతన్యమే మన మనోబుద్ధులను ప్రకాశింపజేసి, తద్వారా బాహ్యంలో ప్రకాశించెడి సమస్తమును దర్శించునట్లు చేయుచున్నది.



కనుక చైతన్యమే సమస్తమును ప్రకాశింప చేయుచున్నది. సకలమును ప్రకాశింపజేయు తనను ప్రకాశింప చేయువారు ఎవ్వరూ లేరని ఆచార్యులు తెలియజేయుచున్నారు.

నతద్భాసయతే సూర్యో నశశాఙ్కోన పావకః
యద్గత్వా ననివర్తన్తే తద్ధామ పరమంమమ

"సూర్య, చంద్ర, అగ్నులు దానిని ప్రకాశింపచేయలేరు. దేనిని పొందినచో మఱల జన్మకు తిరిగిరారో అదియే నా ఉద్గమస్థానము, ఉత్తమ స్థానము' అని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీత-పురుషోత్తమప్రాప్తి యోగమునందు తెలిపిరి.

అవతారిక:- విశ్వమునందు చైతన్యము పరివ్యాప్తమైయున్న విధము వివరించబడుచున్నది.

స్వయమంతర్బహిర్వ్యాప్య
భాసయన్నఖిలం జగత్
బ్రహ్మప్రకాశతే వహ్ని 62
ప్రతప్తాయ స పిండవత్ ॥

బ్రహ్మ = బ్రహ్మము, అంతః = లోపల, బహి: = బయట, అఖిలం = సమస్త జగత్ = ప్రపంచము, భాసయన్ = ప్రకాశిస్తూ, వ్యాప్య = వ్యాపించియున్నది, వహ్ని = అగ్ని, ప్రతప్తాయసపిండవత్ = ఎర్రగా కాలిన ఇనుపముద్దలోవలె, ప్రకాశతే = వెల్గొందు చున్నది.

**భావము:-** ఎఱ్ఱగా కాలిన ఇనుపముద్దలో అగ్ని పరివ్యాప్తమై, తాను స్వప్రకాశమై వెల్గొందు చందమున బ్రహ్మము జగత్తునందు లోపల, బయట వ్యాపించి తాను స్వప్రకాశమై వెల్గొందుచున్నది.

## వ్యాఖ్య

స్థావర జంగమాత్మకమగు ఈ నానాత్వ విశిష్ట ప్రపంచమంతయు బ్రహ్మముచే పరివ్యాపకమై యున్నదని ఈ శ్లోకంలో శ్రీ శంకరులు తెలియజేయుచున్నారు. ఎచ్చట ఏవిధమైన ప్రకాశము గోచరించినను అది

బ్రహ్మమేనని తెలియవలెను. గోచరించుటకు, గ్రహించుటకు చాలా భేదమున్నది. నిప్పులో కాలిన ఇనుపముద్ద ఎర్రగా యుండును. ప్రకాశించుచుండును. ఇది అందరికి గోచరించును. ఇలా అందరూ చూడగలరు. అయితే ఇనుపముద్దనందలి ప్రకాశము, వేడి అగ్నిదే గాని ఇనుపముద్దది కాదని కొందరికే తెలియును. ఇది గ్రహించినవారే ప్రజ్ఞావంతులు. వేడి, వెలుతురు నిప్పు ధర్మాలేగాని ఇనుము యొక్క ధర్మాలు కావు. ఇనుము నల్లగా, చల్లగానే యుండినది. అగ్నిలో పరితప్తమై ఎర్రగా, వేడిగా మారినది. ఈ ప్రకాశము అగ్నిదేకాని ఇనుముకు సంబంధించి నదికాదు.

ఇనుపముద్దలో అగ్ని వ్యాపించియున్న చందమున ఈ దృశ్యమాన జగత్తునందు బ్రహ్మము వ్యాపించియున్నాడు. ఈజగత్తునందలి ప్రకాశమంతయు చైతన్యముదేగాని జగత్తునకు సంబంధములేదు. అలాగే వ్యక్తియొక్క దేహేంద్రియ మనోబుద్ధులు ప్రకాశించుటకు కూడా చైతన్యమే ఆధారమై యున్నది. చైతన్యస్పర్శ లేనిచో మరుక్షణమే శరీరము శవముగా మారును.

అవతారిక:- బ్రహ్మమే సత్యము. దానికి అన్యమైనది మిథ్యయని ఈ శ్లోకము తెలియ జేయుచున్నది.

జగద్విలక్షణం బ్రహ్మ
బ్రహ్మణోఽన్య న్న కించన
బ్రహ్మాన్య ద్భాతి చేన్మిథ్యా
యథా మరుమరీచికా ॥ 63

బ్రహ్మ = బ్రహ్మము, జగత్ = ప్రపంచమునకు, విలక్షణం = అన్యమైనది, బ్రహ్మణః = బ్రహ్మమునకు, అన్యత్ = వేరుగా, కించిన = కొద్దియును, న = లేదు, బ్రహ్మాన్యత్ = బ్రహ్మమునకు వేరుగా, భాతి = గోచరించునది, చేత్ = అయినచో, మిథ్యా = అసత్యము, మరు మరీచికా = ఎండమావి, యథా = వలె.

**భావము:- బ్రహ్మము జగత్తునకు విలక్షణమైనది. బ్రహ్మముకాని దంటూ ఏమీలేదు. బ్రహ్మము కంటే అన్యముగా ఏవస్తువైనా గోచరించినచో అది ఎండ మావులలో నీటివలె అసత్యమైనది.**



## వ్యాఖ్య

జగత్తు నామ రూపాత్మకమై తెలియుచున్నది. బ్రహ్మము నామరూప క్రియా రహితము. కనుక బ్రహ్మము జగత్తు కాదు. విచారణ సాగించగలిగిన మనస్సునకు జగత్తు మాయారూపమే. బంగారు కన్నె వేరుగా ఆభరణ మున్నదా? రజ్జువు కన్నా వేరుగా సర్ప మున్నదా? అయితే లేని సర్పమును రజ్జువు నందు ఆరోపించుటయే భ్రాంతి. భ్రమలో వున్నవ్యక్తికి సర్పము సత్యముగనే గోచరించును. అలాగే వివేకశూన్యునికి జగత్తు సత్యమై గోచరించును. చూచేవాని అంతర్యములో జగత్తు సత్యమైయున్నదేగాని వాస్తవానికి బాహ్యంలో సత్యముగా లేదు. అలా ఉండగలిగినచో జ్ఞానికి కూడా సత్యమై గన్పట్టాలి. అలా జరుగుటలేదు.

నిద్రపోకుండా మారాంచేయు కుర్రవానికి కథలుచెప్పి నిద్రింపజేయుట సాధారణ అలవాటుగా పెద్దలు పాటిస్తుంటారు. కథ మొదలెడుతారు. ముగ్గురు రాజకుమారులు ఒకేచోట కలిసి ఆనందంగా జీవించేవారు. వారిలో ఇద్దరింకా పుట్టలేదు. మూడవవాడు తల్లి గర్భంలోనే ప్రవేశించ లేదు. వీరు ముగ్గురుకలసి శూన్య నగరంలో నివసించే వారు. సూర్యుడు ఉదయించని ఒకనాడు వీరు ముగ్గురు కలిసి వేటాడుటకు ఆకాశంలో నడచివెళ్ళారు. మార్గమధ్యంలో అంతరిక్షాన యున్న వృక్షములందలి ఫలములను చేతులు చాచకనే కోసుకొని ఆరగించారు. వారు ఇతరులను చూడరు. ఇతరులకు కన్పించరు.

ఈ కథ పిల్లవానికి వినను సొంపుగా యుండును. కథ సత్యముగా తోచును. ఆ కుర్రవాని మనస్సు విరబూయక పోవడమే ఈ అయోమయ ఆనందమునకు కారణము. అలాగే పిల్లలవలె విచక్షణా జ్ఞానము లేనివారికి ఈ ప్రపంచము సత్యమై భాసించును. జ్ఞానము కలుగగనే పెద్దవారు పైకథను విని ఆనందించలేనట్లు, ఈ ప్రపంచములో రమించుటకు ఇష్టపడరు.

బహ్మముకన్నా అన్యముగా ఏ వస్తువు గోచరించినా అది ఎండమావిలో నీటివలె అసత్యమైనదని భావించమని ఆచార్యులు తెలియజేయుచున్నారు.

లేనిది ఉన్నట్లుగా గోచరించడము భ్రాంతి అయినపుడు, ఆ గోచరించు దృశ్యము చూచువారి మనస్సుపై ఆధారపడియున్నందున, అందరికీ ఒకే విధమైన దృశ్యము గోచరించ నవసరములేదు. రజ్జువును దర్శించలేని అజ్ఞానములో అది కొందరికి సర్పముగా గోచరించినది. కొందరికి నీటిచారగా గోచరించినది. కొందరికి భూమి పగులుగా గోచరించినది. రజ్జువు కన్నా అన్యముగా ఏది గోచరించినా అది మిథ్యయే. అందుచేతనే బ్రహ్మముకన్నాఅన్యముగా ఏ వస్తువు గోచరించినా అది మిథ్యయేనని ఆచార్యులు తెలియజేయుచున్నారు.

అవతారిక:- బ్రహ్మ జ్ఞానముతో జగత్తు బ్రహ్మముగా తెలియునని తెలుపు చున్నారు.

దృశ్యతే శ్రూయతే యద్య
ద్బ్రహ్మణో౽ న్యన్న తద్భవేత్
తత్త్వజ్ఞానాచ్చ తద్బ్రహ్మ
సచ్చిదానంద మద్వయమ్ ॥ 64

దృశ్యతే = చూడబడునది, శ్రూయతే = వినబడేది, యద్యత్ = ఏదియున్నదో, తత్ = అది, బ్రహ్మణో౽న్యత్ = బ్రహ్మముకన్నా అన్యము , న = కాదు, తత్త్వజ్ఞానాత్ = తత్త్వజ్ఞానముతో, చ = మరియు, తద్బ్రహ్మ = ఆ బ్రహ్మము, సచ్చిదానంద = సచ్చిదానందమైనది, అద్వయమ్ = రెండుకానిది, భవేత్ = అగుచున్నది.

**భావము:- చూడబడి, వినబడేదంతయు బ్రహ్మమేగాని అన్యము కాదు. సత్యజ్ఞానము కలుగగానే జగత్తు, సచ్చిదానంద స్వరూపమైన అద్వయబ్రహ్మ స్వరూపముగా గోచరించును.**

## వ్యాఖ్య

మట్టి తెలియబడగానే మట్టిపాత్రలన్నియు మట్టికన్నా అన్యము కాదని తెలియును. మట్టిపాత్రలు అనేక రూపాలలో గోచరించుచున్నను అందులో సత్తా స్వరూపమైనది మట్టియేనని తెలియును. అలలు సముద్రమునకు



అన్యముకాదు. అలలు చిన్నవి, పెద్దవిగా వచ్చిపోతున్నను వాటికి కారణమైనది సాగరమేనని తెలియును. అల సాగరము నుండి జనించినది. సాగరములోనే ఉంటుంది. సాగరములోనే లయిస్తుంది. నామరూపములను వేరుచేయగా అచ్చట ఉన్నది సాగరమే.

అలాగే కనపడి, వినబడేదంతయు బ్రహ్మముకన్నా అన్యము కాదు. కలలో గోచరించిన వస్తువులు, వినిపించిన శబ్దములు కలగాంచు వానికన్నా అన్యము కావు. అలాగే జాగ్రదవస్థలో గోచరించు రూపములు, వినబడు శబ్దములు చూచువానికన్నా అన్యముకాదు. చూచే వ్యక్తి చైతన్యము.అందుచేత చూడబడు దృశ్యప్రపంచముకూడా చైతన్యము. ఈ ఆత్మజ్ఞానము కలుగగనే జగత్తు సచ్చిదానంద స్వరూపముగా, అద్వయ సత్తా స్వరూపముగా గోచరించునని శ్రీశంకరులు తెలియజేయుచున్నారు.

' జాగ్రతః ప్రత్యయా భావం యస్యాహుః ప్రత్యయం బుధాః '

' జాగ్రదవస్థలో యుండగనే ఎవ్వనికి జగద్భావము నశించునో ఆ స్థితియే జీవన్ముక్తస్థితియని మహోపనిషత్తు నిర్వచించినది.

అవతారిక:- జ్ఞాననేత్ర మున్నవానికే ఆత్మదర్శనమగునని రాబోవు శ్లోకము నిరూపించుచున్నది.

సర్వగం సచ్చిదాత్మానం
జ్ఞాన చక్షుర్నిరీక్షతే
అజ్ఞాన చక్షుర్నేక్షేత 65
భాస్వంతం భానుమంధవత్

సర్వగం = సర్వగతమైనది, సచ్చిదాత్మానం = సచ్చిదాత్మను, జ్ఞానచక్షుః = జ్ఞానలోచనములు, నిరీక్షతే = చూచును, అజ్ఞానచక్షుః = అజ్ఞానముచే చెదరిన నేత్రములు, న ఈక్షేత = చూడలేవు, భాస్వంతం = ప్రకాశించు, భానుం = సూర్యుని, అంధవత్ = గ్రుడ్డివానివలె.

భావముః- సచ్చిత్స్వరూపమైన ఆత్మ సర్వగతమైనను జ్ఞాననేత్రములకే గోచరించును. ప్రకాశవంతమైన సూర్యుని అంధుడు దర్శించలేని విధముగా అజ్ఞాన దృష్టికి ఆత్మ గోచరించదు.

## వ్యాఖ్య

సృష్టి దృష్టిపై ఆధారపడి ఉంటుంది. దృష్టి జ్ఞానాకారమైనచో సృష్టి బ్రహ్మాకారము. దృష్టి అజ్ఞానపూరితమైనచో సృష్టి జగదాకారము. అద్వయము, చైతన్యస్వరూపమైన ఆత్మను నేత్రములు చూడలేవు. బహిర్దృష్టి గల నేత్రములు భ్రాంతినే దర్శించును. ఇదే దృష్టి అంతర్ముఖమై వస్తురహిత చైతన్యములో లయించినపుడు అక్కడనుండి కదులు శుభదృష్టి చైతన్యదృష్టియే గాని మరొక్కటయ్యేందుకు వీలు లేదు. అంతఃకరణ నిర్మలమై నిరంజనమైనది. నిర్మలమనస్సు నిర్మలత్వమునే దర్శించగలదు. అదియే జ్ఞానచక్షువు. జ్ఞానచక్షువులు గలవానికి సృష్టి అంతయు జ్ఞానమయంగా గోచరించును.

అజ్ఞానికి నామరూపములే శాశ్వతములుగా భాసించును. సర్వగతమై ఆత్మ ప్రకాశించుచున్నను అజ్ఞాని దర్శించలేడు.

సూర్యప్రకాశము నలువైపుల వ్యాపించియున్నది. అయినను అంధుడు ఆ ప్రకాశమును గ్రహించలేడు. గాంచలేడు. సూర్యుడు ప్రకాశించుటలేదు యనుటకు అంధుడు ప్రమాణమా? అంధత్వము తొలగినచో సూర్యుని దర్శించగలుగును అలాగుననే అజ్ఞాని ఆత్మను దర్శించలేడు. జ్ఞాని సర్వము బ్రహ్మమయముగా గాంచును.

అవతారికః- శ్రవణ మననాదులు జీవుని శుద్ధిచేసి ఆత్మజ్ఞానమును ప్రసాదించునని తెలుపుచున్నాడు.

**శ్రవణా దిభి రుద్దీప్తో**
**జ్ఞానాగ్ని పరితాపితః**
**జీవ స్సర్వ మలాన్ముక్తః**
**స్వర్ణవత్ ద్యోతతే స్వయం ॥ 66**



శ్రవణాదిభిః = శ్రవణాదులచే, ఉద్దీప్త = ప్రభావితుడై, జ్ఞానాగ్ని పరితాపితః = జ్ఞానాగ్నియందు కాల్చబడిన, జీవః = జీవుడు, సర్వమలాత్ = సకల మాలిన్యమునుండి, ముక్తః = విడిపడి, స్వర్ణవత్ = స్వర్ణమువలె, స్వయం = స్వయముగా, ద్యోతతే = ప్రకాశించును.

**భావముః- పుటము పెట్టబడిన స్వర్ణము తనలోని మాలిన్యమును వీడి శుద్ధమై ప్రకాశించునట్లు, శ్రవణ మననాదులచే ప్రజ్వలింప బడిన జ్ఞానాగ్నియందు దహించబడిన జీవుడు మాలిన్యమును వీడి ప్రకాశించును.**

## వ్యాఖ్య

మాలిన్యముతో కూడితే జీవాత్మ. నిర్మలమైనచోపరమాత్మ. మాలిన్యము తొలగినచో జీవాత్మయే పరమాత్మ యగుచున్నాడు. అదియే ముక్తి లేక మోక్షము. ఇది ఉన్నదేకాని కానున్నది కాదు. అందుచేత ప్రయత్నముతో కూడిన కర్మలద్వారా ఆత్మ లభ్యంకాదు. మనోబుద్ధులను శుద్ధిచేయుటయే దానికి మార్గము. దానినే వేదాంత పరిభాషలో, 'సమకార్యం' అందురు. నిర్మలమైన సరస్సులో ప్రతిబింబము గోచరించునట్లు నిర్మల అంతఃకరణలో ఆత్మ స్వతస్సిద్ధముగా భాసించును.

అంతఃకరణను శ్రవణ మననాదుల ద్వారా శుద్ధి చేయవలెనని ఉపనిషత్తులు తెలుపుచున్నవి. గురువు దగ్గర చక్కగా శ్రవణముచేసి శ్రవణము చేసిన విషయమును మననంచేసి, మననమైన విషయమును నిధిధ్యాసలో స్థిరపరచుకోగానే, తద్వారా జనించే జ్ఞానాగ్నియందు పరితప్తమైన జీవుడు జీవ మాలిన్యమును పోగొట్టుకొని ఆత్మప్రకాశముతో వెల్గొందును. ఈ విషయమునే పుటము పెట్టబడిన స్వర్ణమును ఉదహరించుచు ఆచార్యులు చక్కగా వర్ణించుచున్నారు.

బంగారును పుటము పెట్టగనే అందులోని మాలిన్యము తొలగించబడి, పచ్చని కాంతితో మెరయుచుండును. అయితే బంగారునందలి పసిమి, ప్రకాశము బంగారుకు సంబంధించినదేగాని అగ్నికి సంబంధించింది కాదు.

పుటము వేయుటచేత మాలిన్యము తొలగించబడగా స్వర్ణము స్వతస్సిద్ధమై భాసించినది. అలాగే జ్ఞానము శ్రవణమననాదులవలన రాదు. అలా వచ్చినట్లయిన శ్రవణ మననాదులు కారణముకాగా జ్ఞానము కార్యమగును. కార్యము కారణముకన్నా భిన్నము కానందున జ్ఞానము కుందేటికొమ్ముయే కాగలదు. జ్ఞానము జీవి స్వరూపమేకాని అన్యము కాదు. పుటము పెట్టబడిన బంగారమువలె, శ్రవణమననాదులవలన మాలిన్యము దూరముకాగా ఆత్మ స్వతస్సిద్ధమై భాసించును.

అవతారిక:- జ్ఞానస్వరూపమైన ఆత్మ అజ్ఞాన తిమిరమును హరించును.

హృదాకాశోదితోహ్యాత్మా
బోధభానుస్తమోఽపహృతా
సర్వవ్యాప్తీ సర్వధారీ
భాతి భాసయతేఽఖిలమ్ ॥ 67

హృదాకాశోదిత: = హృదయాకాశములో ఉదయించిన, ఆత్మాహి = ఆత్మయే, బోధభాను: = జ్ఞానసూర్యుడై, తమ: = చీకటిని, అపహృత: = నశింపచేయును, సర్వవ్యాపి = సర్వవ్యాపియు, సర్వాధారి = సర్వమునకు ఆధారమునునై, భాతి = ప్రకాశించును, అఖిలం = సర్వమును, భాసయతే = ప్రకాశింపచేయును.

**భావము:- జ్ఞానభాస్కరుడైన ఆత్మ హృదయాకాశములో ఉదయించి అజ్ఞాన తిమిరమును హరించుచు, సర్వవ్యాపియై, సర్వుల కాధారమై, తాను ప్రకాశించుచు, సమస్తమును ప్రకాశింప చేయును.**

## వ్యాఖ్య

రాత్రిపూట ఆకసమున చీకట్లు వ్యాపించును. సూర్యోదయము కాగానే చీకట్లు చెదరి వెలుగు ప్రసరించును. మానవ హృదయముకూడా అజ్ఞానాంధకారముచే దట్టముగా వ్యాపించియుండును. చీకటిలో వస్తువు గోచరించనట్లు అజ్ఞానాంధకారములో పరిభ్రమించు వానికి సత్య వస్తువు గోచరముకాదు.

ఆకాశమున సూర్యుడు ఉదయించగనే అంతవరకున్న అంధకారము అదృశ్యమగువట్లు , హృదయాకాశమున జ్ఞానసూర్యుడు ఉదయించగనే



అంతవరకు అలుముకొనియున్న అజ్ఞానాంధకారము అదృశ్యమై, జ్ఞానద్యుతి మిగులును. అట్టి ప్రకాశము ఆత్మప్రకాశమే. అది స్వప్రకాశ చైతన్యమై యున్నది. అదియే సర్వవ్యాపియై యున్నది. సర్వాధారమైయున్నది అని అధిష్ఠాన సత్తా స్వరూపమైన ఆత్మను పవిత్రమైన ఈ ఆత్మబోధ గ్రంథమును ఆచార్యులు ముగించబోతూ తెలియజేయుచున్నారు.

అవతారిక:- ఆత్మవేత్త, ఆత్మవిదుడై ఆత్మానందము ననుభవించు రీతిని వివరించుచున్నారు.

దిగ్దేశ కాలాద్యనపేక్ష్య సర్వగం
శీతాది హృన్నిత్య సుఖం నిరంజనం
యస్స్వాత్మ తీర్థం భజతే వినిష్క్రియః
స సర్వవిత్ సర్వగతోఽ మృతో భవేత్ ॥ 68

ఇత్యాత్మ బోధ: సమాప్తి:

దిగ్దేశకాలాది = దేశకాలాదులు, అనపేక్ష్య = వీడినవాడై, సర్వగం = సర్వగతము, శీతాదిహృత్ = శీతాది ద్వంద్వములను నశింపజేసి, నిత్యసుఖం = సదానందము, నిరంజనము = నిర్మలము, య: =ఎవడు, స్వాత్మతీర్థం = తన యాత్మయనెడి పవిత్రస్థానములో, భజతే = ధ్యానించునో వినిష్క్రియ: = కర్మలను పరిత్యజించి, స: = వాడు, సర్వవిత్ = సర్వవిదుడు, సర్వగత: = సర్వవ్యాపి, అమృత: = అమరుడు, భవేత్ = అగుచున్నాడు.

**భావము:- సమస్త కర్మలను వదలి, దేశకాలాదులనుండి విడిపడి, సర్వగతమైనదియు, శీతోష్ణాది ద్వంద్వములను తొలగించు నదియు, అనంతానంద మైనదియు, దేనిని అంటనదియు నగు ఆత్మనే ధ్యానించు ఆత్మవేత్త సర్వజ్ఞుడై సర్వవ్యాపియై అమరత్వమును పొందును.**

## వ్యాఖ్య

అజ్ఞాన జనితమైన కర్మలు జ్ఞానమును ప్రసాదించలేవని గ్రహించి కర్మలనుండి విడిపడినవాడై, మనోనిర్మితమైన దేశకాలాదుల నుండి జారిపడినవాడై, మనస్సును అధిగమించి, మనస్సుచే గుర్తించబడు శీతోష్ణాలను

## ఆత్మబోధ

జయించినవాడై, వస్తు ప్రపంచ దు:ఖమయ స్థితిని చక్కగా ఆకళింపజేసుకొని, అద్వయ సత్తా స్వరూపమునందే శాశ్వత సుఖమున్నదని గుర్తించి దానినిపొంది, అనిర్వచనీయమైన నిర్విషయానంద సాగరములో ఓలలాడుచు నిత్యముక్తమై, నిర్మలమై, నిరంజనమై భాసించు ఆత్మధ్యానమును కొనసాగించు ఆత్మవేత్త సర్వము ఏకపదార్థముచే పరివ్యాప్తమై యున్నదని గ్రహించి, ఆ ఏకవస్తువు తనకన్నా అన్యము కాదని గుర్తించి, సర్వమును తనయందే గాంచుటచేత సర్వజ్ఞుడై, సర్వము తానే వ్యాపించియుండుటచేత సర్వగతమై, సర్వగతమైనందున, నిత్యుడై భాసించుచు అమరుడై, అమృతానంద స్వరూపుడగు చున్నాడు.

ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోఽంతర్యామ్యేష
యోని: సర్వస్య ప్రభు వాప్య యౌ హి భూతానామ్ ॥

'ఇతడే సర్వేశ్వరుడు, సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి, సర్వమునకు కారణమైనవాడు, ఉత్పత్తి, వినాశమూ అన్నీ అతడే' అని మాండూక్యోపనిషత్తు ఆత్మవేత్తను గూర్చి వివరించినది.

ఆత్మబోధ సమాప్తము

ఓం తత్సత్

ఓం.... ఓం..... ఓం....